కొండపల్లి వారి

# శ్రీలక్ష్మీగణపతి మంత్రసిద్ధి

## శ్రీ లక్ష్మీగణపతి మహా మంత్రములు
నిత్య జప తప మంత్ర యంత్ర తంత్ర హోమ స్తోత్ర
కవచ మాలా మంత్రములు

(నిత్య జీవితములో జనుల నానావిధ బాధల నివారణకు సర్వారిష్టాల సర్వగ్రహ దోషాల నివారణకు సర్వాభీష్ట ప్రదాయకమగు ఐశ్వర్యప్రదమగు విస్తృత మంత్రరాజము )

రచయిత- సంకలనకర్త
**కొండపల్లి వెంకటేశ్వర్లు**, M.A., LLB.,
విశ్రాంత లెక్చరర్,
డోర్‌నెం. 32-11-715, 7/3 శ్రీనగరు,
గుంటూరు - 522 002



**మోహన్ పబ్లికేషన్స్**
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమహేంద్రవరము -533 101.

2019 వెల : 200-00

శ్రీరస్తు　　　　　　శుభమస్తు　　　　　　అవిఘ్నమస్తు

ఓం హరిః ఓం నమః శివాయ

పరబ్రహ్మణే నమః ఓం

# హృదయానంద పూర్వక అంకితం

ఈ దాసాను దాసునకు దివ్యమైన జన్మను ప్రసాదించిన దివ్య దంపతులైన కీ.శే. కొండపల్లి వెంకయ్యగారు, కీ.శే. రుక్మిణమ్మగార్లకు అలాగే 33 సంవత్సరాల క్రితం శనివారము, అశ్వనీ నక్షత్ర పర్వదినాన తెల్లవారు జామున దివ్యస్వప్నమున మంత్రోపదేశము గావించిన (పంచ ముఖి వీరాంజనేయ మహామంత్రము) హరిహర పరబ్రహ్మ దేవతాంశ సంభూతుడైన సద్గురువైన శ్రీపంచముఖి వీరాంజనేయ స్వామివారికి మరియు అడుగడుగునా నా ఉపాసనోన్నతికి పాటుపడిన నా ఆత్మలో ఆత్మలైన సద్గురువులైన కీ.శే. బ్రహ్మశ్రీ వంగరకోటి రామాంజనేయ శర్మ గారు మరియు బ్రహ్మశ్రీ పెళ్లూరి కోటయ్య (శ్రీచక్రోపాసకులు) గార్ల దివ్య చరణార విందములకు శతకోటి వందనములతోను భక్తి ప్రపత్తులతోను ఈ దేవతా ప్రసాదమైన చిరు గ్రంథాన్ని సమర్పించు కొనుచున్నాను.


ఇట్లు

గ్రంథకర్త

**కొండపల్లి వెంకటేశ్వర్లు,** M.A., LLB.,

రచన, సేకరణ సంచలనాత్మక వివరణకర్త,

రిటైర్డ్ లెక్చరర్, ప్రభుత్వ కళాశాలలు,

గుంటూరు – 522 002

సెల్ : 8985185556

## ముందుగా సంకలన కర్తయైనటువంటి నా గురించి పాఠకులతో కొన్ని మంచి మాటలు

మొదటగా ఈ దైవికమైన పవిత్ర గ్రంధరచన, సేకరణ, సంకలనాత్మక కర్తనైన నా గురించి పాఠకదేవుళ్ళకు సవినయంగా మనవి చేసుకోవడం నా విద్యుక్త ధర్మంగా భావిస్తున్నాను. నేను నెల్లూరు జిల్లాలోని రావిపాడు గ్రామంలో పుణ్యదంపతులైన కొండపల్లి వెంకయ్య, రుక్మిణమ్మ గార్లకు 1954వ సంవత్సరంలో జన్మించాను. మా అమ్మ మహాభక్తురాలు, పుణ్యవంతురాలు, సంస్కారవంతురాలు. మా నాన్నగారు కుటుంబ బాధ్యతలతో తలమునకలై ఉండేవారు. 1974లో మా అమ్మ వైకుంఠప్రాప్తి పొందారు. మా నాన్నగారు వీలున్నప్పుడల్లా ధ్యానానికి (ప్రదక్షిణ సేవకు) నా తోటి శ్రీశైలము, ఘటికాచలము (తమిళనాడు) వస్తూ, ఒక మండలము లేక అరమండలము లేక పావు మండలం నాతో ఉండేవారు. నా విద్యాభ్యాసం నెల్లూరు, గుంటూరు, తిరుపతి, హైదరాబాద్ లలో జరిగింది. 1976, 1977వ సంవత్సరాలలో జరిగిన గ్రూప్-4 సర్వీసెస్‌లో రాష్ట్ర మొదటి ర్యాంకులోను, గ్రూప్-2 విభాగంలోను మామూలు ర్యాంక్‌తో ఉద్యోగాలు పొంది,రాష్ట్ర సచివాలయంలో కొంతకాలము ఉద్యోగం చేశాను. తదుపరి వ్యక్తిగత కారణాలపై గుంటూరు విద్యాశాఖకు బదిలీపై రావడం జరిగింది. 1983 కార్తీకమాసంలో భగవంతుని ఆరాధించాలి అనే నిరంతర తపన నన్ను ధ్యానయోగ సాధనకు పురికొల్పింది. 1977లో నా వివాహం జరిగింది. ఇద్దరు సంతానం ఉన్నతోద్యోగాలలో స్థిరపడ్డారు. 2011వ సంవత్స రంలో నేను పదవీ విరమణ చేయడమైంది.

నేను నా గృహంలో నా బ్రాహ్మణ స్నేహితుల సలహా సహకారంతో దేవతారాధనను మొదలెట్టి తొలుతుగా పరమశివ, మహావిష్ణు, శాక్తేయ, లక్ష్మీ, ఆంజనేయ, సుబ్రహ్మణ్య, కాలభైరవ, నారసింహ స్తోత్రాలను ఒక్కొక్కటి 11 సార్లకు తక్కువ కాకుండ శుచి శ్రద్ధ భక్తి అనే మూడు అంగాలు పునాదులుగా చేసుకొని ప్రార్థించాను. కొన్నాళ్లకు నా మానసిక స్థితిలోగాని, బుద్ధిబలం, ఆత్మస్థైర్యంలోను వచ్చిన మంచి మార్పులను గమనించాను. అదేకాలంలో సత్ గురువుద్వారా మంత్రోపదేశం పొందాలనే బలమైన కోర్కె నాలోకలిగి సద్గురు లక్షణాలు కల్గిన వారి కొరకు 6 నెలల పాటు అన్వేషించాను. చివరకు ఒక వృద్ధబ్రాహ్మణ వర్యుల ద్వారా బ్రహ్మ చారి, సద్గుణ, సదాచార సంపన్నులైన భూత భవిష్యత్ ద్రష్టఅయినటువంటి శ్రీమాన్ బ్రహ్మశ్రీ వంగర రామాంజనేయ శర్మగారిని కలుసుకోగలిగాను. వారి ద్వారా ఆంజనేయ మరియు నారసింహ మంత్రాలను గ్రహించి మంత్ర శ్లోకాలు నిత్యం ఒక్కొక్క మంత్రం వేయిసార్లు

వంతున ధ్యానించసాగాను (3గం॥కాలము). నా ఉపాసన ఉదయం తె.జా. 4గం॥ నుండి ఉదయం 10 గం॥వరకు సాగేది. ఈ సంవత్సర కాలంలోనే అద్భుతమైన యోగాను భూతులు పొందాను. భూత, భవిష్యత్ వర్తమాన స్థితిగతులు స్పష్టంగా తెల్సుకొనే స్థితికెదిగాను. ఆ తర్వాత కొన్నాళ్లకు పరమాత్మే స్వప్నమున పంచముఖి వీరాంజనేయ మంత్రాన్ని ఉపదేశించడం, అలాగేపరమాత్మనే గురువుగా భావించి ఉత్కృష్టమైన అష్టముఖ గండభేరుండ జ్వాలానరసింహ ఉపాసనను, దుర్గా ఉపాసనను ఉపాసించే భాగ్యం కలిగింది. నాలో ఉన్న అరిషడ్వర్గాలు అణగారి పోవుటను, సాత్విక భావనలు వృద్ధిచెందడం గమనించాను. నా సుదీర్ఘ ఉపాసనా కాలంలో వివిధ యోగానుభూతులు కొన్ని మీ ముందు ఉంచటం నా ధర్మంగా భావిస్తున్నాను.

**స్వప్నమున త్రిమూర్తుల రూపంలో సద్గురువుల సాక్షాత్కారం :**

1984 జనవరి మాసంలో త్రిమూర్తులు సద్గురువుల రూపంలో దర్శన మిచ్చారు. బ్రహ్మ విష్ణువులు భూమిపైన, శివభగవానులు ముసలి ఎద్దుపై కైలాస పర్వముపై నాట్యము చేస్తూ దర్శనమివ్వగ నేను నమస్కరించడం జరిగింది. ఇది సద్గురు సాక్షాత్కారమని నా మానస గురువులు ఇద్దరు నాతో చెప్పడం జరిగింది. ఇక దేవతానుగ్రహం సులభతరం అని చెప్పారు.

**శివ కేశవ అభేదాన్ని పాటించమని పరమాత్మ సూచన :**

స్వప్నమున అస్పష్టంగ కన్పిస్తున్న ఒక వ్యక్తి శివకేశవ భేదాన్ని పాటించ వద్దంటూ శివకేశవ అభేద శ్లోకమైన శివాయ విష్ణురూపాయ శివ రూపాయ... శ్లోకాన్ని చెప్పడం జరిగింది. ఆ శ్లోక అర్థాన్ని తెల్సుకోవడం జరిగింది.

**ధ్యానంలో మొదటిసారి శ్రీరామ చంద్రుని దర్శనం :**

1984 సంవత్సరం జనవరి మాసం భోగి రోజున ఉదయం ధ్యానంలో శ్రీరామచంద్ర ప్రభువు అత్యద్భుతమైన అనిర్వచనీయమైన అద్వితీయమైన సుందరాకార మనోహర రూపంతో దర్శనమిచ్చి నన్ను కృతార్థుణ్ణి చేశారు. ఇదేకాలంలో శ్రీరామ మంత్రాన్ని 504 సార్లు చేసేవాడిని.

**ధ్యానంలో శ్రీఆంజనేయస్వామి దర్శనం :**

1984 మాఘమాసంలో శ్రీ ఆంజనేయస్వామి ధ్యానంలో బంగారు వర్ణంతో వారు ధ్యానంలోఉన్న రూపంతో కన్పించారు. ఇదే కాలంలో ఆంజనేయ మంత్రాన్ని 1008 సార్లు చేసేవాడిని.

**కుండలి దేవత సాక్షాత్కారం–కుండలినీ శక్తి జాగృతి :**

1984 మే మాసంలో స్వప్నమున కుండలినీ దేవత సాక్షాత్కరించింది. ఆ దేవత సర్పరూపాన నేలపై నల్లని రూపంలో 50 అడుగుల పొడవుతో, పైన శూన్యంలో 40అడుగుల పొడవున 9 లేక 10 శిరస్సులు కల్గి కన్పించి నా పేరు నుచ్చరిస్తూ "వెంకటేశ్వర్లు నీ చేతిలోని ఆ వస్తువును పారెయ్యి" అనడము, నేను పారవేయడం జరిగింది. నేనే అనంత భక్తితో నమస్కరించగ పడగల మధ్యనున్న శిరస్సు నోరు తెరచినా శిరస్సును తన నోటిలోనికి తీసుకొని మూడుసార్లు ఊర్ధ్వస్థితికి పీలుస్తూ ఉన్న స్థితిలో నాకు బ్రహ్మానందం కల్గినది. తదుపరి శిరస్సును వదలి నా శిరస్సు బ్రహ్మరంధ్రం మీద, కుండలినీ సర్పము మధ్య శిరస్సు మొదటి భాగంతో ఏవో వ్రాయడం గమనించాను. తదనంతర కాలంలో నేను సంకల్ప మాత్రమున భగవంతునికి నివేదించడమే తరువాయి, భూత, భవిష్యత్ వర్తమాన స్థితులను తెల్సుకోగలిగే అదృష్టం కల్గింది.

**నా గత జన్మనుగూర్చి ఆ జన్మలో నేను చేసిన పొరపాటును గూర్చి స్వప్నమున తెల్సుకొన్న విధము :**

1985 వ సంవత్సరంలో ప్రస్తుతం వున్న జన్మకు, అనుభవిస్తున్న బాధలకు కారణాలను తెల్సుకునేందుకు భగవంతునికి భావనారూపంలో ప్రశ్నవేయగ అదే రాత్రి స్వప్నంలో నేను, నా శరీరాన్ని, రూపాన్ని భావనా మాత్రంగ దర్శించాను. నేను గత జన్మలో దర్శించిన (తమిళనాడులోని ఘటికాచలక్షేత్రం) క్షేత్రాన్ని, అక్కడ నాకు తెలియకుండా నాచే జరిగిన పొరపాటును తద్వారా అవతల వ్యక్తికి జరిగిన ఆపదను దర్శించాను. క్షేత్రంలో స్వామిని (నారసింహ, ఆంజనేయులను) దర్శించి బయటకు వచ్చి సూర్యుని కెదురుగ (ఉదయం 9గం॥లకు) నిల్చొని ఎడమచేతిలోని దండమును చంకలో పెట్టుకొని, కుడిచేతిలోని తీర్థచెంబును నేలపై నుంచి ఈ ఆపద నుండి దాసుని రక్షించి పునీతుణ్ణి చేయమని ప్రార్థించాను. ఆ సమయాన నా ముఖమును, నా శరీరాన్ని నేను భావామంత్రమున దర్శించ గలిగాను. క్షేత్రం చుట్టు ప్రక్కల ప్రాంతాన్ని దర్శించాను. నన్ను నేనుచూడ గల్గిన సందర్భం అయిపోయి స్వప్నమున మెలుకువ వచ్చిన తర్వాత నేనెవరో తెల్సుకొన్నప్పుడు ఆనందం,ఆశ్చర్యం కల్గినది. నేనెవరో అనేది బ్రహ్మ రహస్యము గాన ధర్మాన్ని అతిక్రమించరాదు గాన వ్రాయటంలేదు.

**స్వప్నమున భగవానుని దివ్యమంత్రోపదేశం :**

సద్గురువుచే మంత్రోపదేశానికి 6 నెలలు వెతుకులాడి నిరాశపొందిన సందర్భంలో 1985 సంవత్సరంలో మే మాసంలో శనివారం అశ్వనీ నక్ష త్రం శుభదినాన ఆంజనేయస్వామి స్వప్నములో దివ్యప్రక్రియ ద్వారా మంత్రోపదేశము చేసి నన్నుద్ధరించాడా భగవానుడు. అప్పటి నుండి మనుష్య రూపాన వున్న హనుమద్దాస ఆంజనేయశర్మ గారి సలహాతో నిత్యము 1008 సార్లకు తగ్గకుండా, ధ్యానము చేసే అదృష్టం కల్గింది.

మంత్రోపదేశం తర్వాత ఘటికాచలంలో (తమిళనాడు) ఒక మండల దీక్షను చేసే కాలములో ఒకరోజు స్వప్నమున ఆంజనేయస్వామి పెద్దకోతి రూపాన నా ఎడమ చెవిని వ్రాసుకుంటూ క్రిందకు దూకడం ఎదురుగనున్న శ్రీరామచంద్రునితో (నిజరూపధారి) నేను "స్వామీ చూడండి నన్ను తగులుతూ స్వామి దూకాడు" అని చెప్పగా స్వామి నా దగ్గరకు వచ్చి ఆంజనేయస్వామి కుడిచేతిని నా కుడిచేతిలోను, అలాగే స్వామి ఎడమచేతిని నా ఎడమచేతిలోఉంచి ఇద్దరి చేతులను పట్టుకొని "కలకాలము మీరిద్దరూ స్నేహితులుగా ఉండండి" అని అనడం జరిగింది.

**రెండవ గురువు గారి పరిచయం :**

ప్రముఖ ఉపాధ్యాయులు అఖండ శ్రీ చక్రోపాసకులు, కావలి పట్టణ వాసియైన బ్రహ్మశ్రీ పెళ్లూరి కోటయ్యగారు నాకు పరిచయం గావడం నా అదృష్టము. వీరు నేను అనేక సంవత్సరాలు శ్రీశైలంలోపావు మండలం వంతున ఉపాసిస్తూ, అనేక దైవ రహస్యాలను, ఉపాసనా రీతులను, మంత్ర విషయాలను చర్చించేవారము. వీరి కుటుంబ సభ్యులలో నేనొకడినైనందుకు సంతోషంచాను. నాకెదురయ్యే క్లిష్ట సమస్యలను చాలా సార్లు పరిష్కరించారు బ్రహ్మశ్రీ కోటయ్య గురువుగారు.

**గతజన్మలోని సద్గురువును దర్శించుట :**

గత జన్మలోని గురువు గారిని స్వప్నములో దర్శించాను. వారిని వారి కుమార్తెను, భార్యను దర్శించాను. వారు నా దగ్గరకు వచ్చి "నేను నీకుపదే శించిన మహామృత్యుంజయ మంత్రాన్ని నీవు నీ శిష్యునకు ఉపదేశించావు గదా ! అతడు ఆ మంత్రాన్ని దుర్వినియోగం చేయలేదు గదా " అని అనిన వెంటనే నా శిష్యుని అడిగివస్తానని గురువుగారితో చెప్పి నా శిష్యుని గృహానికి పోయి పై విషయాన్ని ప్రస్తావించగ మహామృత్యుంజయ మహా మంత్రాన్ని

దుర్వినియోగం చేయలేదని నాతో చెప్పగ, అదే విషయాన్ని మా గురువు గారి దగ్గరకు వచ్చి చెప్పగ వారు తలూపినారు. స్వప్నమున గురువుగారి కుమార్తెను, ధర్మపత్నిని దర్శించాను. వారే ఈ జన్మలో నా మొదటి గురువు హనుమద్దాసని తెల్సుకున్నాను. (ఈ జన్మలో వీరు బ్రహ్మచారిగ ఉన్నారు.)

**కంచి స్వాముల (చంద్రశేఖర సరస్వతీస్వామి) దర్శనము-యోగాను భూతి :**

1985లో కావచ్చు తమిళనాడులోని ఘటికాచలంలో 45 దినాల ఉపసనానంతరం కంచి పెద్ద స్వాముల వారిని దర్శించగ వారు సుమారు 17 నిమిషాలు నన్ను రెండుచేతులు పైకెత్తి అంత సమయం చేతులు దించ కుండా ఆశీర్వదించారు. నన్ను గూర్చి చాలా విషయాలు చెప్పడం జరిగింది. మొట్టమొదటిసారి ఒక యోగీశ్వరుని కల్సి మాట్లాడే అదృష్టం కలిగింది. (నేను మాట్లాడింది ఒక్కశాతమే) వార్కి సాష్టాంగ నమస్కారం వారి అనుమతితో చేసే అవకాశం కల్పించారు స్వామీజీ.

**దేవతలచే శాపానుగ్రహం మరియు ఖండయోగ ప్రదర్శన :**

నాకుశాపాను గ్రహమున్నదనే విషయాన్ని ఆంజనేయస్వామి, శనైశ్చర స్వాములిద్దరు స్వప్నమున నాకు తెలియజేశారు. ఆంజనేయ, శనైశ్చర స్వామి, నేను మద్రాసులోని సముద్రతీరంలో స్నానం చేశాము. ఆంజనేయ స్వామి స్నానానంతరం ఒడ్డుకు వెళ్లిన సందర్భంలో నేను కూడ స్నానానంతరం నా కుడికాలును నీళ్లలో నుంచి ఇసుకలోకి కాలుపెట్టి ఎడమకాలు కూడ ఇసుకలో పెట్టబోగా నా ఎడమకాలును శనైశ్చరస్వామి గట్టిగ పట్టుకొన్నారు, వదిలిపెట్టమని అడుగగా వదలినారు. ఇక్కడ ఇద్దరికి కొంత ధర్మపరమైన సంభాషణ జరిగింది. మూడవసారి నేను పోబోగా మరల స్వామి నా ఎడమకాలును పట్టుకోగా,నేను వెనుకకు మరలి శనైశ్చరస్వామి చేసిన తీరును ఆక్షేపిస్తూ 3 సార్లు ధర్మాతిక్రమణ జరిగినది అని చెబుతూ ఇప్పుడే నిన్ను శపిస్తానని చెబుతూ నేను సముద్రజలాన్ని తీసుకొని (నార సింహ) అష్టముఖ గండభేరుండ జ్వాలా నృసింహ మంత్రాన్ని ఉచ్చరించే సమయంలో, శనైశ్చరస్వామి కూడ జలాన్ని చేతిలోకి తీసుకొని మంత్రిస్తుండగా, నేను నాలో ఇలా భావించి ఇలాచెప్పాను. ఇద్దరం శపించుకొని శక్తి హీనులవడం మంచిదికాదని చెప్పగ స్వామి అంగీకరించి, 4వ సారి నన్ను అడ్డుకోలేదు. నేను దూరాన నడచిపోతున్న ఆంజనేయస్వామిని కల్సు కున్నాను.

నేను, నా ఉపాసనా ప్రయాణంలో నవగ్రహాల ధ్యానంలో సూర్యుడు తప్ప అందరూ దర్శనమిచ్చేవారు. కేతు ధ్యానంలో (ప్రతిసారి) నేను ఒక రహదారిలో శరీరాన్ని ఖండఖండాలుగా ఖండించగా మరలా ఒకటి అయ్యేవి. 1994 మే మాసంలో ఒక గాయత్రీ ఉపాసకుని రూపంలో నాకుకన్పించిన సందర్భంలో నేను నా శిరస్సు,గుండె,పాదాలు,చేతులు లాంటి భాగాలను వేరువేరుగ చిన్న చిన్న ముక్కలుగ ఖండించి కుప్పలుగ పెట్టాను. స్వామి వాటినన్నింటిని స్పృశించి అన్నీ బాగానే వున్నాయి. శిరస్సులోనే కొంత ఇబ్బంది స్థితి ఉందని చెప్పడం జరిగింది.

**స్వప్నమున శివజ్యోతి దర్శనం మరియు నా మరణ రహస్యాన్ని వెల్లడించిన వైనము :**

1986 జనవరిలో నా రెండవ గురువు గారు నేను శ్రీశైలంలో ధ్యానం చేస్తున్నప్పుడు (12 రోజులు) ఒకరోజు కొద్ది సమయంలో ధ్యానంలో 3 సార్లు శివజ్యోతి దర్శనమిచ్చినది. ఒకానొక సందర్భంలో లౌకిక పాప విషయాలపై విరక్తిపొంది (1996లో) ఇక నేను మీ దగ్గరకొస్తాను స్వామి (సాత్వికమార్గంలో) ఈ జన్మ ఇంతవరకు చాలు అని ఒకరాత్రి గృహంలో సంకల్పము చెప్పగ అదే రాత్రి స్వప్నంలో సుప్రసిద్ధ జ్యోతిష్కుని రూపంలో కన్పించి “అప్పుడే నా దగ్గరకొస్తానని త్వరపడతావేమి, అప్పుడే కాదు రవి మహర్దశలో నా దగ్గరికొస్తావు. (తులాలగ్నానికి రవి బాధకుడు) అనడం జరిగింది.

**పరమశివుడు నన్నుఒకానొక సందర్భాన శపిస్తానని ఆగ్రహించుట :** నేనుసాధారణంగ తెల్లవారుజామున 3 గంటల నుండి ఉ 10 గం॥ల వరకు (కొన్ని సందర్భాల్లో ఇంక కొంచెం ముందుగ కూడ) ధ్యానంలోఉండేవాడను. ఒకానొకక్లిష్ట సమస్యను అధికమించుట కొరకు ప్రత్యేక ఉపాసనను 2004 కార్తీకమాసం, మార్గశిర, పుష్యమాసాలలో చేసే సందర్భంలో నాకు ఒకరోజు 40 సార్లదాకా మోషన్స్,రెండవ రోజు 20 సార్ల దాకా మోషన్స్ అవ్వడము, నేను (ప్రత్యేక ఉపాసన కాలంలోఇటు వంటి ఆటంకాలు రాకూడదనే భావనతో) స్వామిని ఇలా ఉపాసన మధ్య కాలంలో మోషన్స్ అవ్వడం ధర్మం కాదు గదఅనే ప్రశ్నతో భగవంతునిపై తిరుగుబాటు (సాత్విక తిరుగుబాటు) చేశాను. అదే రాత్రి నేను స్వప్నంలో పార్వతీ పరమేశ్వరులను అర్చిస్తున్న సమయంలో, పరమశివుడు దిగ్గున లేవగా స్వామికి నమస్కరించడమూ, స్వామి స్వరూపాన్ని చూసి నేను ఆశ్చర్యంతోను, స్వామి గద్దించినందుకు కొంత భయంతోను నమస్కరించగా (స్వామిని నేనుఅశ్వత్థ వృక్షం క్రింద పూజిస్తుండడం జరిగింది) స్వామి వెంకటేశ్వర్లూ నీవు పూజలో పొరపాటు చేశావు” అనడమూ, నే నుండి

నేనుతెల్సుకున్నంతవరకూ, తెల్సిన విధంగా పూజచేస్తున్నాను. తెల్సి తప్పు చేయలేదు అంటూ, నాకు తెలియకుండ తప్పుచేశానేమో అనగా, స్వామి “తప్పుచేశావని రెండవసారి” అలాగే మూడవసారి స్వామి నీవు తప్పు చేశావని నేను చెబుతున్నానుగా అని అనడం జరుగగ, అప్పుడు స్వామి నిన్ను ఇప్పుడే శపిస్తానని అనడమూ, నీ ఇష్టప్రకారం శపించు స్వామి,శపించు నన్ను ఒక కుష్టు వ్యాధిగ్రస్తుడుగ శపించి, నా జన్మజన్మల దుష్కర్మల ననుభవించే భాగ్యం కల్గించమని ప్రార్థిస్తూ నమస్కరించగా, స్వామి ఎడమచేయిని నా వీపుపైన, ఉంచి దగ్గరకు తీసుకొని, కుడిచేతిని శిరస్సు పై నుంచి తన హృదయానికి నన్ను హత్తుకొని “నిన్నా నేను శపించేది నీవు నాకు అత్యంత ప్రీతి పాత్రమైన వాడివి నిన్ను పరీక్షించడానికే ఇదంతా” అని స్వామి అనడము తర్వాత మెలుకువ రావడం జరిగింది.

**అమ్మవారు నన్ను చూపిస్తూ ఈయన మహిమ గల వాడవుతాడని చెప్పుట :**

స్వప్నమున (1990సం॥లో) ఒకానొక పెద్ద మందిరాన ఒక చివర గణపతి స్వామి ఠీవిగా కూర్చొని ఉంటాడు. 3 లేక 4 చిన్న కోతులుంటివి. 5వ పెద్దకోతి నిజరూపమున వున్న గణపతి స్వామి దగ్గరకు వెళ్లి “ ఆస్థానం నాది నీవు ఈ స్థానంనుండి దిగమని చెబుతూ గణపతి హస్తాలను పట్టుకొని క్రిందకు లాగు తుండగ, విఘ్నేశ్వరుడు దిగనని మొరాయిస్తూ ఉంటూ, ఇద్దరూ తగవుపడుతున్న సమయంలో నేను వారి దగ్గరకెళ్లి ఎవరు ఉన్నత స్థానంలో వుంటే ఏమి ఇద్దరూ ఒకటేగదా, ఇలా తగవులాడుట సరికాదని కోతి రూపంలోనున్న ఆంజనేయ స్వామిని చేయిపట్టుకొని ఇవతలకు తీసుకువచ్చిన సందర్భంలో మాకు ఎడమ ప్రక్కనున్న అమ్మవారు నావైపు చూపిస్తూ “ఈయన భవిష్యత్తులో మహిమ గలవాడవుతాడు” అని గణపతి దగ్గరకు వెళ్లి నిలబడగ స్వప్న సమాప్తి జరిగింది.

**జ్యోతిష శాస్త్రము పదిమందికి చెప్పు, అదృష్టము నీకున్నదని అమ్మ వారు సూచాయగా చెప్పుట :**

1996వ సంవత్సరంలో ఒకానొక శుభదినాన స్వప్నంలో అమ్మవారు గంగానది లాంటి నది మధ్యలో చేయిని చెంపక్రిందుంచి ఠీవిగా పరుండి ఉంటారు. నేనుచూచిన వెంటనే అమ్మవారు ఇక్కడ ఉన్నారే (నిజరూపాన) అంటూ పోయి భక్తి ప్రపత్తులతో నమస్కారము చేయగా ఆమె నీ నక్షత్రము అనూరాధ, పంచమితిథి, బుధవారము అన్న తర్వాత లేచి నిలబడి ఆశీర్వ దించి, 10 సంవత్సరాల బాలికగా మారి చిరునవ్వు నవ్వుతూ తూర్పువైపు నకు వెళ్లింది.

**స్వప్నమున శివుడు నాగప్రతిష్ట చేయమని చెప్పుట అలాగే రాధాకృష్ణుల దర్శనంతో వరం కోరుకోమనుట :**

2008 సంవత్సరం కార్తీకమాసాన సాక్షాత్తు శివభగవానుడు నాగప్రతిష్ఠ చేస్తూ కన్పించగ నేను కూడ నాగప్రతిష్ఠ చేస్తాను అనగా, స్వామి చెయ్యి అని ఆదేశించారు. 2011వ సం॥లో నాగప్రతిష్ఠ చేయడం జరిగింది. 2009 సంవత్సరములో ఒకానొక శుభదినాన రాధాకృష్ణులు అద్భుతమైన నాట్యప్రదర్శన గావించిన అనంతరం, రాధామాత నాట్యము చేస్తున్న వేదిక చివరన నిలబడి, నా వైపు అనుగ్రహ దృక్కుతో చూచింది. ఇద్దరు అద్భుతమైన తెల్లని రూపంలో ఉన్నారు. కృష్ణపరమాత్మ నా దగ్గరకు వచ్చి చేతిలోగల పిల్లన గ్రోవి నావైపు చూపిస్తూ "నీకేమి వరం కావాలో కోరుకో" అనగ నేను "నాకేమి వద్దు స్వామి నీ పాదపద్మములు తప్ప" అని పాదములు పట్టుకొనడము, స్వామి నా వైపు అనురాగ దృక్కులతో చూస్తూ "ఇకనుండి తిరుమలలో, కాశీలో ధ్యానం చేసుకో" మని ఆదేశించడం జరిగింది.అంతకు ముందు నేను తమిళనాడు (వేలూరుజిల్లా) లోని షోలింగర్‌కు ఒక కిలోమీటరు దూరంలో ఘటికాచల స్వయంభూక్షేత్ర దైవాలైన యోగ నృసింహ, యోగ ఆంజనేయ (దశముఖాంజనేయ) స్వాముల గూర్చి 1984 నుండి అనేక మండలాలు ధ్యానం చేశాను. అలాగే శ్రీశైలంలో ప్రతి సంవత్సరం 12 రోజుల వంతున ధ్యానంలోగడిపేవాడిని. ప్రస్తుతం కాశీలోను, తిరుమలలోను కొన్ని మండలాలు ధ్యానంలో గడుపుతున్నాను. అనేక అద్భుత అనుభవాలుపొందాను. కాశీ మొదటిసారి వెళ్లే ముందు మూడుసార్లు కాశీ విశ్వేశ్వర లింగమును ఒకే రోజు స్వప్నమున దర్శించే భాగ్యం కలిగింది.

నేను దగ్గర దగ్గర 20 కి పైగా దేవతాపుస్తకాలను గురువులు, దైవానుగ్రహం వల్ల విషయాలను సేకరించి వ్రాసే భాగ్యం కల్గిందని భావిస్తు న్నాను.నేను నా జీవిత ప్రయాణంలో 40 సం॥రాలనుండి సత్యము, ధర్మము, అహింసయుతంగా పంచభూతాలతో, పంచ యజ్ఞాలతో సంబంధం కల్గి నిక్కచ్చిగా ప్రయాణించే అదృష్టం నా ఉపాసన కల్గించింది.

ఈ దేవతా పుస్తకాలను వ్యాపార దృక్పధానికి శతకోట్ల మైళ్ళ దూరంలో ఉంచాను. ఉద్యోగ ధర్మంలోను, వ్యక్తిగత ధర్మంలోను ఒక్కరూపాయి అకార ణంగా, అధర్మంగా నా దరిచేరనివ్వలేదు. అదే బాటలో ఈ దేవతా పుస్తకాల విషయంలోనూ కొనసాగించే భాగ్యం నాకు భగవంతుడ్నే ప్రసాదించమని కోరు తున్నాను. ఈ పుస్తకాలను టి.టి.డి తిరుమలలో ఆ పరబ్రహ్మదేవతకు అంకిత మివ్వాలని భావిస్తున్నా. ఆ అదృష్టం ఎలా వుంటుందో వేచిచూడాలి. వీలు

కానపుడు ఏదైనా హిందూ ధర్మపరిరక్షణ సమితికైన సమర్పించుకునే భాగ్యం ఆ దేవ దేవుడు నాకు కలుగజేస్తాడని భావిస్తున్నాను. వ్యాపార దృక్పథంతో గాకుండ పది మందికి ఉపయోగపడాలని నా తపోయోగ శక్తితో ఆలోచించిఅనేక రకాల రుగ్మతలకు ఎలా ఉపాసించాలో, ఏ మంత్రాలను ఎలా ఉపాసించాలో వ్రాసి మీకందించే భాగ్యం కలిగింది. ఈ పై ప్రయత్నంలో కొందరి అద్భుతమైన వ్యక్తుల ప్రవచనాలునాకు స్ఫూర్తి కల్గించాయి. వారెవరనగా బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుగారు, బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారు, బ్రహ్మశ్రీ మైలవరపు సత్యన్నారాయణగారు, జీ టివిలో గోపురంలో ప్రవచించే సంధ్యాలక్ష్మి గారు. వీరికి నా ప్రణామాలు చేస్తున్నాను.

1984 నుండి గత జన్మ పుణ్యఫల జ్ఞానంవల్ల కల్గిన అదృష్టవశమున, తల్లిదండ్రులు నేర్పిన సాత్వికభావనల వల్ల, ఇద్దరి గురువులు బోధించిన బ్రహ్మజ్ఞానం వల్ల నేను నిత్యము దేవతార్చనలోను, అహింసా వ్రత దీక్ష కొనసాగించడంలోను, బ్రహ్మ యజ్ఞమును, దైవ యజ్ఞమును, పితృయజ్ఞమును, మనుష్య మరియు భూతయజ్ఞమును మనసా వాచా ఆచరించే భాగ్యము కల్గింది. మంత్ర శాస్త్ర, ధ్యాన, రోగనివారణ సంబంధంగాను, ఉపాసన చేయు విధంలోను, ఇతర వ్యక్తిగత గృహసంబంధ బాధల నుండి విముక్తి పొందే విషయాల్లోను, జ్యోతిష్‌శాస్త్ర సంబంధంగ ఉచిత సలహా సహకారాలు అందించే అదృష్టం నాకు మాత్రమే కల్గిందని భావిస్తున్నాను. 2012 నుండి 20 రకాల పుస్తకములు వ్రాయుటలో నిమగ్నమైయున్నాను. 2017 చివరికి అవి పూర్తిగా గలవని ఆశిస్తున్నాను. ఈ పుస్తకాలన్నీ దేవతా సంబంధాలే. అదృష్టం బాగుంటే ఈ దైవ సంబంధ పుస్తకాలన్నీ తిరుమల తిరుపతి శ్రీలక్ష్మి వేంకటేశ్వరుని పాదపద్మాలకు కైంకర్యం చేసే భాగ్యం భగవంతుడు నాకు ప్రసాదించాలని కోరుకుంటున్న మీ అభిమాన పాత్రుడు.


ఇట్లు

రచయిత

**కొండపల్లి వెంకటేశ్వర్లు,** M.A., LLB.,

రచన,సేకరణ సంచలనాత్మక వివరణకర్త,

రిటైర్డ్ లెక్చరర్, ప్రభుత్వ కళాశాలలు,

గుంటూరు – 522 002

సెల్ : 8985185556

# అంతరంగ దేవతా ప్రార్థన

ఓ పరబ్రహ్మా ! పరమాత్మా! బ్రహ్మీ ముహూర్తములో ఈ దాసుని గాఢ నిద్ర నుండి నిద్రలేపుము. అట్టి పరమ పవిత్ర బ్రాహ్మీ ముహూర్త కాలమున నా అంతరంగములో సదా నిన్నే స్మరించు నిత్య నిర్మల పవిత్ర బుద్ధిని మనస్సునునాకు అనుగ్రహించుము.

ఓ పరమాత్మా! పరంధామా! సర్వావస్థల సర్వకాలములందు నీ భక్త కోటి సంఘములో పాల్గొనే పరమ భాగ్యాన్ని నాకు ప్రసాదించుము. జీవిత చరమాంకములో, చివరి శ్వాస వరకు నిన్ను కీర్తించే మహా భాగ్యాన్ని ప్రసాదించుము. ఓపరబ్రహ్మా ! పరాత్పరా! ఎటువంటి సుఖదుఃఖములందును చివరి శ్వాసవరకు నిన్ను స్మరించే శక్తి నాకొసంగుము.

ఓ పరంధామా! సంసార సుఖముల పైన కామవాంఛల పైన సంపూర్ణ విరక్తిని కల్గించును. పూర్ణ పరంజ్యోతివైనా హృదయ కమలాన ప్రకాశించుము. ఓ పరమేశ్వరా! తెల్సియో తెలియకగాని నా వల్ల అపకారము ఇతర జీవులకు జరుగనీయకుండునట్లు ఈ జీవిత నౌకను నడిపించుము.

ఓ కరుణాకర దీనబంధో, సత్యము, అహింస, ధర్మము, కరుణ,ప్రేమ, త్యాగ భావము నా హృదయంలో నిరంతరము నిండియుండునట్లు, వీటిని ఆచరించే భాగ్యము నొసంగుము. విషయ సుఖములందు ఆ శక్తిని, దేహాభి మానాన్ని నశింపచేయుము. కీర్తి ప్రతిష్టలపైన, భోగభాగ్యాలపైన, ధన ధాన్యాల పైన నాకు నిరాశక్తిని ప్రసాదించుము.

ఓ కరుణాకరసింధూ ! సకలాంతర్యామీ ! సదానందా సర్వ ప్రాణులందు దయను, ప్రేమను, వాత్సల్యాన్ని నాలో పెంపొందింపజేయుము. నాలోని అరిషడ్వర్గాలను అధఃపాతాళానికి త్రొక్కివేయుము. సర్వప్రాణులందు నిన్నే దర్శించుకొనే భాగ్యాన్ని ప్రసాదించుము.

ఓ జగద్గురూ ! జగదానందదాయకా ! శ్రీ మన్నారాయణా ! పరమ శివా ! శ్రీరామకృష్ణ గోవిందా ! శ్రీలక్ష్మీ వేంకటేశ్వరా ! జగజ్జననీ ! జగన్మాతా ! శ్రీలలితాపరాభట్టారికా ! మహాలక్ష్మీ ! మహా సరస్వతీ దేవతలారా! నేను మిమ్ములను ఆరాధించు భావాలతోనే ఈ దీనుని అనుగ్రహించి సదా రక్షించుము. ఓం హరిః ఓం నమః శివాయ పరబ్రహ్మణే నమః ఓం

ప్రాతఃకాలాన నిద్రనుండి లేచిన వెంటనే ఈ "అంతరంగ దేవతా ప్రార్థన"ను భూ ప్రార్థన, కరదర్శన అనంతరము పడకపై నుండిగాని, లేచి నిలబడిగాని భక్తి ప్రపత్తులతో పఠించవలెను.

## విషయసూచిక

**విభాగము - 2**

**శ్రీలక్ష్మీగణపతి ఉపాసనలో గమనించి ఆచరించాల్సిన ముఖ్యవిషయములు**

## విభాగము - 3

## శ్రీలక్ష్మీ గణపతి స్తోత్ర కవచాదులు

**విభాగము - 4**

**శ్రీలక్ష్మీ గణపతి సృష్టి మరియు చరిత్రను గూర్చిన వివరాలు**

## శ్రీ గణపతి మహామంత్రము

అస్యశ్రీ గణేశ స్తోత్రమహామంత్రస్య । గణకఋషిః । నృచద్గాయత్రీ ఛందః। శ్రీ మహాగణపతిర్దేవతా । ఓం గం బీజం । శ్రీమమ గణాధిపతి ప్రీత్యర్థే ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థే ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః

కరన్యాస అంగన్యాసములు

ఓం గ్లాం అంగుష్ఠాభ్యాం నమః – ఓం గ్లాం హృదయాయ నమః

ఓం గ్లీం తర్జనీభ్యాం నమః – ఓం గ్లీం శిరసే స్వాహా

ఓం గ్లూం మధ్యమాభ్యాం నమః – ఓం గ్లూం శిఖాయై వషట్

ఓం గ్లైం అనామికాభ్యాం నమః – ఓం గ్లైం కవచాయ హుం

ఓం గ్లౌం కనిష్ఠికాభ్యాం నమః – ఓం గ్లౌం నేత్రత్రయాయ వౌషట్

ఓం గ్లః కరతలకర పృష్ఠాభ్యాంనమః – ఓం గ్లః అస్త్రాయఫట్ ॥

భూర్భువస్సువరోమితి దిగ్భధః

ధ్యానము :

శ్లో॥ ఏకదంతం చతుర్హస్తం బిభ్రాణ పాశమంకుశం ।
అభయం వరదం హస్తైర్దధానం మూషికధ్వజం ॥
రక్తం లంబోదరం శూర్పసుకర్ణం రక్తవాససం ।
రక్తగంధాను లిప్తాంగం రక్తపుష్పైస్సుపూజితం ॥
భక్తానుకంపినందేవం జగత్కారణ మచ్యుతం ।
ఆవిర్భూతం చ సృష్ట్యాదౌ ప్రకృతేః పురుషం పరమ్ ।

"నమో వ్రాతపతయే నమోగణపతయే నమః ప్రమధ గణపతయే నమస్తే ఆస్తులంబోదరాయైక దంతాయ విఘ్నవినాశినే శివసుతాయ వరదమూర్తయే నమోనమః"

మూల మంత్రము : "ఓం గం గణపతయే నమః"

గాయత్రీ : "ఏకదంతాయ విద్మహే। వక్రతుండాయ ధీమహి। తన్నో దంతిః ప్రచోదయాత్ " భూర్భువస్సువరోమతి దిగ్విమోకః

విధానము : చాలా ప్రమాదకరమైన ఆపదలలో వున్నవారు యీ పై మంత్రమును పన్నెండు లక్షల యాభైవేలు జపవ చేసినచో మంత్రసిద్ధి అయి దాని పూర్తి ఫలితములు కనిపించును. రోజుకు అయిదువేలు చొప్పున రెండువందల యాభై రోజుల జపము చేసినచో జపసంఖ్య పూర్తికాగలదు. అంత దీర్ఘకాలము పైరీతిగా జపము చేయుటకు అవకాశము లేనివారు, రోజుకు అయిదువేలు చొప్పున కనీసము యిరవై ఐదురోజులవరకైనా జపము చేయవలెను. అట్లు చేసినచో మంత్రజప ప్రభావము అనుభవములో కనిపించుట ప్రారంభమగును. అటు తరువాత హెచ్చు తగ్గులుగా జపసంఖ్య పూర్తి చేసుకొనవచ్చును. జపము చేసే రోజులలో బ్రహ్మచర్యమును పాటించ వలెను. జపము చేయు చోటున ఎదురుగా గణపతి పటము పెట్టుకొని, దానిని పూజించి అటు తరువాత జపము ప్రారంభించుట మంచిది. ఇట్లు చేసినచో సమస్తమైన విఘ్నములు ఆపదలు తొలగిపోయి, ప్రయత్నములు అన్నింటి యందును విజయము లభించును.

## శ్రీ ఉచ్ఛిష్ఠ గణేశ మంత్రము

### శ్రీ మదుచ్ఛిష్ఠ గణపతి మంత్రజప విధానము

ఆచమ్య ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య శ్రీ మానాముకగోత్రః ఆముక నామదేయోహం మమాత్మనః సకుటుంబస్య శ్రీ మదుచ్ఛిష్ఠగణేవ ప్రసన్నతాప్రాప్తి పూర్వక శ్రీమదుచ్ఛిష్ఠగణేశ ప్రసాద సిద్ధ్యర్థం మమ శ్రీ మదుచ్ఛిష్ఠ గణేశ ప్రసాదేన సర్వాపశ్చాన్తి పూర్వక దీర్ఘాయుర్విపుల దన కళత్ర పౌత్రాదన్య వచ్ఛిన్న సంతతి వృద్ధిస్తిర లక్ష్మీ కీర్తిలాభ శత్రుపరాజయాది సదభీష్ట ఫలసిద్ధ్యర్థం శ్రీమదుచ్ఛిష్ఠ గణేశ మహామంత్ర జపం కరిష్యే ॥

ఋష్యాదిన్యాసము

అస్యశ్రీ మదుచ్ఛిష్ఠ గణేవ మహామంత్రస్య

గణక ఋషయే నమశ్శిరసి

గాయత్రీ ఛందసే నమో ముఖే

శ్రీ మదుచ్ఛిష్ఠ గణపతిర్దేవతాయై నమోహృది

హ్రీం బీజాయ నమో నాభౌ
ఆం క్రోం శక్తయే నమోగుహ్యే
స్వాహా కీలకాయ నమః పాదయోః
శ్రీ మదుచ్ఛిష్ఠగణేశ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే
కరన్యాసము :
ఓం నమో భగవతే ఏకదంష్ట్రాయ అంగుష్ఠాభ్యాం నమః
హస్తిముఖాయ తర్జనీభ్యాం నమః
లంబోదరాయ మధ్యమాభ్యాం నమః
ఉచ్ఛిష్ఠమహాత్మనే అనామికాభ్యాం నమః
ఆం క్రోం హ్రీం గం కనిష్ఠికాభ్యాం నమః
ఘే ఘే స్వాహా కరతల కరపృష్ఠాభ్యాం నమః
హృదయన్యాసము :
ఓం నమో భగవతే ఏకదంష్ట్రాయ హృదయాయనమః
హస్తిముఖాయ శిరసే స్వాహా
లంబోదరాయ శిఖాయైవషట్
ఉచ్ఛిష్ఠమహాత్మనే కవచాయ హుం
ఆం క్రోం హ్రీం గం నేత్రత్రయాయ వౌషట్
ఘే ఘే స్వాహా అస్త్రాయఫట్
దిగ్బంధనము
ఓం భూర్భువస్సువరో మితిలోక త్రయేణ దిగ్బంధః
ధ్యానము :

శ్లో॥ శరంధనుః పాశసృణీ స్వహస్తై
ర్దధానమారక్త సరోరుహస్థం
వివస్త్ర పత్న్యా సురత ప్రవృత్త
ముచ్ఛిష్ట మంబాసుత మాశ్రయే హం ॥
ఏవ ధ్యాత్వా, లమిత్యాది పంచపూజాం కుర్యాత్ ॥

మూలమంత్రము :

"ఓం నమోభగవతే ఏకదంష్ట్రాయ హస్తిముఖాయ లంబోదరాయ ఉచ్ఛిష్ఠ మహాత్మనే ఆం క్రోం హ్రీం గం ఘే ఘే స్వాహా॥"

"ఓం నమ ఉచ్ఛిష్ఠ గణేశాయ హస్తి పిశాచిలిఖే స్వాహా"

మంత్రసిద్ధి క్రమము :

అస్యపురశ్చరణ మేక లక్షజపః తద్దశాంశతో ఘృతహోమః
తత్తద్దశాంశే తర్పణమార్జన బ్రాహ్మణభోజనాని చ కుర్యాత్
ఏవంకృతే మంత్రస్సిద్ధోభవతి, సిద్ధేమంత్రే ప్రయోగాన్ సాధయేత్॥

తా. ఈ మంత్రములలో నే మంత్రమునైనను లక్షపర్యాయములు జపము, తద్దశాంశము ఘృతహోమము, తద్దశాంశము తర్పణము, తద్దశాం శము మార్జనము, తద్దశాంశము బ్రాహ్మణ భోజనాదులు యధాశాస్త్రీయ ముగ జేసిన యెడల మంత్రసిద్ధి యగును. మంత్రసిద్ధియైన పిమ్మట ప్రయోగ ములను సాధించవలయును.

**మంత్ర ప్రయోజన క్రమము :**

బహుళ అష్టమి మొదలు శుద్ధపంచమి వరకు ప్రతినిత్యము భక్తి శ్రద్ధలతో యధాశాస్త్రీయముగా ఎనిమిదివేల పర్యాయములు జపము చేయుచు, జపాన్తమున తద్దశాంవము హోమమును, తద్దశాంవము తర్పణ మును జేసిన యెడల దనము ధాన్యము, సంతానము, సౌభాగ్యము, యశస్సు మున్నగునవి గలుగును.

శుభదినమున ఉచ్ఛిష్ఠగణేశుని ప్రతిమను వేపచెట్టు వేరుతో చేయించి, ఆ విగ్రహమునకు ప్రాణ ప్రతిష్ట జేసి పిమ్మట ఆ విగ్రహమునకు యెదుటను కూర్చుండి ధ్యానము చేసి మూలమంత్రమును జపించినవాడు నిశ్చయముగ వశ్యమగును.

నదీజలమును తీసుకుని ఆ జలమును మూల మంత్రముతో నిరువది యేడు పర్యాయములు అభిమంత్రించి పిమ్మట నా ఉదకముతో ముఖ ప్రక్షాళనము జేసుకొని, రాజసభకు వెళ్లి యెవరిని జూచినను వారు తత్క్షణము నిశ్చయముగ వశ్యమగుదురు.

## కార్యసాదనకర గణపతి మాలా మంత్రం

"ఓం నమో భగవతే మహాగణపతే సింధూర రంజితాయ పుండ్రేక్షు గదా శూల పరశుపాశాంకుశ ధరాయ ఓం శ్రీం హ్రీం క్లీం సర్వజన సంరక్షకాయ సర్వలక్ష్మీ ప్రదాయ సర్వలోక వశీకరణాయ క్రోం క్రోం క్రోం ఆం ఆం ఆం క్లీం క్లీం క్లీం పాశాంకుశాభ్యాం సకలరాజమండలం మమ వశ మానయ వశమానయ క్లీం క్లీం క్లీం సకల విషాది నివారణం కురు కురు రం రం రం హ్రీం హ్రీం హ్రూం క్షం సకల భూతప్రేత పిశాచ బ్రహ్మరాక్షస యక్షిణి మోహిని శూలిని చతుష్షష్టి యోగిన్యాది సకల బేతాళగ్రహ శాకినీ ఢాకినీ విధ్వంసనం కురు కురు ప్రోం ప్రోం ప్రోం సకల చోరభయం నివారయ నివారయ ఠం ఠం ఠం శత్రుమండలం స్తంభయ స్తంభయ గ్లౌం గ్లౌం గ్లౌం సకల విఘ్నాన్ విధ్వంసయ విధ్వంసయ సౌం శ్రీం మమ మనోరథం సాధయ సాధయ ఓం శ్రీం హ్రీం క్లీం సర్వకార్యసాధనం శీఘ్రం కురు కురు హ్రీం శ్రీం క్లీం గ్లౌం గం శ్రీమహాగణపతయే హుంఫట్ స్వాహా"॥

విధానము : ఈ కార్యసాధనకర మాలామంత్రాన్ని నిత్యము జపించిన సర్వవిఘ్నములు నివారణ అయి తాను తలచిన కార్యములన్నియు సఫల మగును. ఈ మాలా మంత్రమును గ్రహణ సమయంలో 1008 (బహుశా 108 కావచ్చు) పర్యాయములు జపించిన సిద్ధించును. లేనిఎడల రోజు 108 పర్యాయాలు వంతున 48 రోజులు జపించిన సిద్ధించును.

## హరిద్రా గణేశ విద్య

ముందుగా ఋషి, ఛందో దేవతలను న్యాసింపవలెను. తనయొక్క మూర్ధ్ని స్థానమునందు ఋషిని, వదనమునందు ఛందస్సును, హృదయము నందు దేవతను, న్యాసమొనర్పవలెను. అనంతరము బీజమును దక్షిణ స్తనమునందు, శక్తిని వామస్తనమందును, కీలకమును ఆ రెంటి యొక్క మద్య భాగమునందు న్యాసింపవలెను. తను సాధింపదలచిన కార్యమును వినియోగముగా జెప్పవలెను.

ముందు ఋషీమొదలగు వానిని విన్యసించి అటుపిమ్మట కరన్యాసము, ఆ తర్వాత అంగన్యాసము, తదుపరి వర్ణన్యాసము చేయవలెను. దిగ్బంధ మొనర్చి, హరిద్రాగణపతిని ధ్యానించి పంచోపచారపూజలు సల్పి, హరిద్రా

గణపతి యొక్క మూలమంత్రమును జపించవలెను.

మూలమంత్రం : ఓం హుం గం గ్లౌం హరిద్రాగణపతయే వరవరద సర్వజన హృదయం స్తంభయ స్తంభయ స్వాహా ॥

దీక్షా నియమములతో గూడిన వ్రతముగలవారై ప్రతి దినము పసుపు కొమ్ముచే చేయబడిన గణపతి విగ్రహమును విద్యుక్తముగా పూజింపుచు లక్ష సంఖ్య యగువరకు మూల మంత్రమును జపించి పిమ్మట పదివేల పర్యాయములు ఆవుపాలచే తర్పణగావించి వెయ్యి పర్యాయములు కుడుములు; నెయ్యి, చెరుకు ముక్కలచే అగ్నిముఖమునందు హోమము గావించి యధాశక్తిగా సమారాధన గావించిన యెడల మంత్రసిద్ధి చేకూరగలదు. అటుపిమ్మట తమ కొరకుగానీ ఇతరుల కొరకుగానీ కామ్యకర్మలను సాదించవలెను.

## శక్తి గణపతి మంత్రం

మూలమంత్రం : ఓం హ్రీం గ్రీం హ్రీం నమః

వ్రతదీక్షానియమములు బట్టి సాధకుడు, తన స్వగృహము నందు గానీ, పురశ్చరణము ప్రారంభించవలెను. పర్వతాగ్ర ప్రదేశమందైన విశేష ఫలితముల నందగలడు. ప్రతి దినము మూడు వేలలయందున శక్తి సహితుడైన గణపతిని 3 లక్షల జపము, హోమ, తర్పణ, మార్జినాదులు చేసిన సిద్ధిపొంది, కామ్యాదులు నెరవేరును.

## అథ గణపత్యథర్వ శీర్షమ్

(అథర్వశీర్షోపనిషత్తుల పరంపరలో 'గణపత్యథర్వశీర్షము'నకు అత్యంత విశేష మహత్త్వము ఉన్నది. మంగళప్రదములైన ఏ కార్యక్రమము ప్రారంభించినప్పటికీ ముమ్మందుగా సకలవిఘ్న నివారకుడైన గణాధిపతి పూజ చేయుట అనివార్యమని అందరికీ విదితమే. అట్లే గణపతి పూజలో గానీ, పూజానంతరముగానీ ప్రార్థనా రూపంగా ఈ గణపత్యథర్వశీర్షోపనిషత్తును పఠించుట కూడా పరిపాటిగ ఉన్నది. నిజమునకు ఇది భగవానుడగు గణపతియొక్క వైదిక స్తోత్రము. ఇందులో గణపతి మహామంత్రముతో పాటుగా గణేశ–గాయత్రీ మంత్రము కూడా వాటి మాహాత్మ్య సహితముగా చేర్చబడివున్నది. దీనిని పఠించువారలను ఏవిధమైన విఘ్నములు, ఆటంకములు, బాధలు బాధింపకుండా తొలగిపోవును. దీనిని పఠించిన మహా

పాతకములనుండి ముక్తులైపోవుదురు. అంతేగాక, ధర్మ, అర్థ, కామ, మోక్షములు ఆనెడు చతుర్విధ పురుషార్థములను పొందెదరనుటలో సందియములేదు. ఇంకను దీనిద్వారా లభించెడు అనేక ఫలితములను గూర్చి ఫలశ్రుతి యందు పేర్కొనబడినది.)

ఓం భద్రం కర్ణేభిః శృణుయామదేవాః । భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।
స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః । వ్యశేమ దేవహితం యదాయుః ।
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥
ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

హరిః ఓం ॥లం॥ నమస్తే గణపతయే । త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి త్వమేవ కేవలం కర్తాసి । త్వమేవ కేవలం ధర్తాసి । త్వమేవ కేవలం హర్తాసి । త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి । త్వం సాక్షాదాత్మాసి నిత్యమ్ ॥1॥

ఋతం వచ్మి । సత్యం వచ్మి ॥ 2 ॥

అవ త్వం మామ్ । అవ వక్తారమ్ । అవ శ్రోతారమ్ । అవ దాతారమ్ । అవధాతారమ్ । అవానూచాన మవశిష్యమ్ । అవపశ్చాత్తాత్ । అవ పురస్తాత్ । అవోత్తరాత్తాత్ । అవ దక్షిణాత్తాత్ । అవ చోర్ధ్వాత్తాత్ । అవాధరాత్తాత్ । సర్వతో మాం పాహి పాహి సమంతాత్ ॥3॥

త్వం వాఙ్మయస్త్వం చిన్మయః । త్వమానందమయస్త్వం బ్రహ్మమయః। త్వం సచ్చిదానందాద్వితీయోఽసి త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి! త్వం జ్ఞానమయో విజ్ఞానమయోఽసి ॥4॥

సర్వం జగదిదం త్వత్తో జాయతే । సర్వం జగదిదం త్వత్తస్తిష్ఠతి । సర్వం జగదిదం త్వయి లయమేష్యతి । సర్వం జగదిదం త్వయి ప్రత్యేతి ॥ త్వం భూమిరాపోఽనలోఽనిలో నభః। త్వం చత్వారి వాక్పదాని ॥5॥

త్వం గుణత్రయాతీతః । త్వం దేహత్రయాతీతః । త్వం కాలత్రయాతీతః । త్వం మూలాధారస్థితోసి నిత్యమ్ । త్వం శక్తి త్రయాత్మకః । త్వాం యోగినో ధ్యాయంతి నిత్యమ్ । త్వం బ్రహ్మా త్వం విష్ణుస్త్వం రుద్రస్త్వం మింద్రస్త్వమగ్నిస్త్వం వాయుస్త్వం సూర్యస్త్వం చంద్రమాస్త్వం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥6॥

గణాదిం పూర్వముచ్చార్య । వర్ణాదిం తదనంతరమ్ । అనుస్వారః పరతరః। అర్ధేందు లసితమ్ । తారేణ రుద్ధమ్ । ఏతత్తవ మనుస్వరూపమ్ । గకారః పూర్వరూపమ్। అకారో మధ్యమరూపమ్ । అనుస్వారశ్చాంత్య రూపమ్ । బిందురుత్తరరూపమ్ । నాదః సంధానమ్ । సంహితాసంధిః । సైషాగణేశవిద్యా । గణకఋషిః। నిచృద్గాయత్రీ ఛందః । గణపతిర్దేవతా । ఓం గం గణపతయే నమః ॥ 7 ॥ ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి । తన్నో దంతిః ప్రచోదయాత్ ॥ 8 ॥

శ్లో॥ ఏకదంతం చతుర్హస్తం పాశమంకుశధారిణమ్ ।
రదంచ వరదం హస్తైర్బిభ్రాణం మూషకధ్వజమ్ ॥
రక్తం లంబోదరం శూర్పకర్ణకం రక్తవాససమ్ ।
రక్త గంధాను లిప్తాంగం రక్తపుష్పైః సుపూజితమ్ ॥
భక్తానుకంపినం దేవం జగత్కారణ మచ్యుతమ్ ।
ఆవిర్భూతం చ సృష్ట్యాదౌ ప్రకృతేః పురషాత్పరమ్ ॥
ఏవం ధ్యాయతి యో నిత్యం సయోగీ యోగినాం వరః॥ 9 ॥
నమో వ్రాతపతయే నమో గణపతయే నమః ప్రమథ పతయే
నమస్తే అస్తు లంబోదరాయై ఏకదంతాయ
విఘ్ననాశినే శివసుతాయ శ్రీ వదరమూర్తయే నమః ॥ 10 ॥

ఉత్తరపీఠికా :

ఏతదథర్వశీర్ష యోధీతే । స బ్రహ్మభూయాయ కల్పతే ।
స సర్వవిఘ్నైర్నబాధ్యతే । స సర్వతః సుఖమేధతే ।
స పంచ మహాపాపాత్ప్రముచ్యతే । సాయమధీయానో దివస
కృతం పాపం నాశయతి । ప్రాతరధీయానో రాత్రికృతం పాపం
నాశయతి । సాయంప్రాతః ప్రయుంజానోఽపాపోభవతి ।
సర్వత్రాధీయానోపవిఘ్నో భవతి । ధర్మార్థకామమోక్షం చ
విందతి । ఇదమథర్వశీర్షమశిష్యాయ న దేయమ్ ।
యో యది మోహాద్దాస్యతి స పాపీయాన్ భవతి ।
సహస్రావర్తనాత్ యం యం కామమధీతే తం తమనేనసాధయేత్ ॥11॥
అనేన గణపతి మభిషించతి । సవాగ్మీభవతి । చతుర్థ్యా మనశ్నన్
జపతి స విద్యావాన్ భవతి । ఇత్యథర్వణవాక్యమ్ ॥
బ్రహ్మాద్యా చరణం విద్యాత్ న బిభేతి కదాచ చేతి ॥12॥
యో దూర్వాంకురై ర్యజతి స వైశ్రవణోపమో భవతి ।
యో లాజై ర్యజతి స యశోవాన్ భవతి । స మేధావాభవతి ।
యో మోదక సహస్రేణ యజతిస వాంఛిత ఫలమీవాప్నోతి।
యః సాజ్య సమిద్భిర్యజతి స సర్వం లభతే । స సర్వం లభతే ॥
అష్టౌ బ్రాహ్మణాన్ సమ్యగ్గ్రాహయిత్వా సూర్య వర్చస్వీ భవతి ।
సూర్యగ్రహే మహానద్యాం ప్రతిమాసన్నిధౌ వా జప్త్వా
సిద్ధమంత్రో భవతి । మహా విఘ్నాత్ప్రముచ్యతే ।
మహాదోషాత్ప్రముచ్యతే । మహాపాపాత్ప్ర ముచ్యతే ।
స సర్వ విద్భవతి । స సర్వవిద్భవతి ।
య ఏవం వేద ॥14॥ ఇత్యుపనిషత్

ఓం శాంతిః శాంతిః శాంతిః
ఓం భద్రం కర్ణేభిరితి శాంతిః
॥ ఇతి గణపత్యథర్వశీర్షమ్ ॥

## గణపతి అధర్వశీర్ష మంత్రోపాసన విధి విధానము

అత్యంత ప్రభావవంతమైన ఈ అధర్వశీర్ష మంత్రాన్ని ఎవరైతే నిత్యము రెండుపూటలా జీవితపర్యంతము ఉపాసిస్తారో వారికి అసాధ్యమైన మోక్షము కూడ చివరకు వరిస్తుంది. నిత్యము గణపతి అధర్వశీర్ష మాలామంత్రాన్ని నియమ నిష్టలతో భక్తి శ్రద్ధలతో 11 సార్లుగాని, 21 సార్లుగాని, 32 సార్లు గాని, 54సార్లుగాని, 108 సార్లుగాని (పర్వదినాలలో) పారాయణ/ జపము/ ధ్యానము చేస్తున్న, ఆ చేసేవ్యక్తి సమస్త విషయాలను పరబ్రహ్మ అయినటువంటి గణేశుడు తీరుస్తాడు. జీవిత చరమాంకాన భక్తునికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు.

ప్రభలమైన, జఠిలమైన కోర్కెను సఫలీకృతం చేసుకోవడానికి ఒక మండలముపాటు (48రోజులు) లేక రెండు మండలములపాటు (96 రోజులు) నిత్యము ధ్యానిస్తూ ఉండాలి. ప్రదక్షిణలు చేసేవారు 108 ప్రదక్షిణలు చేయాలి. ఎంత సంఖ్య జపిస్తారో, దానిలో 10వ వంతు ఆవుపాలతో తర్పణం ఇవ్వాలి. ఈ మంత్రంతోటి 108 సార్లు కనీసము చంద్రమంత్రాన్ని జపంచేసి తర్పణ ఇవ్వాలి. ఇలా చేస్తూ మండలము లేక రెండు మండల ములు ఉపాసనపూర్తి అయిన మరుసటి రోజున 1108 మోదకాలతో హోమం చేయాలి. ఆ చివరి హోమం చేసే దినము బుధవారము లేక చవితి తిథి అయ్యేలాగ చసుకొంటేమంచిది. మోదకాలు కొబ్బరి లౌజు పెట్టి చపాతీలలాగ చేయాలి. నెయ్యిలో ముంచి హోమం చేయాలి. 1108 మోద కాలలో ఒక వందమోదకాలను గణపతికి నివేదన ఇచ్చి పేదలకు, అనాద లకు, బిచ్చగాళ్లకు పంచాలి. హోమంలో తెల్లజిల్లేడు లేక మామూలు జిల్లేడు, రావి, బిల్వపత్రి, ఉమ్మెత్త, ఉత్తరేణి, గుమ్మడిముక్కలు, మేడి, జువ్వి, ఆముద వృక్షభాగాలను, తెల్లనువ్వులు, త్రిఫలాలు, తెల్లఆవాలు, అటుకులు, నవధాన్యాలు, జీలకర్ర, పచ్చకర్పూరం లాంటి ద్రవ్యాలతో సమర్థులైన పూజారులతో చేయించిన కాలేని కార్యమంటూ లేదని ఋగ్వేదం చెబు తున్నది.

# 1] గణపతి యంత్రము




గణపతి యంత్రము

శ్లో॥ షట్కోణమ్ వృత్తద్వయమ్ చాష్టపత్రమ్ యుగ్మవృత్తకమ్ ।
గణేశస్య మహా యంత్రమ్ భూపురేణ విభూషితమ్ ॥

అన్ని విధములైన విఘ్నములను పారద్రోలి, కార్యసాధన, జయములను కలిగించుటలో గణేశుని యంత్రము అమోఘమైనది. గణపతి రూపములు–ఫల భేదముల ననుసరించి 32గా దెలుపబడినవి. ఇందు ముఖ్యమైన పదునొకండు గణపతి దేవులకు యంత్ర ప్రస్థాన విధానము లభించుచున్నది. గణములు అన్నింటికిని అధిపతి యగుట వలన 'గణపతి'గా పేర్కొనబడిన ఈ యంత్రము కొన్ని వాస్తు దోషములను తొలగించుటకేగాక...నిత్యజీవితములో ప్రతివారికిని విఘ్ననాశనమునకు, కార్య సాదనకు విశిష్టత నంది యున్నది.

గృహవాస్తువు నందు నైఋతితో కూడిన పశ్చిమ దిశ పల్లముగా నున్న దోషము, గృహమందు గదులు వ్యత్యస్థముగా నిర్మించబడుట వలన కలుగు దోషములను, దైవ దృష్టి సంభవించిన దోషమును, ఇంకా అనేకము లైన గృహగర్భ గతమగు వాస్తు దోషములను పరిహరింప జేసి, క్షేమము, గౌరవ మర్యాదలు, సత్కీర్తి, ఉన్నతత్వము, పలుకుబడి, కుటుంబ సౌఖ్యము, కార్య సాధనలను కలిగించులో ఈ యంత్రము బహు పేరెన్నిక గన్నది.

ఈ యంత్రమును 5×5 అంగుళముల రాగిరేకుపై చెక్కించి; దశవిధ సంస్కారములు, ప్రాణప్రతిష్ఠ, జీవకళాన్యాసములను జరిపిన పిమ్మట దిగువ తెలిపిన గణపతి మంత్రమును - పురశ్చర్యా నియమముల తోటి ఒక లక్షా ఇరువది వేల పర్యాయములు జపించి, యంత్రమునకు ధారబోసి, శుభముహూర్తము నందు గృహమందలి యోగ్య ప్రదేశమున స్థాపించిన ఎడల ఆ యంత్రము తనకు నిర్దేశించిన ఫలితముల నొసంగ గలదు.

**గణపతి మంత్రమ్ :** అస్యశ్రీ గణపతి మహా మంత్రస్య! దూర్వాస ఋషిః అనుష్టుప్ ఛందః గణపతిర్దేవతా ! గం బీజమ్ ! హ్రీమ్ శక్తి! స్వాహా కీలకమ్! అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః॥ గామితి అంగన్యాస కరన్యాసమ్ కుర్యాత్ ॥

**ధ్యానమ్ :**

శ్లో॥ సింధూరా స్త్రినేత్రః పృథుతర జఠరో హస్త పద్మమ్ దధానమ్ ।
దంతమ్ పాశాంకుశేష్ట్యా నురుతర విలసద్బీజ పూరాభి రామమ్ ॥
బాలేందు ఖ్యాతి మౌళి కరిపతి వదనాదాన పూర్ణార్ద్ర గండో
భోగేంద్రై ర్భూషితాంగో ర్జయతు గణపతిమ్ రక్త వస్త్రాంగ రాగః॥

**మంత్రమ్ :** ఓమ్ నమో భగవతే వక్రతుండాయ మహా గణపతయే ఆం హ్రీం క్రోం హ్రీం గం శ్రీం సర్వజన ముఖ హృదయ రంజనమ్ కురుకురు స్వాహా ॥

**లఘు మంత్రమ్ :** ఓం హ్రీం శ్రీం గం గణపతయే స్వాహా ॥

మంత్రమును 1,20,000 పర్యాయములు జపించిన పిదప 12,000 మారులు అష్టద్రవ్యములతో హవనము గావించుట వలన యంత్రమునకు విశేషమైన శక్తి ప్రాప్తించి, శీఘ్ర ఫలితముల నొసంగ గలదు.

**అష్టద్రవ్యములు :** 1 కుడుములు 2 అటుకులు 3 చెరకు ముక్కలు 4 కొబ్బరి ముక్కలు 5 పేలాలు 6 శ్రీగంధ సమిధలు 7 తెల్ల గరిక 8 ఆవు నెయ్యి.

## 2] సిద్ధ గణపతి యంత్రము

సిద్ధ గణపతి యంత్రము

శ్లో॥ షట్కోణమ్ వృత్తసహితమ్ వృత్తమ్ చాష్టపత్ర యుతమ్ ।
వృత్త ద్వయమ్ చ భూపురమ్ యంత్రమ్ సిద్ధ గణేశకమ్
అరిష్ట శమనమ్ చైవ సుఖ సౌభాగ్య వర్ధనమ్ ॥

ఎట్టి వ్యతిరేక విషయమునైనను అనుకూలముగా మార్చుదానిని "సిద్ధి" యనబడును. అట్టి సిద్ధినొసంగవారే సిద్ధ గణపతి. ఈ దేవుని యంత్రము సర్వారిష్టములను శమింపజేసి, సుఖ సౌఖ్యములను కలుగ జేయుటేగాక.... కొన్ని ప్రత్యేక వాస్తు దోషములను కూడా పరిహరించి, క్షేమాభివృద్ధిని కలిగించగల మహత్తర శక్తిని గలిగి యున్నది.

గృహమందుగానీ, స్థలాదుల యందుగానీ వాయవ్య దిశలో శల్యము లుండుట వలన కలుగు దోషములు అనగా...గృహచ్ఛిద్రములు, అకారణ శత్రుత్వములు, వ్యసనపరులగుట, సంతానము దేశాంతర గతులగుట వంటి

అరిష్టములను మరియు పాతవైన ఇటుకలు, కలప మొదలగు వాటిచే నిర్మించబడిన గృహదోషములు ఈ సిద్ధగణపతి యంత్రమును స్థాపించుట వలన తొలగిపోగలవు. ఈ యంత్ర ప్రభావము వలన ఆ గృహ యజమానులు సకల సౌఖ్యములను అందగలరు.

సిద్ధగణపతి యంత్రమును 5×5 అంగుళములుగల రాగిరేకుపై చెక్కించి; దశవిధ సంస్కారములు, ప్రాణప్రతిష్ట జీవ కళాన్యాసములను జరిపించి; ఈ దిగువ చూపబడిన సిద్ధగణపతి మంత్రమును ఒక లక్ష పర్యాయములు జపించి, యంత్రమునకు ధారబోసి; గృహమందలి లేదా స్థల మందలి ఉచిత స్థానమున శుభముహూర్తములో స్థాపించిన ఎడల వాస్తు సంబంధములైన శల్యాది దోషములను పరిహరించి, అరిష్ట నివారణ మొనర్చి; యజమానులకు, ఆ గృహ స్థలాదులలో నివసించు వారికి ఆయు రారోగ్య సుఖ సౌభాగ్యములను కలిగించ గలదు.

**సిద్ధ గణపతి మంత్రమ్ :** అస్యశ్రీ సిద్ధ గణేశ మహా మంత్రస్య ! బ్రహ్మ ఋషి! గాయత్రీ ఛందః సిద్ధగణపతి ర్దేవతా । సిం బీజమ్ । గం శక్తిః । హ్రీం కీలకమ్ । సర్వారిష్ట నాశనార్థే జపే వినియోగః॥

ధ్యానమ్ :

శ్లో॥ గజాననమ్ భూతగణాధి సేవితమ్ ।
కపిత్థ జంబూ ఫలసార భక్షణమ్ ।
ఉమాసుతమ్ శోక వినాశ కారణమ్ ।
నమామి విఘ్నేశ్వర పాద పజజమ్ ॥

**మంత్రమ్ :** ఓం ఆం హ్రీం క్రోం శ్రీం హ్రీం గం సిం సిద్ధ గణపతయే। వరవరద సర్వకార్య సిద్ధిమ్ । దాపయ దాపయ (కురు కురు) హ్రీం స్వాహా।

ఈ మంత్రమును పునశ్చరణ నియమముల గలవారై; శుక్లపక్ష చవితి తిథి నుండి ప్రారంభించి, తిరిగి శుక్ల చవితి వరకు ఒక లక్ష పర్యాయములు జపించి, పంచమినాడు హవనమ గావించవలెను.

## వివిధ గణపతి మంత్రములు

1. ఓం శ్రీం హ్రీం క్లీం గణేశ్వరాయ బ్రహ్మ స్వరూపాయ గురవే సర్వసిద్ధి ప్రదాయ విఘ్నేశాయ నమోనమః॥

2. ఓం గం గ్లౌం గణపతయే విఘ్నవినాశినే స్వాహా ॥

3. వక్రతుండాయ హుమ్ ।

4. ఓం గం క్షిప్ర ప్రసాదనాయనమః ॥

5. ఓం విఘ్నరాజాయ విద్మహే । హస్తిముఖాయ ధీమహి ।
తన్నో దంతీ ప్రచోదయాత్ ॥

6. ఓం ఏకదంతాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి । తన్నో దంతీ ప్రచోదయాత్ ॥

7. ఓం । లంబోదరాయ విద్మహే । మహోదరాయ ధీమహి । తన్నో దంతీ ప్రచోదయాత్ ॥

8. ఓం మహోల్కాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి । తన్నో దంతీ ప్రచోదయాత్ ॥

9. ఓం తత్పురుషాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి । తన్నో దంతీ ప్రచోదయాత్ ॥

10. ఓం గం గణపతయే నమః

11. ఓం హ్రీం గం హ్రీం గణపతయే నమః

12. ఓం హస్తి పిశాచిని స్వే స్వాహా ॥

## ఋణ హర్తృ గణపతి మంత్రం (ఆర్థిక ఇబ్బందులు తీరుటకు)

మూలమంత్రం : "ఓం గం గణపతయే సకలఋణం ఛింది ఛింది వరేణ్యం ఫట్ స్వాహా॥"

విధానం : పై మంత్రంతోటి ఈ మంత్రాన్ని నిత్యం 1008 సార్లు 48 రోజులు ధ్యానంచి 49వ రోజు 11 కిలోల నువ్వులు (తెల్లనువ్వులు), చెరకు ముక్కలు, తాటిబెల్లం, గరిక, జిల్లేడు రావి, వేపలాంటి చెట్టుక్రియలతో ఉదయం 11–30 లోపు హోమం చేయవలెను. నియమాలు ఆచరించవలె.

## గణపతిని దర్శించునపుడు స్మరణ శ్లోకం

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే ॥

శ్లో॥ లంబోదరం పరమసుందరమేకదంతం ।
రక్తాంత దీర్ఘనయనం పరమం పవిత్రం ।
ఉద్యద్దివాకర కరోజ్జ్వలకాంతి కాంతం
విఘ్నేశ్వరం సకలవిఘ్న హరం నమామి ॥

ప్రసన్న గణపతి ధ్యానం

ఉద్యద్దినేశ్వర రుచింని జహస్తపద్మ ।
పాశాంకుశాభయకరాన్ సతతంగజాస్యం ।

## శ్రీ గణపతి సూక్తం

హరిః ఓం నిషుసీదగణపతే గణేషుత్వా మాహుర్వి ప్రాతమం కవీనాం। నరుతేత్వత్రి్కయతే కించనారే మహామర్కంమఘ వన్చిత్రవమార్చ । అభిమానో మఘువన్నాధ మానాస్సఖే బోధివాసుపతే సఖీనాం । రణం కృధిరణకృత్సత్య శుష్మాభక్తే చిదాభజారాయే అస్మాన్ ఆతూన ఇంద్రక్షుమంతంచిత్రగ్రాభంసం గృభాయ । మహవాస్తీ దక్షిణేన । విద్యాహిత్వాతులికూర్మింతు విదేష్ణంతు వీమఘం తు విమాత్రమవోభిః । నహిత్వాశూరదేవా నమర్తాసోదిత్సంతం। భీమనగాం వారయంతే । ఏతోన్వింద్ర స్తవామేశానంవస్వ స్వరాజం । నరాధసా మర్దిషన్నః। ప్రస్తోషదువగాసిపచ్ఛపత్సామగీయమానం । అభిరాధ సాజిజాజిగురత్ । ఆనోభరదక్షిణేఆనాభిసవ్యేన ప్రమృశ । ఇంద్రం మానో సోర్న్ర్భాక్ । ఉపక్రమస్వాభరధీషతా దృష్ణోజనానాం । ఆదాశూర్ షరస్యవేదః । ఇంద్రంయ ఉనుతే ఆస్తివాజో విప్రేభిస్సనిత్వః। అస్మాభిస్సుతం సనుహి । సద్యోజువస్తేవాజా అస్మభ్యం విశ్వశ్చంద్రా॥ వశైశ్చమక్షూజరంతే॥

ఇతి గణపతి సూక్తం సంపూర్ణము.

## సమస్తవిధములైన రక్షణలు లభించుటకు గణపతి స్తోత్రము

శ్రీ గణేశాయనమః। ఆచమ్య । ప్రాణాయామం కృత్వా । దక్షిణహస్తే వక్రతుండాయ నమః । వామహస్తే శూర్పకర్ణాయ నమః। ఓష్ఠే విఘ్నేశాయ నమః । సంపుటే గజాననాయనమః । దక్షిణపాదే లంబోదరాయ నమః। వామపాదే ఏకదంతాయ నమః శిరసి ఏకదంతాయ నమః చుబుకే బ్రహ్మణ స్పతయే నమః దక్షిణ నాసికాయాం వినాయకాయ నమః వామ నాసికాయాం జ్యేష్ఠరాజాయ నమః దక్షిణనేత్రే వికటాయనమః వామనేత్రే

కపిలాయనమః దక్షిణకర్ణే ధరణీ ధరాయ నమః వామకర్ణే ఆశాపూరకాయ నమః నాభౌ మహోదరాయ నమః హృదయే ధూమ్రకేతవే నమః లలాటే మయూరేశాయనమః దక్షిణ బాహోస్వానంద వాసకారకాయ నమః - వామబాహో సచ్చిత్సుఖధామ్నే నమః ॥

విధానము

పై స్తోత్రమును ప్రతిరోజూ ఉదయము స్నానము చేసిన తరువాత చదువుచుండు వారికి గణపతి అనుగ్రహము వల్ల సర్వవిధములైన రక్షణయు లభించును.

## శ్రీ గణేశ బీజాక్షర మంత్రములు

**1. రత్నగర్భ గణేశ మంత్రము**

మూలమంత్రము :

ఓం ర్ఖ్యౌ ఊం గ్లీం గం నమశ్చింతా మణయే

రత్న గర్భాయ మహాగణేశాయ స్వాహా ॥

**2. ఏకాక్షర గణపతి మంత్రము**

మూలమంత్రము : ఓం గం గణపతయే నమః

**3. మహాగణపతి మంత్రము**

మూలమంత్రము :

ఓం శ్రీం హ్రీం క్లీం ఐం సౌః గ్లౌం గాం

శ్రీం హ్రీం దూం క్లీం గ్లౌం గౌం గం గః మహాగణాధిపతయే నమః

**4. హేరంబగణపతి మంత్రము**

మూలమంత్రము : ఓం గూం నమః

**5. విఘ్నగణపతి మంత్రము**

మూలమంత్రము :

ఓం గం గణపతయే సర్వవిఘ్నహరాయ సర్వాయ

సర్వగురవే లంబోదరాయ హ్రీం గం నమః॥

**6. శ్రీ విద్యా గణపతి మంత్రము**

మూలమంత్రము :

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం క ఏ ఈల హ్రీం గణపతయే హస కలహ్రీం । వరవరద సకల హ్రీం సర్వజనం మే వశమానయ స్వాహా ।

**7. లక్ష్మీగణపతి మంత్రము**

మూలమంత్రము :

ఓం శ్రీం హ్రీం క్లీం గౌం గం గణపతయే
వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా ।

**8. ప్రకారాంత గణపతి మంత్రము**

చింతామణి గణపతి మంత్రము :

ఓం హ్రౌక్ష్మ్ర్య్ ఊం గ్లౌం గం చింతామణయే
రత్నగర్భాయ మహాగణేశాయ స్వాహా ॥

**9. హరిద్రా గణపతి మంత్రము**

ఓం హుం గం గ్లౌం హరిద్రా గణపతయే వరవదర
సర్వజన హృదయం స్తంభయ స్తంభయ స్వాహా ॥

**10. సిద్ధి గణపతి మంత్రము**

ఓం నమస్సిద్ధి వినాయకాయ సర్వకార్యకర్త్రే
సర్వవిఘ్న ప్రశమనాయ సర్వరాజ్య వశ్యకరణాయ
సర్వజన సర్వస్త్రీ పురుషాకర్షణాయ శ్రీం ఓం స్వాహా॥

**11. వరద గణపతి మంత్రము**

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద
సర్వజనమంమే వశమానయ స్వాహా ॥

**12. వీర గణపతి మంత్రము**

ఓం హ్రీం క్లీం వీరవరగణపతయే వః వః ఇదం
విశ్వం మమ వశమానయ ఓం హ్రీం ఫట్ ॥

**13. మహాగణపతి మంత్రము**

శ్రీం గం సౌమ్యాయ మహాగణపతయే వరవరద
సర్వజనంమే వశమానయ స్వాహా ॥

ఓం గం సౌర్యాయ మహాగణపతయే వరవరద

సర్వజనం మే వశమానయ స్వాహా ॥

**14. ఋణవిమోచన గణపతి మంత్రము**

ఓం గణేశ ఋణం ఛింది వరేణ్యం నమః ఫట్

**15. సర్వసిద్ధికర గణపతి మంత్రము**

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం దాం హ్రీం గ్రీం క్లీం

మహాగణాధిపతయే నమః

**16. విరి-విరి-గణపతి మంత్రము**

హ్రీం విరి విరి గణపతే వరవరద

సర్వలోకం మే వశమానయ స్వాహా ॥

**17. శక్తి-గణపతి మంత్రము**

ఓం హ్రీం గం హ్రీం మహాగణపతయే స్వాహా ॥

**18. గణేశ గాయత్రి మంత్రము**

ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ

ధీమహి తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

**19. బాలగణేశ**

ఐం ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గ్లం క్లీం గణపతే వరద వరద !

సౌః సర్వ జనం మే వశమానయ స్వాహా ॥

**20. క్షిప్ర గణపతి**

ఓం శ్రీం హ్రీం గ్లౌం గణపతయే

సర్వకార్య సిద్ధిం కురు కురు స్వాహా ॥

**21. నవనీత గణపతి**

ఓం గ్లౌం నవనీత గణపతయే

సర్వకార్య సిద్ధిం కురు కురు స్వాహా ॥

**22. శక్తి గణపతి**

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం ఐం వద వద వాగ్వాదిని

## మూల మంత్రము

రాయస్పోషస్య దధి తెదిధిదోరత్న ధాతుమాన్। రక్షోహణో వలగహనో వక్రతుండాయహుం (31 అక్షరలముల మంత్రము) లక్ష జపాత్సిద్ధిః

## మంత్రమహార్ణవే

శ్లో॥ బ్రహ్మచర్యరతో మంత్రీ జపేద్రవిసహస్రకం ।
షణ్మాసమధ్యాద్దారిద్ర్యం నాశయత్యేవనిశ్చితం ॥

తా. మంత్రసిద్ధ్యనంతరము బ్రహ్మచర్య వ్రతమొనర్చుచు పంద్రెండు వేలు జపముచేసిన యెడల నాఱుమాసములలో దారిద్ర్యము నిశ్చయముగా నశించును.

శ్లో॥ చతుర్థారిచతుర్థ్యం స్తం జపేద్దశసహస్రకం ।
ప్రత్యహంజుహుయాదష్టోత్తర శతమతంద్రితః ।
పూర్వోక్తం ఫలమాప్నోతి షణ్మాసాద్భక్తితత్పరః॥

తా. చవితి మొదలుకొని తిరుగ చవితి తిథి మధ్యను పదివేలు జపము చేయుచు, ప్రతిదినము 1008 పర్యాయములు చొప్పున హోమము చేసిన యెడల ఆరుమాసములలో దారిద్ర్యము తప్పక నశించును.

శ్లో॥ ఆజ్యాక్తాన్న స్యహోమేన భవేద్ధన సమృద్ధిమాన్ ।

తా. నెయ్యి, అన్నము కలిపి హోమము చేసిన యెడల ఐశ్వర్యవంతు డగును.

శ్లో॥ పృథుకైర్నారికేళైర్వామరీచైర్వా సహస్రకం ।
ప్రత్యహంజుహ్వాతో మాహజ్జాయతే ధనసంచయః॥

తా. అటుకులతోగాని, కొబ్బరికాయలతో గాని, మిరియాలతో గాని ఒక నెలరోజులు ప్రతినిత్యము వెయ్యి చొప్పున హోమముచేసిన యెడల ధనము సంప్రాప్తించును.

శ్లో॥ జీరసింధుమరీచాక్తై రష్టద్రవ్యై స్సహస్రకం ।
జుహుయాత్ప్రత్యమాం పక్షాత్స్యాత్కుబేర ఇవార్ధవాన్॥

తా. జీలకర్ర, గజమదము, మిరియాలు, వీనిలో అష్టద్రవ్యములను కలిపి ప్రతినిత్యము వెయ్యి పర్యాయములు చొప్పున ఒక పక్షము హోమము

చేసిన యెడల కుబేరునితో సమానమైన ధనవంతుడగును. అనగా గొప్ప ఐశ్వర్యవంతుడగుననని భావము.

శ్లో॥ తిలైశ్చ మృతసంయుక్తైర్హోమః శ్రీ వశ్యదాయకః।

తా. నువ్వులు, నెయ్యి కలిపి హోమము చేసిన యెడల ఐశ్వర్యము వశీకరణశక్తియు గలుగును.

శ్లో॥ స్వాదుత్రయ యుతైర్లాజైర్హువేత్సప్తదినావధి ।
కన్యార్థీ లభతే కన్యాం పుత్రార్థీలభతే సుతం ॥

తా. పేలాలను మధుత్రయముతో కలిపి ఏడు దినములు హోమము చేసిన యెడల పుత్రికాసంతతి కావలయునని కోరిక గలవారలకు పుత్రికా ప్రాప్తియు, పుత్రసంతతి కావలయునని కోరువారలకు పుత్రప్రాప్తియు గలుగును.

శ్లో॥ దధిసంసిక్తలవణైర్జుహు యాచ్ఛ చతుర్దినం ।
నిశీధిన్యాంచ వశ్యాదౌ భవేదృశ్యంతి ఈప్సితం ॥

తా. పెరుగు ఉప్పు కలిపి నాల్గుదినములు రాత్రియందు హోమము చేసిన యెడల కోరినవశ్యమగును.

## శ్రీ గణపతి మహామంత్రము

అస్యశ్రీ గణపతి మహామంత్రస్య । గణక ఋషిః ఋచాద్గాయత్రీచ్ఛందః । శ్రీమహాగణపతిర్దేవతా । గం బీజం । స్వాహాశక్తిః। గ్లౌం కీలకం । శ్రీమహా గణపతి ప్రసాద సిద్ధ్యర్థే ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః

కరనాస్య అంగన్యాసములు

గ్లాం అంగుష్ఠాభ్యాం నమః

గ్లీం తర్జనీభ్యాం నమః

గ్లూం మధ్యమాభ్యాం నమః

గ్లైం అనామికాభ్యాం నమః

గ్లౌం కనిష్ఠికాభ్యాం నమః

గ్లం కరతలకర పృష్ఠాభ్యాం నమః

గ్లాం హృదయాయ నమః

గ్లీం శిరసే స్వాహా

గ్లూం శిఖాయై వషట్

గ్లైం నేత్రత్రయాయ వౌషట్

గ్లః అస్త్రాయఫట్

లోకత్రయేణ ఇతి దిగ్బంధః

ధ్యానము :

శ్లో॥ బీజాపూరగదేక్షు కార్ముకరుచాం చక్రాబ్జపాశోత్పలాం
వ్రీహ్యాగ్రస్వనిషాణరత్నకలరే ప్రోద్యత్కరంభోరుహః।
ధ్యేయో వల్లభయా సపద్మకరయా శ్లిష్టోజ్వల ద్భూషయా
నిత్యోత్పత్తి విపత్తి సంస్థితి కరోవిఘ్నేశ ఇష్టార్థదః॥

శ్రీ మహాగణాధిపతయే నమః గంధ పుష్ప ధూపదీప నైవేద్య తాంబూలాది నమస్కారాన్ సమర్పయామి. చిన్ముద్రాం ప్రదర్శ్య.

మూలమంత్రము

"ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశమానాయ స్వాహా"

ఈ మూలమంత్రమును ప్రతిదినము 108ని జపించవలయును. మరల కరన్యాస అంగన్యాసములును దిగ్విమోకమును ధ్యానమును చేయవలెను. ఈ గణపతి మహామంత్రము నిత్యము జపించిన వారికి సర్వ కార్యసిద్ధియును, విద్యాలాభమును, సభా విజయమును గల్గును. హోమ విధిన హోమముచేసిన సత్వర కార్యసిద్ధియగును.

## ద్వాత్రింశక్షర గణపతి మంత్రము

మూల మంత్రము : "ఓం శ్రీం హ్రీం క్లీం గణేశ్వరాయ బ్రహ్మ స్వరూపాయ గురవే సర్వసిద్ధిదాయకాయ విఘ్నేశాయ నమోన్నమః"

విధానము : 5 లక్షల జపం చేసిన జపం సిద్ధించును. సమస్త కోర్కెలు సిద్ధించడంతోబాటు ధర్మార్థ కామమోక్షములను ప్రసాదిస్తుందీ మంత్ర రాజము.

## విఘ్నములు తొలగి కోర్కెలు సిద్ధించే గణపతి షోడశాక్షరీ మంత్రము

మూలమంత్రము : "ఓం గం గ్లౌం గణపతయే విఘ్నవినాశినే స్వాహా॥"

విధానము: గోలోక అధినివాసిని జగన్మాత రాధామాత ఈ మంత్రాన్ని ఉపాసించి శ్రీకృష్ణపరమాత్మను పొందింది. ఒకలక్ష జపము చేసిన మంత్రము సిద్ధించును. ఈ మంత్రానుష్టానంవల్ల సర్వవిఘ్నములు నశించి, ప్రారబ్ధ కర్మలు నశించి కోరిన కోర్కెలు నెరవేరును. ఉమ్మెత్తపూలు, కాయలతో పూజ మంచి ఫలితాలనిస్తుంది.

## గణేశ గాయత్రి మంత్రము

గణేశ గాయత్రి : "ఓం వక్రతుండాయ విద్మహే । ఓం శూర్పకర్ణాయ ధీమహి । తన్నో దంతిః ప్రచోదయాత్ స్వాహా॥"

విధానము : ఈ ప్రభావంతమైన గణేశగాయత్రిని నిత్యము శక్తి మేరకు జపిస్తున్న గణపతి అనుగ్రహముతోబాటు సర్వకోర్కెలు నెరవేరును.

## వివాహకారక హరిద్రాగణపతి మంత్రం

మూలమంత్రం : "ఓం హుం గ్లౌం గం హరిద్రాగణపతయే వర వరద హ్రీం క్లీం శీఘ్రం వివాహం మే కారయ కారయ గ్లౌం గం స్వాహా॥"

చేయువిధానము : వివాహం కావల్సిన స్త్రీలుగాని పురుషులుగాని భక్తితో ప్రతిదినము పసుపుతో చేసిన గణపతిని పంచోపచార పూజలాచరించి మూలమంత్రమును 1008 సార్లు జపం చేయాలి. ఇలా ఒక మండలము అనగా 48 రోజులు ఒక లక్షజపం చేసి, ఇందు దశాంశము హోమము (జిల్లేడు,రావి, ఉమ్మెత్తలు మొ॥నవి) చేసి, ఇందు దశాంశము తర్పణము, (ఆవుపాలతో) ఇందు దశాంశము మార్జనము మరియు తగినంత మందికి అన్నసంతర్పణము చేసి, గణపతి స్వయంభూ క్షేత్రములోగాని లేక శ్రీశైలంలో గాని ఒకరోజు నిద్రచేసిన వివాహం తప్పక అవుతుంది.

## వివాహానికి వేరొక గణపతి మంత్రం

మంత్రం : "ఓం ఐం గ్లౌం గం గణపతయే సుప్రమేవ మమపాణి గ్రహం కురు కురు స్వాహా॥"

విధానము: శుచియై భక్తి శ్రద్ధలతో ఈ వివాహకారక గణపతి మంత్రాన్ని నిత్యము 1008 సార్లు వంతున లక్షజపం అగువరకు నియమ

నిష్టలతో జపించాలి. ప్రతి మంగళవారము, ఆదివారము తెల్లజిల్లేడు చెట్టు మొదట్లో పై మంత్రాన్ని 12 సార్లు జపించి, వివాహం అయ్యేట్లు దీవించ మని గణపతిని ధ్యానించి పశుపు కుంకుమతో కల్పిన అక్షతలు పోయాలి. నమస్కరించాలి. వీలు ఉంటే 3 ప్రదక్షిణలు చెయ్యాలి. గుడిలో అయిన నిత్యము 108 ప్రదక్షిణలు వంతున 96 రోజులు ప్రదక్షిణ చేయాలి. 97వ రోజున గాని లేక ఆ తర్వాతవచ్చే బుధవారం రోజున గణపతికి హోమము చేయవలెను. వివాహము నిశ్చయంగ కాగలదు. తర్పణ, మార్జిన, భోజనాదులు చేయవలె.

## ఆర్థిక సమస్యల నివారణకు గణపతి మంత్రం

మంత్రం : 1. “ఓం శ్రీం గం హ్రీం సుప్రప్రసాదినే స్వాహా”

2. “ఓం గం గణపతయే సకలఋణం ఛింది ఛింది స్వాహా”

విధానము : ఆర్థిక సమస్యల నివారణకు పై మంత్రమును నిత్యము 1008 జపించుచున్న ఎడల ఆర్థిక సమస్యలు నివారణమగును. పై రెండు మంత్రాలలో ఏదో ఒక మంత్రమును చేయాలి.

## సకల విఘ్ననివారక, సకల కార్య జయకర గణపతి మంత్రం

మంత్రం : “ఓం నమో భగవతే సిద్ధి వినాయకాయ సర్వకార్యసిద్ధి కరాయ సర్వవిఘ్న ప్రశమనాయ సర్వరాజ వశ్యకరాయ సర్వజన సర్వస్త్రీ పురుషాకర్షణాయ శ్రీం ఓం స్వాహా॥”

విధానము : అద్భుతకరమైన ఈ మంత్రమును శుచియై భక్తిశ్రద్ధలతో ప్రతిరోజు 108కి తగ్గకుండ 1008సార్ల వరకు జపించుచున్న వ్యక్తి తాను సంకల్పించిన సాత్విక, రజోసంబంద కార్యములన్ని నెరవేరును. తూర్పు వైపుకు కూర్చొని ధ్యానించాలి. ప్రతి వినాయకచవితికి హోమము చేయ వలెను.

## ఉదర రోగనాశనకర లంబోదర మంత్రం (అగస్త్యకృతం)

మంత్రం : “ఓం గ్లౌం లంబోదరాయ నమః”

విధానం : ప్రతి బుధవారం పై మంత్రమును 1008సార్లు ఉదరమును స్పృశిస్తూ జపించిన ఉదర వ్యాధులు నశించును.

## వివిధ గణపతి మహా మంత్రాలు

## విషహరణ వినాయక మంత్రము

"ఓం హ్రీం గణేశాయ నమః ఓం హ్రీం స్తంభనాది చక్రాయ నమః ఓం ఐం బ్రహ్మైణ్యా త్రైలోక్యడామరాయ నమః"

ప్రయోజనము : ఈ మంత్రమును 10వేలు జపించి, యవలను (లేక) భస్మమును ఈ మంత్రములో 108 సార్లు అభిమంత్రించి ఇంటిలోను, చుట్టుప్రక్కల చల్లిన భూత, ప్రేత, సర్పబాధలు గాని వుండవు. ఈ మంత్ర సాధన వల్ల సకల విష జంతువుల నుండి రక్షణ కలుగుతుంది.

## విషహరణ వినాయక మంత్రము

"ఓం హ్రీం గణేశాయ నమః"

ప్రయోజనము : ఈ మంత్రమును 10 వేలు జపించి, యవలను (లేక) భస్మమును ఈ మంత్రములో 108 సార్లు అభిమంత్రించి ఇంటిలోను, చుట్టు ప్రక్కల చల్లిన భూత, ప్రేత, సర్ప బాధలు గాని వుండవు. ఈ మంత్ర సాధన వల్ల సకల విష జంతువుల నుండి రక్షణ కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య 1. లక్ష.

## గణపతి శాంతిక మంత్రము

"ఓం భద్రం కర్ణేభి శృణు యామదేవాః

భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః

స్థిరై రంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః

వ్యశేమ దేవ హితం మదాయుః

స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినపూషా విశ్వవేదాః

స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమః స్వస్తినో బృహస్పతిర్దధాతు"

ప్రయోజనము : ఈ మంత్రసాదనవల్ల యుద్ధభయముల నుండి రక్షణ కలుగును. సకల ఉపద్రవములు అంతరించి శాంతి కలుగును. సకల శుభ ఫలితములు కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య 1. 1 లక్ష 25 వేలు

2. ప్రతి రోజు నియమిత సంఖ్య జపించాలి.

## కార్యసిద్ధి గణపతి మంత్రము

"సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణిక లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిప ధూమకేతుర్గణాధ్యక్ష ఫాలచంద్రో గజాననః వక్రతుండ శ్శూర్ప కర్ణో హేరంబ స్కందపూర్వజః"

ప్రయోజనము : ఈ మంత్ర సాధనవల్ల సకల విఘ్నములు తొలగి సకల కార్యసిద్ధి చేకూరును. ఏదైన పనిమీద బయటకు వెళుతున్నపుడు 16 సార్లు చదువుకుని వెళ్ళిన కార్యము సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య– 1. ప్రతిరోజు 108 సార్లు జపించాలి.

2. ప్రతిరోజు 1008 సార్లు 48 రోజులు జపించిన మంత్రసిద్ధి.

## గణపతి మంత్రము

ఓం హ్రీం శ్రీం గం గణపతయే స్వాహా ।
ఓం నమో భగవతే । వక్రతుండాయ
మహాగణపతయే । ఆం హ్రీం క్రోం హ్రీం
గం శ్రీం సర్వజనముఖ హృదయ
రంజనమ్ కురు కురు స్వాహా ॥

ప్రయోజనము : గృహవాస్తు దోషములు నివారణ.

మంత్రసిద్ధి : 1,20,000 జపము

## గణపతి గాయత్రి మంత్రములు

1. ఓం ఏకదంతాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥
2. ఓం తత్పురుషాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥
3. ఓం మహాకర్ణాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥
4. ఓం తత్కరాటాయ విద్మహే । హస్తిముఖాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

5. ఓం లంబోదరాయ విద్మహే । మహోదరాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥
6. ఓం మహోల్కాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥
7. ఓం అఖుధ్వజాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥
8. ఓం గణంజయాయ విద్మహే । కామహంతాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥
9. ఓం మయూరవాహనాయ విద్మహే । కామహంతాయ ధీమహి ।
తన్నో వికటః ప్రచోదయాత్ ॥
10. ఓం క్రోధహంతాయ విద్మహే, శక్తి బ్రహ్మాయ ధీమహి ।
తన్నో లంబోదరః ప్రచోదయాత్ ॥
11. ఓం ఆఖువాహనాయ విద్మహే । లోభహంతాయ ధీమహి ।
తన్నో గజాననః ప్రచోదయాత్ ॥
12. ఓం జ్ఞాన బ్రహ్మాయ విద్మహే । మోహహంతాయ ధీమహి ।
తన్నో మహోదరః ప్రచోదయాత్ ॥
13. ఓం ఆఖువాహనాయ విద్మహే । మదహంతాయ ధీమహి ।
తన్నో ఏకదంతః ప్రచోదయాత్ ॥
14. ఓం సింహవాహనాయ విద్మహే । మాత్సర్యహంతాయ ధీమహి ।
తన్నో వక్రతుండః ప్రచోదయాత్ ॥
15. ఓం విష్ణురూపాయ విద్మహే । మమతాహన్తాయ ధీమహి ।
తన్నో విఘ్నరాజః ప్రచోదయాత్ ॥
16. ఓం శివాత్మకాయ విద్మహే అభిమానహన్తాయ ధీమహి ।
తన్నో ధూమ్రవర్ణః ప్రచోదయాత్ ॥
17. ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి ।
తన్నో దన్తిః ప్రచోదయాత్ ॥
18. ఓం తత్పురుషాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

19. తత్పురుషాయ విద్మహే శక్తియుతాయ ధీమహి ।
తన్నో దన్తిః ప్రచోదయాత్॥

20. దశ భుజాయ విద్మహే । వల్లభేశాయ ధీమహి ।
తన్నో దన్తిః ప్రచోదయాత్ ॥

21. తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి ।
తన్నో ధీమహి విఘ్నః ప్రచోదయాత్ ॥

22. ఆఖుధ్వజాయ విద్మహే వక్రతుండాయ ధీమహి ।
తన్నో విఘ్న ప్రచోదయాత్ ॥

23. ఓం విఘ్నరాజాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

24. ఓం తత్పురుషాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

25. ఏకదంతాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

26. ఓం తత్పురుషాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

27. ఓం లంబోదరాయ విద్మహే । మహోదరాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

28. ఓం విఘ్నరాజాయ విద్మహే । హస్తిముఖాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

29. ఓం మహోల్కాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

30. ఓం ఆఖుధ్వజాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి ।
తన్నో విఘ్నః ప్రచోదయాత్ ॥

ప్రయోజనము : ధర్మ, అర్ధ, కామ, మోక్షములు గణేశ గాయత్రీ మంత్ర జపమువల్ల లభించును. సమస్త సంపదలు, మేధాశక్తి, మనోవాంఛలు నెరవేరుట, విఘ్నములు తొలుగుట కల్గును.

మంత్రసిద్ధి : జపసంఖ్య ప్రతిరోజు 1008; 48 రోజులు.

## సకల కార్య సిద్ధికర గణేశ మంత్రం

మంత్రం : "ఓం హ్రీం గం గణపతయే మమ సకల కార్యసిద్ధి కురు కురు స్వాహా॥"

విధానం : పై సకల కార్యసిద్ధికర మంత్రాన్ని నిత్యము 1008 సార్లు జపిస్తున్న స్వామి అనుగ్రహానికి పాత్రులై సర్వకార్యములు నెరవేరును.

## ధనప్రాప్తికి లక్ష్మీగణేశ మంత్రం

సంకల్పం : ఓం అస్యశ్రీ లక్ష్మీవినాయక మహామంత్రస్య అంతర్యామీ ఋషిః। గాయత్రీ ఛందః । లక్ష్మీ వినాయకో దేవతా । శ్రీం బీజం । స్వాహా శక్తిః। మమ సర్వారిష్ట నివారణార్థం సర్వాభీష్ట సిద్ధ్యర్థం లక్ష్మీగణేశ దేవతా అనుగ్రహ ప్రాప్తి సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

ధ్యానం

దత్తాభయే చక్రవరౌ దధానం కరాగ్రగం సర్వఘటం త్రినేత్రం

ధృతాబ్జాయాఽలింగితమబ్ధి పుత్ర్యా లక్ష్మీగణేశ కనకాభమీడే ॥

మంత్రం : "ఓం శ్రీం గం సౌమ్యాయ గణపతయే వరవరద సర్వ ధనం మే వశమానయ స్వాహా॥"

విధానం : నిత్యం యధాశక్తిగ జపించిన లక్ష్మీప్రాప్తి కల్గును.

## వివాద విజయకర హరిద్రా గణపతి మంత్రము

మూలమంత్రము : "ఓం హుం గం గ్లౌం హరిద్రా గణపతయే సర్వజన హృదయం స్తంభయ స్తంభయ ప్రతివాది ముకం స్తంభనం కురు కురు గ్లౌం హుం స్వాహా॥"

విధానము : ఈ మంత్రమును మొదలుపెట్టిన రోజునుండి రోజుకు 2016 వంతున 50 రోజులపాటు ఒకలక్ష జపం చేయాలి. తదుపరి 10వేల జపం హోమము అటుకులు, కుడుములు, ఆవునెయ్యి, చెరుకు ముక్కలతోచేసి, ఒకవేయి జపం తర్పణమును, మార్జినము, తగినంత మందికి అన్న సంతర్పణము చేయవలెను తర్వాత ప్రతిదినము 1008 జపము చేయుచున్న సాధకునికి కానిపని అంటూ ఉండదు. సభలలో వెళ్లునపుడు, కోర్టుకు వెళ్లునపుడు పసుపుతో గణపతిని పూజించి, ఆ పసుపును నుదుటను బొట్టుగా పెట్టుకొని ఎక్కడికి వెళ్లినను విజయప్రాప్తి

కల్గును. గ్రహణ సమయంలో తెల్లగురివింద వేరు తీసుకొని వచ్చి ఈ మంత్రముచే అభిమంత్రించి చేతికి ధరించిన యెడల సభావశ్యము, రాజ వశ్యము, జనవశ్యము కల్గి విజయుడై విరాజిల్ల గలడు.

## విద్యా విజయకర గణపతి మంత్రము

మంత్రము : "ఓం హ్రీం గ్రీం ఐం గ్లాం క్లీం గం విద్యాగణపతయే మమ విద్యావిజయం సాధయ సాధయ గం ఓం స్వాహా॥"

విధానము : తెల్లగరికచే గణపతిని పూజిస్తూ రోజుకు 1008 వంతున 24 దినములు మంత్రమును జపించి, ప్రతిదినము పూజించిన గరికను నూరి, మణిశిల, గోరోచనము కలిపి నుదుట ధరించిన సర్వవిద్యలు వశమవుతాయి.

## శుభదృష్టి గణపతి మంత్రం

మూలమంత్రం : "ఓం హ్రీం శ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వారణ ముఖే సర్వారిష్టాన్ నివారయ నివారయ స్వాహా॥"

విధానము : సర్వచెడు దృష్టులను, నరదృష్టులను, నరఘోషలను హరించే ఈ శుభదృష్టి గణపతి ప్రతిమను పూజామందిరములోను మరియు ఇంటి గుమ్మం ముందు వుంచాలి. వీలున్న యంత్రంతో సహా ఉంచితే మంచిది. సర్వచెడులును హరించివేయును. నిత్యము 108 సార్లు పై మూల మంత్రంతో ధ్యానిస్తూ ధూపదీప నైవేద్యాలను సమర్పిస్తున్న అశుభాలు నశించి శుభాలు కల్గును. (పూజామందిరంలో ధ్యానించాలి.)

## సంకటనాశనకర శ్రీగణపతి స్తోత్రము

ప్రణమ్యా శిరసాదేవం గౌరీపుత్రం వినాయకమ్ భక్తావాసం స్మరేన్నిత్యం మాయుష్కామార్థ సిద్ధయే ప్రథమం వక్రతుండంచ ఏకదంతం ద్వితీయకమ్ తృతీయం కృష్ణపింగాక్షం గజవక్త్రం చతుర్ధకమ్ లంబోదరం పంచమంచ షష్ఠం వికటమేవచ । సప్తమం విఘ్నరాజంచ ధూమ్రవర్ణం తథాష్టకమ్ । నవమం బాలచంద్రంచ దశమంతు వినాయకమ్ ఏకాదశం గణపతిం ద్వాదశంతు గజాననమ్ । ద్వాదశైతాని నామాని త్రిసంధ్యం యః పఠేన్నరః నచవిఘ్న భయంతస్య సర్వసిద్ధి కరంపరమ్ విద్యార్థీన్ లభతే విద్యాం ధనదీన్ లభతే ధనమ్ పుత్రార్థీ లభతేపుత్రా న్మోక్షార్థీ లభతే గతిమ్ ॥ జపేత్ గణపతి

స్తోత్రం షడ్భిర్మాసైః ఫలం లభతే సంవత్సరేణ సిద్ధించ లభతే నాత్ర సంశయః అష్టానాం బ్రహ్మణానాంచ లిఖిత్వాయ సమర్పయేత్ తస్య విద్యాభవేత్ సర్వాగణేశస్య ప్రసాదితః.

## అథ ఏకవింశతి పత్రపూజ

## (21 ఆకులతో చేయు పూజ)

ఓం సుముఖాయనమః మాచీపత్రం పూజయామి (మాచిపత్రి)
ఓం గణాధిపాయ నమః బృహతీపత్రం పూజయామి (వాకుడు)
ఓం ఉమాపుత్రాయ నమః బిల్వపత్రం పూజయామి (మారేడు)
ఓం గజాననాయ నమః దూర్వాయుగ్మం పూజయామి(గరిక)
ఓం హరసూనవే నమః దుత్తూరపత్రం పూజయామి (ఉమ్మెత్త)
ఓం లంబోదరాయ నమః బదరీపత్రం పూజయామి (రేగు)
ఓం గుహాగ్రజాయ నమః అపామార్గపత్రంపూజయామి (ఉత్తరేణి)
ఓం గజకర్ణాయ నమః తులసీపత్రం పూజయామి (తులసీ)
ఓం ఏకదంతాయ నమః చూతపత్రం పూజయామి (మామిడి)
ఓం భిన్నదంతాయ నమః విష్ణుక్రాంతపత్రం పూజయామి(విష్ణుకాంత)
ఓం వటవే నమః దాడిమీపత్రం పూజయామి (దానిమ్మ)
ఓం సర్వేశ్వరాయ నమః దేవదారుపత్రంపూజయామి (దేవదారు)
ఓం ఫాలచంద్రాయనమః కురువకపత్రం పూజయామి(కురువం)
ఓం హేరంబాయనమః సింధువారపత్రంపూజయామి (వావిలి)
ఓం శూర్పకర్ణాయ నమః జాజిపత్రం పూజయామి (జాజి)
ఓం సురాగ్రజాయ నమః గణ్డకీపత్రం పూజయామి (ఏనుగుచెవి)
ఓం ఇభవక్త్రాయ నమః శమీపత్రం పూజయామి (జమ్మి)
ఓం వినాయకాయనమః అశ్వత్థపత్రం పూజయామి (రావి)
ఓం సురసేవితాయ నమః అర్జునపత్రం పూజయామి (మద్ది)
ఓం కపిలాయ నమః అర్కపత్రం పూజయామి (తెల్లజిల్లేడు)
ఓం గణేశ్వరాయ నమః ఏకవింశతిపత్రాణి పూజయామి

## లక్ష్మీప్రాప్తికై గణేశ స్తోత్రము

ఓం నమో విఘ్న రాజాయ సర్వసౌఖ్యప్రదాయినే
దుష్టారిష్ట వినాశాయ – పరాయ పరమాత్మనే

లంబోదరం మహావీర్యం-నాగ యజ్ఞోపశోభితం
అర్ధచంద్రధరం దేవం - విఘ్న వ్యూహ వినాశనం

శ్లో॥ ఓం హ్రీం హ్రీం హ్రూం హ్రైం-హ్రౌంహ్రః హేరంబాయ నమోనమః
సర్వసిద్ధిప్రదోసిత్వం సిద్ధిబుద్ధి ప్రదోభవ
చింతితార్ధ ప్రదస్త్వహిం-సతతం మోదకప్రియః
సిందూదారుణ వస్త్రైశ్చ-పూజితో వరదాయకః
ఇదం గణపతి స్తోత్రం-యఃపఠేత్ భక్తిమాన్నరః
తస్యదేహంచ గేహంచ-స్వయంలక్ష్మీర్నముంచతి

## ప్రసన్న గణపతి మంత్రము

మూలమంత్రం : ఓం వక్రతుండాయ హుం ॥

ఏ మాసమందైనను శుక్లపక్షమునందలి చవితీ దినమున పురశ్చరణము ప్రారంభించి వ్రతదీక్షా నియమములను పాటింపుచు నియతసంఖ్యగా మూలమును జపించవలెను. ప్రతినిత్యము గణేశ్వరుని పూజించుచు జితేంద్రియుడై ఈ విధముగా మరల శుద్ధచవితి వరకు ఆరు లక్షలు జపించిన పిమ్మట అష్టద్రవ్యములు, నెయ్యి కలిపి (చెఱకుముక్కలు, సత్తుపిండి, అరటిపండ్లు, అటుకులు, నువ్వులు, కుడుములు, కొబ్బరి ముక్కలు-పేలాలు అనునవి అష్ట ద్రవ్యములు) అరువది వేల పర్యాయములు హోమము గావించవలెను. ఈ ప్రకారముగా నెవ్వరు భక్తి శ్రద్ధలతో పురశ్చరణము గావించెదరో అట్టి వారికి మంత్రము సిద్ధించుట నిశ్చయము.

## ఉచ్ఛిష్ఠ గణేశ యంత్రము-మంత్రసాధన

ఉచ్ఛిష్ఠ గణపతియొక్క మంత్ర యంత్రములను సాధించి పెక్కుండ్రు గొప్ప యశస్సును కలిగియున్నారు. ఈ యంత్ర ప్రభావములను ఎట్టి ఘనతర కార్యమైనను సులభముగ జయింపవచ్చును. ఈ యంత్రమును చక్కగా రాగిరేకుపై వేయించిగాని, ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, యీ మంత్రాధిష్ఠానమైయున్న ఉచ్ఛిష్ట గణపతిని ధ్యానముచేసి, ప్రతినిత్యము ప్రాతస్సాయం సంధ్యల కాలమందు "పత్రం పుష్పం ఫలం తోయం అను న్యాయానుసారముగ పత్రము, పుష్పము, ఫలము ఉదకము మున్నగు వానిని యధాశక్తిగా సమర్పించి, నమస్కారము చేయుచున్న

యెడల కార్యసిద్ధి, వశీకరణ, సామర్థ్యము, భోగభాగ్యములు, శతృవిజయము మున్నగునవి గలుగును.

ఇంతియగాక యీ యంత్రమునకు యధాశాస్త్రీయముగా ప్రాణస్థాపన, పంచపూజలు చేయుచు మూలమంత్రమును యధాశక్తిగ జపము చేసిన యెడల సంఘగౌరవము, ఆరోగ్యము, సుఖభోగములు, శతృవిజయము, కార్యసాధన, సంఘవశీకరణ, గ్రామవశీకరణాది సామర్థ్యములు కలుగును.

మరియు నీ యంత్రమునకు ప్రాణప్రతిష్ట, జీవన్యా కళాన్యాసాదులు, యధా శాస్త్రీయముగ ఆవరణార్చనముతో షోడశోపచార పూజలు చేయుచు, "ఓం నమోభగవతే ఏకదంష్ట్రాయ హస్తిముఖాయ లంబోదరాయ ఉచ్ఛిష్ట మహాత్మనే ఆం క్రోం హ్రీం గం గే ఘే స్వాహా॥" అను మూల మంత్రమును యధాశక్తిగా జపము చేసిన యెడల రాజవశ్యము, దేశ నగరపట్టణాది వశీకరణ సామర్థ్యము, భోగభాగ్యైశ్వర్యములు, అష్టైశ్వర్యప్రాప్తి, సంతోషము మున్నగునవి గలుగును. ఈ ఉచ్ఛిష్ట గణేశ యంత్ర ప్రభావముచే యెట్టి ఘనత కార్యమునైనను సులభముగా సాధింపవచ్చును.

## శ్రీ ఉచ్ఛిష్ఠ గణేశ పంచపూజలు

ఓం లం పృథివీతత్వాత్మనే గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ మదుచ్ఛిష్టగణేశాయ గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశ తత్త్వాత్మనే శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీమదుచ్ఛిష్ట గణేశాయ పుష్పం సమర్పయామి నమః

ఓం యవాయుతత్త్వాత్మనే స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీమదుచ్ఛిష్టగణేశాయ ధూపం సమర్పయామి నమః

ఓం రం వహ్నితత్త్వాత్మనే తైజసన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీమదుచ్ఛిష్టగణేశాయ దీపం దర్శయామి నమః

ఓం వం అమృతతత్త్వాత్మనే అమృతతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ మదుచ్ఛిష్టగణేశాయ అమృతముపహార నైవేద్యం సమర్పయామినమః

ఓం సం సర్వతత్తాత్మకాయ సర్వన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీమదుచ్ఛిష్ట గణేశాయ సర్వోపచార పూజాం సమర్పయామి.

## శ్రీ మదుచ్ఛిష్టగణపతి మంత్ర జప విధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌసంకీర్త్య, శ్రీమాన్ఆముక గోత్రస్యాముక నామధేయోహం మమాత్మనః సకుటుంబస్య శ్రీమదుచ్ఛిష్ట గణేశ ప్రసన్నతా ప్రాప్తి పూర్వక శ్రీమదుచ్ఛిస్ట గణేశ ప్రసాద సిద్ధ్యర్థం మమ శ్రీ మదుచ్ఛిస్ట గణేశ ప్రసాదేన సర్వాపచ్ఛాన్తి పూర్వక దీర్ఘాయుష్య ధనకళత్ర పుత్ర పౌత్రాద్యనవచ్ఛిన్న సంతతి వృద్ధిస్థిర లక్ష్మీ కీర్తిలాభ శత్రు పరాజయాది సదాభీష్టఫల సిద్ధ్యర్థం శ్రీమదుచ్ఛిష్ట గణేశ మహామంత్ర జపం కరిష్యే ॥

**ఋష్యాదిన్యాము**

అస్యశ్రీ మదుచ్ఛిష్ట గణేశ మహామంత్రస్య । గణక ఋషయే నమశ్శిరసి। గాయత్రీ ఛందసేనమో ముఖే । శ్రీ మదుచ్ఛిష్టగణపతాయై నమో హృది। హ్రీం బీజాయ నమో నాభౌ ॥ ఆం క్రోం శక్తయే నమో గుహ్యేం శ్రీ మదుచ్ఛిష్ట గణేశ ప్రసాద సిద్ధ్యర్ధే జపే వినియోగాయ నమస్సర్వాంగే॥

**కరన్యాసము**

ఓం నమోభగవతే ఏకదంష్ట్రాయ అంగుష్ఠాభ్యాం నమః

హస్తి ముఖాయ తర్జనీబ్యాం నమః

లంబోదరాయ మధ్యమాభ్యాం నమః

ఉచ్ఛిష్టమహాత్మనే అనామికాభ్యాం నమః

ఆం క్రోం హ్రీం గం కనిష్టికాభ్యాం నమః

ఘే ఘే స్వాహా కరతలకర పృష్ఠాభ్యాం నమః

**హృదయన్యాసము**

ఓం నమోభగవతే ఏక దంష్ట్రాయ హృదయాయ నమః

హస్తిముఖాయ శిరసే స్వాహా

లంబోదరాయ శిఖాయైవషట్

ఉచ్ఛిష్ట మహాత్మనే కవచాయహుం

ఆం క్రోం హ్రీం గం నేత్రత్రయాయ వౌషట్

ఘే ఘే స్వాహా అస్త్రాయ ఫట్

**దిగ్బంధనము**

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

**ధ్యానము**

శ్లో॥ శరాంధనుః పాశ సృణీస్వహస్తై
ర్దధానమారక్త సరోరుహస్తం
వివస్త్రపత్న్యాసురతః ప్రవృత్త
ముచ్ఛిష్ట మంబాసుత మాశ్రయేహమ్
ఏవం ధ్యాత్వా లమిత్యాది పంచపూజాం కుర్యాత్ ॥

**మూల మంత్రము**

ఓం నమోభగవతే ఏకదంష్ట్రాయ హస్తిముఖాయ లంబోదరాయ ఉచ్ఛిష్ట మహాత్మనే ఆం క్రోం హ్రీం గం ఘే ఘే స్వాహా–ఓం నమో ఉచ్ఛిష్ట గణేశాయ హస్తిపిశాచిలిఖే స్వాహా – లఘుమంత్రం)

**మంత్రసిద్ధి క్రమము**

అస్యపురశ్చరణమేక లక్షజపః తద్దశాంశతో ఘృతహోమః
తత్తద్ద శాంశేన తర్పణమార్జన బ్రాహ్మణ భోజనాని చ కుర్యాత్

తా. మంత్రములలో నేమంత్రమునైనను లక్ష పర్యాయములు జపము, తద్దశాంశము ఘృతహోమము, తద్దశాంశము తర్పణము, తద్దశాంశము మార్జనము, తద్దశాంశము బ్రాహ్మణ భోజనాదులు యధాశాస్త్రీయముగ జేసినయెడల మంత్రసిద్ధి యగును. మంత్రసిద్ధియైన పిమ్మట ప్రయోగములను సాధించవలయును.

## మంత్ర ప్రయోజన క్రమము

శ్లో॥ కృష్ణాష్టమ్యాది భూతాన్తం యావత్తావజ్జపేన్మం।
ప్రత్యహంసాష్ట సాహస్రం జుహుయాత్తద్దశాంశతః॥
తర్పయేదపి మంత్రోయం సిద్ధిమేవం ప్రయచ్ఛతి ।
ధనం ధాన్యం సుతాన్పౌత్రాన్ సౌభాగ్యమతులం యశం.

తా. బహుళ అష్టమి మొదలు శుద్ధపంచమి వరకు ప్రతినిత్యము భక్తిశ్రద్ధలతో యధాశాస్త్రీయముగ యెనిమిదివేల పర్యాయములు జపము

చేయుచు జపాస్తమున తద్దశాంశము హోమమును, తద్దశాంతము తర్పణ మును జేసిన యెడల ధనము ధ్యానము సంతానము సౌభాగ్యము యశస్సు మున్నగునవి గలుగును.

శ్లో॥ తార్తింకుర్యాద్గణేశస్య శుభాహేనింబదారుణా ।
ప్రాణప్రతిష్ఠాం కృత్వా ధ తదగ్రేమంత్రమాజపేత్ ।
యంధ్యాత్వా దాసత్యోపి వవ్యోభవతి నిశ్చితం

తా. శుభదినమున ఉచ్ఛిష్టగణేశుని ప్రతిమను వేపచెట్టు వేరుతో చేయించి, ఆ విగ్రహమునకు ప్రాణప్రతిష్ట చేసి పిమ్మట ఆ విగ్రహమునకు యెదుటను కూర్చుండి ధ్యానము చేసి మూలమంత్రమును జపించినవాడు నిశ్చయముగ వవ్యమగును.

శ్లో॥ నదీజలం సమాదాయ సప్తవింశంతి సఖ్యయా ।
మంత్రయిత్వాముఖంతేన ప్రక్షాళ్యేశసభాం వ్రజేత్ ।
పశ్యేద్యం దృశ్యతేతేన నశ్యోజాయతేక్షణాత్ ॥

తా. నదీజలమును తీసుకొని, ఆ జలమును మూలమంత్రములో నిరువదియేడు పర్యాయములు అభిమంత్రించి పిమ్మట నా వుదకముతో ముఖ ప్రక్షాళనము చేసుకొని రాజసభకు వెళ్ళి యెవరిని జూచినను వారు తత్ క్షణమే నిశ్చయముగ వశ్యమగుదురు.

శ్లో॥ చతుస్సహస్రం దుత్తూరపుష్పాణి మనునార్పయేత్ ।
గణేశాయ నృపాదీనాం జనానాం వశ్యతాదృతే ॥

తా. నాల్గువేల ఉమ్మెత్తపుష్పములను ఉచ్ఛిష్టగణేశునకు మూలమంత్ర మును జపించుచు పూజచేసిన యెడల రాజవశ్యము జనవశ్యము సులభ ముగ నగును.

## యావజ్జీవ వశ్యకర గణపతి యంత్రము

ఇది చేసి చూచి నిదర్శనము చూచుకొనుడు

గం గం గం గం గం గం గం గం గం గం గం
గం
గం
గం
గం
గం
గం
గం
గం

హ్రీం హ్రీం హ్రీం హ్రీం హ్రీం హ్రీం హ్రీం హ్రీం
క్రోం హ్రీం క్లీం గం దేవదత్తః గం
క్లీం హ్రీం క్రోం హ్రీం క్లీం క్రోం హ్రీం
హ్రీం హ్రీం హ్రీం హ్రీం

గం గం గం గం గం గం గం గం గం గం గం

విధానము : ఈ యంత్రములో 'దేవదత్త' అనుచోట సాధకుడు తనకు తన ఉంగరపు వ్రేలి రక్తము, ఏనుగుమదము, అలచందలు గోరోచనము అను నాల్గు వస్తువులు కలిపి నూరిన ద్రవముతో జాజిపుల్ల కలముచే వ్రాసి తరువాత పంటపొలములో నున్న నల్లమన్నును తెచ్చి దానితో గణపతి ప్రతిమనుజేసి దాని గర్భమునందు యంత్రమును వుంచి దానిని 'దేవదేవ గణాధ్యక్ష సురాసుర నమస్కృత (దేవదత్తం) మహావశ్యం యావజ్జీవం కురుప్రబో॥' అను మంత్రము నుచ్చరించుచూ గంధ, పుష్ప, ధూప, దీపాది నైవేద్యములొసంగి పూజించి నమస్కరించి మరలా యంత్ర మును ఉచ్చరించుచూ యంత్ర సహితమైన ప్రతిమను భూమిలో మూరెడు లోతు గొయ్యితీసి పాతిపెట్టిన ఎవరిపేరుతో యంత్రము వ్రాయబడినదో వారు వశ్యమయ్యెదరు.

## గణేశోత్తర మాలా మంత్రం

అస్యశ్రీ మహాగణపతి మాలా మహామంత్రస్య । భైరవ ఋషిః గాయత్రీ ఛందః శ్రీమహాగణపతిర్దేవతా । గం బీజం । స్వాహా శక్తిః ఫట్కీలకం । మమ సర్వారిష్ట నివారణార్థం మమ సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీమహాగణపతి పరబ్రహ్మ దేవతా అనుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే శ్రీ గణేశోత్తర మాలా మంత్ర జపే వినియోగః

| కరన్యాసం | అంగన్యాసం |
|---|---|
| గ్లాం-అంగుష్ఠాభ్యాం నమః | గ్లాం-హృదయాయ నమః |
| గ్లీం-తర్జనీభ్యాం నమః | గ్లీం-శిరసే స్వాహా |
| గ్లూం-మధ్యమాభ్యాం నమః | గ్లూం-శిఖాయై వౌషట్ |
| గ్లైం-అనామికాభ్యాం నమః | గ్లైం-కవచాయ హుం |
| గ్లౌం-కనిష్ఠికాభ్యాం నమః | గ్లౌం-నేత్రత్రయాయ వౌషట్ |
| గ్లః - కరతలకరపృష్ఠాభ్యాంనమః | గ్లః-అస్త్రాయఫట్ |

ధ్యానం :

బాలార్కకోటి ద్యుతి మప్రమేయం ।
బాలేందు రేఖాకలితో త్తమాంగమ్ ॥
భ్రమద్ద్విరేఖావృత గండభాగం ।
భజే భవానీ తనయం గణేశమ్ ॥

మాలా మంత్రం : "ఓం నమోభగవతే గ్లౌం మహాగణపతయే సింధూర రంజితాయ పుండ్రేక్షు గదా శూల పరశుపాశాంకుశ ధరాయ ఓం శ్రీం హ్రీం క్లీం సర్వజన సంరక్షకాయ సర్వలక్ష్మీప్రదాయ సర్వలోకవశీకరణాయ క్రోం క్రోం క్రోం ఆం ఆం ఆం పాశాంకుశాభ్యాం సకలరాజ మండలం మమ వశమానయ వశమానయ క్లీం క్లీం క్లీం సకలవిషాది నివారణం కురు కురు రం రం రం హ్రీం హ్రీం హ్రూం క్షం సకల భూతప్రేత పిశాచ బ్రహ్మరాక్షస శాకినీ ఢాకినీ కామినీ మోహినీ అంతరిక్ష గ్రహ భేతాళ గ్రహ యక్షిణీ శూలినీ విధ్వంసనం కురు కురు ప్రోం ప్రోం ప్రోం సకల చోరభయం నివారయ నివారయ ఠం ఠం ఠం శత్రు మండల స్తంభయ స్తంభయ గ్లౌం గ్లౌం గ్లౌం సకల విఘ్నాన్ విధ్వంసయ విధ్వంసయ సౌం శ్రీం మమ మనోరథం సాధయ సాధయ ఓం శ్రీం హ్రీం క్లీం మహాగణపతయే హుం ఫట్ స్వాహా ।

విధానము : పై మాలా మంత్రాన్ని భక్తి శ్రద్ధలతో షోడశోపచార పూజాది క్రియలతో గణపతిని పూజిస్తూ నిత్యము 11 సార్లుగాని 16 సార్లు గాని 18 సార్లుగాని 27 సార్లుగాని ధ్యానిస్తున్న సమస్త కోర్కెలను నెరవేరుటేగాక, సర్వ రోగాలను, సర్వభూత ప్రేత పిశాచాది ప్రయోగ

బాధలు నశించును. లక్ష్మీప్రసన్నత, సర్వ దేవతానుగ్రహము గణపతి అనుగ్రహము కల్గుతుంది.

## శ్రీ శ్వేతార్క మూల గణేశ మంత్రము

"ఓం నమో గణపతయే శ్వేతార్క గణపతయే శ్వేతార్కమూల నివాసాయ వాసుదేవ ప్రియాయ దక్షప్రజాపతి రక్షకాయ సూర్యవరదాయ కుమార గురవే సురాసుర వందితాయ సర్వభూషణాయ శశాంక శేఖరాయ సర్వమాలాలంకృత దేహాయ ధర్మ ధ్వజాయ ధర్మ రక్షకాయ త్రాహి త్రాహి దేహి దేహి అవతర అవతర గం గం గణపతయే వక్రతుండ గణపతయే సర్వపురుష వశంకర, సర్వదుష్ట మృగవశంకర వశీకురు వశీకురు సర్వదోషాన్ బంధయ బంధయ సర్వవ్యాధీన్ నికృంతయ నికృంతయ సర్వవిషాన్ సంహర సంహర సర్వ దారిద్ర్యం మోచయ మోచయ సర్వ శత్రూన్ ఉచ్చాటయ ఉఛ్చాటయ సర్వసిద్ధిం కురు కురు సర్వకార్యాణి సాధయ సాధయ గాం గీం గౌం గైం గాం గః హం ఫట్ స్వాహా॥"

విధానము : పై మాలా మంత్రమువలె ఉపాసించేది.

## మహాగణపతి వివిధ మహా మంత్రములు

1. ఓం గం సౌమ్యాయ మహాగణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా ॥

2. ఓం గం సౌర్యాయ మహాగణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా ॥

3. ఓం శ్రీం గ్లౌం హ్రీం ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే నమః

4. ఓం శ్రీం గ్లౌం హ్రీం గణపతే వరద వరద సర్వవిద్యాం దేహి దేహి స్వాహా ॥

5. ఓం శ్రీం గ్లౌం హ్రీం సర్వ సమ్పదాం దేహి దేహి స్వాహా॥

6. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం దాం హ్రీం గ్రీం క్లీం మహాగణపతయే నమః॥

7. ఓం హ్రీం విరివిరి గణపతే వరవరద సర్వలోకం మే వశమానయ స్వాహా॥

8. ఓం గణేశ ఋణం ఛింది వరేణ్యం నమః ఫట్ ॥

9. ఓం శ్రీం హ్రీం సర్వకార్య విఘ్న ప్రవమనాయ సర్వరాజ వశంక రాయ సర్వస్త్రీ పురుషాకర్షణాయ । సర్వలోక వశీకరణాయ। ఆం హ్రీం క్రోం హుంఫట్ స్వాహా॥

10. ఓం బ్లూం ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం । ఐం బ్లూం గణపతే వరద వరద సర్వవిద్యాం దేహి దేహి స్వాహా॥

11. ఓం గం హం క్లౌం గ్లౌం ఉచ్ఛిష్ఠ గణేశాయ మహాయక్షాయా యం బలిః॥

12. ఓం గ్లౌం నవనీత గణపతయే సర్వజనాన్ మే వశమానయ స్వాహా॥

13. ఓం శ్రీం హ్రీం గ్లౌం గణపతయే సర్వకార్య సిద్ధిం కురు కురు స్వాహా॥

14. ఓం ఐం ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గ్లం క్లీం గణపతే వరద వరద ! సౌః సర్వజనం మే వశమానయ స్వాహా॥

15. ఓం హ్రీం క్లీం వీరవరగణపతయే వః వః ఇదం విశ్వం మమ వశమానయ ఓం హ్రీం ఫట్ ॥

16. ఓం నమః స్సిద్ధి వినాయకాయ సర్వకార్య కర్త్రే సర్వవిఘ్న ప్రశమ నాయ సర్వరాజ్య వశ్యకరణాయ సర్వజన సర్వస్త్రీ పురుషాకర్షణాయ శ్రీం ఓం స్వాహా ॥

17. ఓం హుం గం గ్లౌం హరిద్రా గణపతయే వరవరద సర్వజన హృదయం స్తంభయ స్తంభయ స్వాహా ॥

18. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం క ఎ ఈ ల హ్రీం గణపతయే హస కలహ్రీం వరవరద సకల హ్రీం సర్వజనం మే వశమానయ స్వాహా॥

19. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం ఐం వదవద వాగ్వాదిని సిద్ధగణపతయే గీం భగవతి స్వాహా ॥

20. ఓం హ్రీం గం హ్రీం మహాగణపతయే స్వాహా ॥

21. ఓం గం గణపతయే సర్వవిఘ్నాయ సర్వాయ సర్వగురవే లంబో దరాయ హ్రీం గం నమః॥

22. మహాదేవస్య తేజసా భయంకరారిష్ట దేవతాం బంధయామి పథానుగత చోరా ద్రక్ష తేషాం బాధకం చ కంటకం బంధయామి మహా గణేశేన పంచశీర్షేన పాణినా ॥

23. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా॥

24. ఓం నమో భగవతే ఏకదంతాయ హస్తిముఖాయ లంబోదరాయ ఉచ్ఛిష్ట మహాత్మనే ఆం క్రోం హ్రీం గం ఘే ఘే ఉచ్ఛిష్టాయ స్వాహా॥

25. ఓం జూం సః సః జూం ఓం గణపతయే వరవరద। ఓం జూం సః సర్వరోగాన్ హరహర సః జూం ఓం స్వాహా॥

26. ఓం ఐం హ్రీం శ్రీం గం గ గ గ ల – ఐం – క ఏ ఈ ల హ్రీం క్లీం హసకహల హ్రీం–సౌః–సకల హ్రీం–గం క్షిప్ర ప్రసాద గణపతయే వరవరద ఆం హ్రీం క్రోం సర్వజనం మే వశమానయ స్వాహా!

27. ఓం గణనాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం । జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనః శ్రుణ్వ న్నూతిభిః సీదసాదనమ్ ॥

28. ఓం ఐం హ్రీం శ్రీం గం గ గ గ ల–ఐం–క ఏఈలహ్రీం–క్లీం–హసకహలహ్రీం–సౌః–సకల హ్రీం–గం క్షిప్ర ప్రసాద గణపతయే వరవరద ఆం హ్రీం క్రోం సర్వజనం మే వశమానయ స్వాహా॥

29. ఓం యదన్తి యచ్చదూరకే భయం విన్దతి మామిహ। యదుత్థితం భగవతి ! తత్సర్వం శమయ శమయ స్వాహ ॥

31. ఓం తత్సవితుర్వరేణ్యం –భర్గోదేవస్య ధీమహి–ధియోయోనః ప్రచోదయాత్ ॥

33. ఓం త్ర్యంబకం యజామహే–సుగంధిం పుష్టివర్ధనం। ఉర్వారుక మివ బంధానా న్మృత్యోరుక్షీయమామృతాత్ ॥

## గణేశ మాతృకాన్యాస మంత్రము

సంకల్పము : అస్యశ్రీ గణేశ మాతృకాన్యాస మంత్రస్య। గణక ఋషిః నృచద్గాయత్రీ ఛందః। శక్తి వినాయకా దేవతా। మమ సర్వారిష్ట నివారణార్థం మమ సర్వాభీష్ట సిద్ధ్యర్థం । శక్తి వినాయకో దేవతా అనుగ్రహ ప్రాసాద సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

## మూల మంత్రం

"ఓం గాం గీం గూం గైం గౌం గః"

విధానము : ఈ మంత్ర జపము వల్ల సాధకుడు సమస్త విఘ్నముల నుండి విముక్తుడై తాను చేసే ప్రయత్నములు నెరవేరుచుండును. జనాకర్షణ కలిగి ఉంటాడు. ఐశ్వర్యము, సంపద కల్గును. కవిత్వశక్తి కల్గుతుంది. విద్యార్థులకు విద్య సులభంగ వస్తుంది. విద్యలో ప్రావీణ్యము లభిస్తుంది.

## దేవతార్చనలో పంచాయతన దేవతా స్థాపన విధానము

ప్రమాణ శ్లోకః

శ్లో॥ శమ్భౌ మధ్యగతే హరీనహరభూదేవ్యో హరౌ శఙ్కరే
భాస్యేనాగసుతా; రవౌ హరిగణేశాజామ్బికా స్థాపయేత్।
దేవ్యాం విష్ణుహరేభవక్త్రరవయో; లమ్బోదరేఽజేశ్వరీ
నార్యా; శ్శఙ్కరదిఙ్ముఖాస్తు ఫలదా వ్యస్తాస్తుతే హానిదాః॥

**పంచాయతన మంత్రములు :**

1. ఓం శివ విష్ణు సూర్య దుర్గా గణేశేభ్యో నమః
2. ఓం విష్ణు శివగణేశ సూర్య దుర్గాభ్యో నమః
3. ఓం గణేశ విష్ను శివదుర్గా సూర్యేభ్యో నమః
4. ఓం దుర్గావిష్ణు శివసూర్య గణేశోభ్యో నమః
5. ఓం సూర్యశివగణేశ దుర్గావిష్ణుభ్యో నమః




శివపంచాయతనము : 1 శంకరుడు 2 నారాయణుడు 3 రవి 4 గణపతి 5 దేవి (సంక్షిప్త సూత్రం : శం నా ర గ దే)

ఇట్లే విష్ణు, సూర్య, గణేశ, దేవి పంచాయన దేవతా స్థాపన విధానము దిగువ విధముగా ఉండగలదు.













## మనుష్యుల సర్వరోగాలను సమూలంగా హరించే ప్రాణాయామ-ఆయుర్వేద-మణి-మంత్ర-దివ్యస్నాన సంయుక్త ఔషధ ప్రయోగ క్రియలు-మానవాళికి అమృత సలహాలు

శరీరారోగ్యానికి పూర్వకాల మహర్షులు మూడు మార్గాలందించారు. అందులో నవరత్నాలు (మణులు) ఒకమార్గం. ఈ నవరత్నాలు ఒక్కొక్క రోగాన్ని ఒక్కొక్క గ్రహానికి ప్రీతిపాత్రం. ఒక్కొక్క రోగాన్ని హరించాలంటే ఒకొక్క మణిని మంత్రానుష్ఠానంతో ధరించాలి. నవరత్న మణుల భస్మాన్ని రోగాలు కుదర్చడానికి ఉపయోగిస్తారు. అలాగే మంత్ర అనుష్టానంతో బంగారం, వెండి, రాగి, పాదరసం మొదలైన భస్మాల చికిత్సల ద్వారా రోగాలు నయం చేస్తారు.

రెండవ మార్గము మంత్రము. మంత్ర జపాలవల్ల జ్వరహరేశ్వరుడు కంపహరేశ్వరుడు (పరమాత్మ) మొదలైన దేవతామూర్తులు రోగాలను కుదురుస్తారు. క్రమశిక్షణతో సూర్యుని మంత్రపూర్వక సూర్యాసనాం నిత్య సాధన చేస్తూ సూర్యానుష్ఠానం వల్ల సర్వరోగాలు నయము అవుతాయి. అలాగే స్కందానుభూతిని పారాయణ చేయడంవల్ల రోగాలనుండి విముక్తిని పొందుతారు.

ఇక మూడవ మార్గము ఓషధి. అనగా మూలిక. ఆయుర్వేదంలో మూలికలను ఆధారంగా మందులను తయారు చేస్తారు. అలాగే పగడ భస్మం, స్వర్ణభస్మం, రజతభస్మంతో వైద్యంలో ఉపయోగించి ముఖ్యంగా

ఓషధులతోనే వైద్యం చేస్తారు. ఇక సిద్ధవైద్యాన్ని గూర్చి చెబితే అగస్త్యుడు థేరయార్ మొదలగువారు దీనికి మూల పురుషులు. ఆయుర్వేదంలో, సిద్ధ వైద్యంలో, తంత్ర వైద్యంలో వివిధ మంత్రాలను కూడ మందులు సమర్థ వంతంగా పనిచేయడానికి జపించి వాడతారు. మంత్రాలను జపంచేస్తూ మందులను తయారు చేస్తారు. మందులను చేతబట్టి మంత్రాలనుచ్చరిస్తూ మ్రింగిస్తారు. రోగి కూడ మంత్రాలను పఠిస్తూ మందులను సేవించాలి.

ఆది శంకరులు సౌందర్యలహరి 20వ శ్లోకంలో అమ్మవారిని చంద్ర కాంత శిలామూర్తిగా అమృతరసము ఆమె శరీరమునుండి తన శరీరంలోకి ప్రవహిస్తున్నట్లు ఏ భక్తుడు భావించి మూలమంత్రాలతో ధ్యానిస్తాడో వానికి గరుత్మంతుడు పాము విషాన్ని పోగొట్టగలడని వ్రాశారు. అట్టి వానికి అమృత నాడి ఉద్భవిస్తుందని, అట్టివాడు జ్వరగ్రస్తుణ్ణి చూసినా, స్పృశించినా ఆరోగ్యం చేకూరునని వ్రాశారు. మహా మృత్యుంజయ మంత్రాలు, ధన్వంతరీ (మహావిష్ణు) మహామంత్రము, అచ్యుత, అనంత, వాసుదేవ, నారాయణ, గోవింద నామాలు, అశ్వనీ సూక్తము, సూర్యనారాయణ, గణపతి, సుబ్రహ్మణ్య, గరుడ, సర్పసూక్త మంత్రాలలో దేవనినైనా లేక కొన్నియైనా ఔషధమును శుచిగ చేతబూని జపించి రోగితో తినిపించిన త్రాగించినా రోగాలు ఉపశమిస్తవి. రోగి స్వయంగా జపిస్తే ఫలితాలు ఉత్కృష్టంగ ఉంటాయి. రోగికి బదులు సాధనాపరుడైన సాధకుడు జపించి ఔషధమును త్రాగించాలి. రోగోపశమనానికి గాయత్రీ మంత్రాన్ని జపించి ఔషధాన్ని ఇవ్వవచ్చు.

అలాగే ఆవుపేడతో తయారైన విభూదికి రోగ నివారణలో ప్రత్యేక శక్తి ఉంది. శివపంచాక్షరి, నారాయణ అష్టాక్షరి, మృత్యుంజయ మంత్రము లతో జపించి ఔషధంగాను, శరీరముపైన పూయాలి. రోగాలు దూరమవు తాయి. జలాన్నిగాని, ఆవుపాలను, గేదెపాలనుగాని, తేనెనుగాని రోగిచేత పఠింపచేసి (11సార్లు) త్రాగించాలి. రోగి పఠించలేని స్థితిలో మరొకరు మంత్రించి త్రాగించాలి. తిరుమలలో కాలినడకతో కొండనెక్కినా, అంగ ప్రదక్షిణలు చేసినా, స్వామికి మంగళసూత్రాలు సమర్పించినా రోగాలు నయమవుతాయి. అలాగే త్రిచూర్ (తమిళనాడు)లో నేయి, గురవయ్యూర్‌లో తైలం, తిరుచందూర్‌లో పవిత్ర విభూదినిగాని, షోలింగర్ (తమిళనాడులోని వేలూరు జిల్లాలోనిఘటికాచల నారసింహ క్షేత్రం)లోని పరమ పవిత్ర తీర్థం

గని తీసుకుంటే సర్వ రోగాలు అణగారి పోతాయి. నిత్యము మారేడు దళాలు పదటింని నాన్చిన పచ్చి శనగలను నిత్యము (కాశీలో తీసుకొని స్వస్థత పొందుతారు) నమిలి తింటేను, అలాగే విష్ణుప్రీతికరమైన తులసి దళాలను నాల్గింటిని అమ్మవారికి ప్రీతిపాత్రమైన వేప చిగుళ్ళను 10 ఇంటిని తింటే రోగాలు పోతాయని పురాతన వైద్య గ్రంథాలలో వ్రాసి ఉంది. పూజలో వాడే కర్పూరహారతి ధూపం ఎంతో మేలు చేస్తాయి.

ధర్మశాస్త్రము, ఆయుర్వేదము, మంత్రశాస్త్రము ఒకదాని కొకటి మిత్రత్వంతో కలసి మెలసి ఉంటాయి. ఆయుర్వేదం శరీర సంబంధ రోగకారకాలను వాత పిత్త కఫాలను అలాగే మంత్రశాస్త్రము లేక యోగ శాస్త్రము సత్త్వరజో తమోగుణాలని మనస్సుకు అంటి ఉంటాయని, అవి అవిద్యనుండి పుడతాయని, కావున పై రెండింటిలో వాటిని సమతుల్యంగ శరీరంలోగాని మనస్సులో గాని ఉండేట్లు చేయాలని వేదవిదులు చెబుతారు. అలాగే పంచగవ్యాలను గూర్చి ధర్మశాస్త్రం చెప్పినట్లు వైద్యశాస్త్రము కూడ చెప్పింది. పాపపరిహారం కోసం మంత్రములను జపిస్తూ పంచగవ్యాలను (ఆవు పంచతము, ఆవుపేడ మొ॥నవి) సేవించాలని ధర్మశాస్త్రము, వైద్య శాస్త్రము చెబుతున్నాయి. నీరసంగా ఉన్నపుడు, మరలా రోగాలబారి పడకుండా ఉండాలంటే ఆవుపాలను, పెరుగును, నెయ్యిని, పంచతాన్ని, పేడను సేవించాలని ఆయుర్వేద వైద్యశాస్త్రము చెబుతున్నది. వైదిక శాస్త్రము ఏది పుణ్యమో ఏది పాపమో అని చెప్పినదో, అదే ఆయుర్వేదం హితమని అహితమని చెప్పింది.

ఇంతకీ మనము మన అనారోగ్యాలను అనగా శారీరక మానసిక రోగాల నివారణకు మూలికా (లేక ఇంగ్లీషు) ఆయుర్వేద మందులను, నవరత్నమణుల బస్మాన్నిగాని, బంగారము, వెండి,రాగి, పాదరసంలాంటి భస్మాలతో రుగ్మతలను నయం చేసే విధాలను, ఆ తర్వాత మంత్రాలతో దివ్య స్నానక్రియను తెల్సుకుందాము. మొదట మంత్రాలతో, మహా మంత్రా లతో ఔషదాలను అభిమంత్రించి తీసుకోవడం ద్వారా రోగాలను నయం చేసే క్రియలను గూర్చి తెల్సుకుందాము. పాఠకులు గురుముఖత సలహాతో ఆచరించి దుష్టశక్తులను, రోగాలను దూరం చేసుకోగలరని ఆశించడమైనది.

ఎంతో, ఎన్నో జన్మల అదృష్టం చేసుకుంటేనే ఈ క్రింది క్రియలు ఆచరించి పూర్తి స్వస్థత పొందగలరు. ఒకవేళ జ్వరము వచ్చిన ఆ జ్వరము

కుజునివల్లనో, శనివల్లనో రవివల్లనో వచ్చిన ఆ గ్రహమంత్రానుష్ఠానము మరియు శివ, నారాయణ, శాక్తేయ, సుబ్రహ్మణ్య, ఆంజనేయ, భైరవ దేవతలలో ఒకరు లేక ఇద్దరు దేవతల అనారోగ్య నివారణ మంత్రాలతో అభిమంత్రించి ఔషధమును స్వీకరించిన తప్పక తగ్గిపోతుంది. శిరోవేధనకు రవి కారణమైతే ఆ శిరోవేదన పార్శ్వపు నొప్పి అయిన సూర్య నమస్కారాలు నిత్యము ఈ క్రింది మంత్రాలతో చేసేది. ఔషధం కూడ ధ్యానంతో స్వీకరించేది. అవి

1. ఓం జూం సః సూర్యాయ నమః (స్త్రీలు మాత్రం)

2. ఓం హ్రీం ఘృణిః సర్య ఆదిత్యోం (పురుషులు మాత్రం)

3. క్లీం ఓం నమః ఓం హ్రీం ఘృణిః సూర్య ఆదిత్యోం

2. ఓం ఉదితో భగవాన్ సూర్యః పదాక్షః వృక్షకేతనే ఆదిత్యస్య ప్రసాదేన మమ స్యార్ధచేటకం నాశయ నాశయ స్వాహా (స్త్రీ పురుషులిరువురు)

3. ప్రతి ఆదివారము 108 సార్లు జపించి, పాలు నీటితో అర్ఘ్యం ఇస్తే త్వరలో పార్శ్వపు నొప్పి, శిరోభారాలు తగ్గిపోతాయి. అలాగే మందులు కూడ మంత్రంతో ధ్యానించి స్వీరించేది. అలాగే హృద్యోగ రోగాలకు కారకులైన శని, రవి, కుజుల మంత్రాలతోటి మహా మృత్యుంజయ మంత్రాని జపిస్తూ (కనీసం 11సార్లు) మందులు స్వీకరించేది. అలాగే అర్ఘ్యము ముగ్గురుకి సమర్పించేది.

అలాగే పితృశాపగ్రస్తులై గురు, మాతా, దైవ శాపగ్రస్తులైనపుడు మందుల స్వీకరణ, ధ్యానాదులు దీర్ఘకాలం చేస్తూ మధ్యమధ్యలో స్వయం భూక్షేత్రాలను దర్శిస్తూ వుండాలి. ఇటువంటి బ్రహ్మహత్యాపాతక నివారణకు నిత్యం ఉదయం, సాయంత్రం ధ్యానాదులు, ప్రదక్షిణలు ఈ క్రింది మంత్రాలతో జపించాలి.

1. మహా మృత్యుంజయ మంత్రములు (శివ) (శివాభిషేకాలు)

2. సుదర్శన నారసింహ మంత్రములు

3. దుర్గా/చండీ/కాళీ మహా మంత్రాలు

4. ధన్వంతరీ మహామంత్రము. అశ్వనీ దేవతామంత్రారాధన

5. రావి,బిల్వవృక్షాల ఆరాధన గురు,మాతృ, పితృ సేవలు ధర్మకర్మానుష్టానమాచరించాలి.

6. ఈ మంత్రాలతో రెండుపూటలా మంత్రాలను ధ్యానిస్తూ 30 నిమిషాలపాటు స్నానం చేస్తుండాలి (దేవతాస్నానం)

7. బీదసాదలకు, వృక్షాలకు, పక్షులకు, జంతువులకు ఆదరించి పోషించాలి. మహాపాతకాలు, రోగాలు ఉపశమిస్తాయి.

అలాగే దుష్టప్రయోగాలు, చేతబడి క్రియలు చేయబడినపుడు జాగ్రత్త వహించవలె. అటువంటి సందర్భంలో సత్‌సాదకుల సలహాలను అనుస రించి ఆ ప్రయోగతంతు బాధలనుండి సత్వరమే కోలుకొనేందుకు ప్రయ త్నించవలె. ఇది చేతబడి ప్రయోగము అని తెల్సుకున్న వెంటనే దుష్టప్రయోగ భూతప్రేత పిశాచ బాధల నుండి ఉపశమనం పొందే నారసింహ, శివ, ఆంజనేయ, కాలభైరవ, కాళి, దుర్గ, చండీదేవతలలో ఒకదేవతకు సంబం ధించి బీజాక్షర సహితంగ ఉన్నటువంటి కవచాన్ని ఉదయం 11 లేక 18 లేక 27 సార్లు అలాగే సాయంత్రం కూడ పూజా మందిరంలో పంచపూజ సహితంగ ధ్యానిస్తూ నివేదనలు సమర్పించాలి. ఒక మండలము (48 రోజులు) పూర్తి అయిన తర్వాత తానుపాసిస్తున్న దేవత స్వయంభూ క్షేత్రంలో 3 రోజులుగాని, 12 రోజులుగాని అదే ఉపాసనతో ధ్యానించిన ఆ దుష్ట ప్రయోగ క్రియలు నాశనమవుతాయి.

ఇదే కాలంలో చేతబడుల బారినపడ్డ వారి ఆరోగ్యంలో చెడుమార్పులు చోటు చేసుకుంటాయి. ఆ అనారోగ్య నివారణకు డాక్టరు సలహా తీసుకుం టూనే ఈ క్రింది ఆయుర్వేద క్రియలు ఆచరించాలి. వేపచిగుళ్లు 5, తులసి దళాలు 3, తిప్పాకు (అమృతవల్లి) ఆకులు 3 కలిపి చేతబూని ధన్వంతరి మంత్రంతో 11 సార్లు, మృత్యుంజయ మంత్రంతో 11సార్లు ఆంజనేయ సంజీవినీ మంత్రంతో 11 సార్లు మానసికంగా అభిమంత్రించి తినుచున్నచో లోపలి రోగము, దుష్టక్రియ నశించిపోతాయి. అలాగే సాయంత్రం పూత్రిఫల (తానికాయ, కరక్కాయ, ఉసిరికాయ) చూర్ణాన్ని నీళ్లలోగాని పాలల్లో గాని కలిపి పై మంత్రాలతో మానసికంగ మంత్రించి తీసుకున్న వాతపిత్త కఫాలు నశించి వాటి సమతుల్యత సాధించటం ద్వారా ఆరోగ్యం సిద్ధిస్తుంది. చేతబడి క్రియలు ఇంటిల్లపాది ఉందనుకున్న గృహంలో అందరూ ఆచరిస్తూ పూజామందిరంలో దేవునికి అర్పణం చేసిన తీర్థజలంలో తులసి పసుపు వేస్తూ ఆ జలాన్ని శంఖంలో ఉంచి, నారసింహ, దుర్గ, కాళి, సూర్యనారా యణ, ధన్వంతరి, ఆంజనేయ, చండీ, భైరవ మంత్రాలను పఠిస్తూ ఇంటెల్ల

పొది రోజుచల్లాలి. అలాగే వారంలో మంగళ, ఆది, శుక్ర వారాలలో మంచి సాంబ్రాణిని నూరి పై మంత్రాలతో మంత్రించి ఉంచిన పొడిని ఇంటెల్లపాది ధూపము వెయ్యాలి. నిత్యం తులసి ఆరాధన చేస్తూ, మూగ జీవులకు ఆహారాన్నందించాలి. ఈ విధంగ చేస్తే అంతా శుభమే జరుగు తుంది.

నిత్యము నీరుత్రాగుతుంటాము. కాఫీ/టీ త్రాగుతుంటాము. పండ్లరసాలు త్రాగుతుంటాము. పండ్లు తింటుంటాము. అనారోగ్యంగ ఉన్న వాళ్ళు పైన చెప్పిన ఆరోగ్యకర మృత్యుంజయకర మంత్రాలతో 11 సార్లు జపించి ఆహారంగ తీసుకున్న సగం రోగాలు దరిచేరవు. అలాగే దీనికి ఓర్పు, జ్ఞానంతో కర్మాచరణ తప్పనిసరి. ఇంగ్లీషు మందులు తీసుకుంటున్నా సరే ఒక 4 నిమిషాలపాటు కుడిచేతిలో మందులుంచుకొని ధ్యానించి ఆ పరాత్మరుని నాకు ఆరోగ్యాన్ని ప్రసాదించమని భావన చేస్తూ గ్రహించాలి. ఇలా ఆచరించిన మనుజునికి ఏ అనారోగ్యము బాధించదంటే ఆశ్చర్యం లేదు. ఈ దేవతా ధ్యాన ప్రక్రియలో నిత్యము ప్రయాణం చేస్తున్నపుడు, ఒంటరిగ ఉన్న సందర్భంలోను, నిద్రించే ముందు, నిద్రనుండి లేచే ముందు ఎల్లప్పుడూ ఆ పరాత్పరుని ధ్యానిస్తూ ఉంటే సర్వరోగ, సర్వారిష్ట దురదృష్టాలు అగ్నిలో ఉంచిన వెన్న కరిగిపోయినట్లు నిర్వీర్యమైపోతాయి. శరీరంలో ఉదాహరణకు హృదయ సంబంధ అనారోగ్యమున్నపుడు నిత్యముచేసే ధ్యాన క్రియలు ముగిసిన తర్వాత, తన పనులు తానుచేసుకుంటూ హృదయరోగా లకు కారకులైన రవి,కుజ, రాహు, శని గ్రహాల ధ్యానం చేస్తూనే దృష్టిని హృదయ భాగమందు కేంద్రకరించి ధ్యానిస్తూ ఉండాలి. ఈ ధ్యానంతోటి ఆది, మంగళ వారాల్లో ఆవుపాలతో తర్పణ ఇస్తుండాలి. అలాగే హృదయ రోగ నివారణకు మహామృత్యుంజయ మంత్రంగాని, పరబ్రహ్మ వ్యాధినివారక మంత్రంగాని, ధన్వంతరీ మహామంత్రంగాని, ఆంజనేయ సంజీవినీ మంత్రంగాని ఏదో ఒకటి లేక రెండు మంత్రాలను (ధన్వంతరీ మరియు మృత్యుంజయాలు శ్రేష్టము) హృదయ కుహర భాగాలందు తన దృష్టిని కేంద్రీకరిస్తూ ధ్యానించాలి. అలాగే తర్పణము మంగళ ఆది వారాల్లో ఇవ్వాలి. ఇలా తనదైనందిన కార్యక్రమాలు మలచుకున్నచో సర్వము సులభ తరమై ఆయుః ఆరోగ్య ఐశ్వర్యాభివృద్ధి కల్గి సుఖించగలరు.

ఇక దివ్యమంత్ర స్నానానికి వద్దాము. ఇది ఒక అద్భుత ప్రక్రియ. ఋషులు ప్రేమతో మనకు అందించిన దివ్యస్నాన ప్రక్రియ. ఈ శరీరమునే ఒక శివలింగంగా భావించాలి. భావించడానికి మనమెవ్వరము ఈ శరీరమే ఒక శివలింగం. ఈ భూమే ఒక శివలింగం. ఆకాశమునుండి వర్షించేవన్నీ అభిషేక క్రియలే ఉపాసనా సాదకులుగాని లేక సాధారణ ఉపాసనకులుగాని నిత్యము రెండుపూటలా ఈ మంత్రపూతమైన దివ్య స్నానాన్ని ఆచరించాలి. స్నానాలు 6 రకాలుగా వర్గీకరించినను ఆ ఆరు రకాలలోని దివ్యస్నానాన్ని ఈ విధంగ చెప్పారు. ఉత్తరాయణ కాలంలో లేత ఎండకాయుచున్నపుడు పడే వర్షంలో తడియుటను దివ్యస్నానమని అంటారు. ఇప్పుడు ఇక్కడ స్పృశించబోయే స్నానాన్ని దివ్యమంత్ర స్నానమని వేదవిదులు శెలవిచ్చారు. నిత్యము ఉదయము సాయంత్రం కనీసము 30 నిమిషాలు ఈ మంత్రపూత దివ్యస్నానాన్ని చేయాలి. ఇది ఒకవిధంగ స్నానపూర్వక దివ్య ఉపాసన అని అనవచ్చు. ఈ స్నానాన్ని ఇంట్లోగాని, చెరువు, నది, సముద్రాల్లో చేయవచ్చు. అందరకు గృహంలో 99శాతం కాలము స్నానముచేసే అవకాశ ముంది. తానుపాసిస్తున్న మంత్రాలు మరియు తనకు తెల్సిన మంత్రాలు, మంత్రశ్లోకాలను మానసికంగ ధ్యానిస్తూ శిరముపై పసుపు జలాన్ని (ఒట్టి జలమైనాసరే) పోస్తూ స్నానమాచరించాలి. అంటే శరీరమనే శివలింగానికి జలముతో శివపంచాక్షరి, నారాయణ అష్టాక్షరి, శాక్తేయ, నారసింహ, శ్రీరామ, శ్రీకృష్ణ, కాలభైరవ, సుబ్రహ్మణ్య, గాణపత్య లాంటి దేవతా మహా మంత్రములను నామ మంత్రములు, మంత్ర శ్లోకాలతో స్వచ్ఛ జలముతో గాని, పసుపునీళ్లతో గాని నిదానంగ, భక్తితో, శ్రద్ధతో దివ్యమంత్రస్నానాన్ని ఆచరించిన (జీవిత పర్యంతం) సర్వరోగాలు పరారైపోతాయి.

రోగాలు నయమవడానికి, దేవతానుగ్రహమునకు విభూతి స్నానం ఒక దివ్య క్రియాప్రయోగమని చెప్పారు. ఋషులు తమిళ గ్రంధాలలో పాండ్యరాజు రోగాన్ని త్రునీర్ట్రుప్పదిగం పఠించి విభూతితో మంత్రించి స్వీకరించడం ద్వారా పోగొట్టినట్లు చెప్పబడింది. పూర్వ ఋషులందరు ఇదే విషయాన్ని పురాణాల్లో అనేకసార్లు చెప్పడం జరిగింది. మృత్యుంజయ, శివపంచాక్షరి, సుబ్రహ్మణ్య, ధన్వంతరి, నారాయణ మంత్రాలను పఠిస్తూ నిత్య ఉదయం సాయంత్రం విభూది ధారణ చేయాలి. అలాగే విభూదిని గాని, విభూదికలిపిన జలాన్నిగాని, తేనెనుగాని స్వీకరించితే రోగాలు నయ

మవుతాయి. నిత్యము శ్రమ అనుకోకుండ ఉదయం సాయంత్రం భక్తి శ్రద్ధ లతో విభూదిని మంత్ర ధ్యానాదులతో ధారణ చేయాలి.

అలాగే నిత్యము ఉదయము సాయంత్రము మంత్రపూర్వక ప్రాణాయామాన్ని 5 నుంచి 10 నిమిషాలు చేయాలి. ఎవరైతే నిత్యము ప్రాణాయామం చేస్తారో ఎవరైతే ప్రాణాయామంతోటి దేవతా ఉపాసన సాధన చేస్తారో వారిని ఏ రోగాలు బాధించవు. దేవతా అనుగ్రహం వెంటనే కల్గుతుంది. మానసిక ప్రశాంతతత నిరంతరం కల్గుతుంది. బయటనుంచి వచ్చే దుష్ట గ్రహాలు ప్రవేశించలేవు. బయటిరోగాలు శరీరంలోకి ప్రవేశించలేవు. జన్మతః శరీరంలో ఉన్న రోగాలు అణగారి నశించిపోతాయి. కావున సర్వులు మంచి ఆరోగ్యానికి, దేవతానుగ్రహానికి నాకు తెల్సి ఆచరిస్తున్న మంచి విషయాలు మీ ముందుంచుతున్నాను. ఇక ఆచరించి ఫలితాలను ఆశ్వాదించడం మీవంతు.

## గకార గణపతి అష్టోత్తర శతనామావళిః

ఓం గం ఓం గకారరూపాయ నమః
ఓం గం బీజాయ నమః
ఓం గం గణేశాయ నమః
ఓం గం గణవందితాయ నమః
ఓం గం గణనీయాయ నమః
ఓం గం గణాయ నమః
ఓం గం గణ్యాయ నమః
ఓం గం గణనాతీతసద్గుణాయ నమః
ఓం గం గగనాదికసృజే నమః
ఓం గం గంగాసుతాయ నమః10
ఓం గం గంగాసుతార్చితాయ నమః
ఓం గం గంగాధరప్రీతికరాయ నమః
ఓం గం గవీశేడ్యాయ నమః
ఓం గం గదాపహాయ నమః
ఓం గం గదాధరసుతాయ నమః
ఓం గం గద్యపద్యాత్మక కవిత్వదాయ నమః
ఓం గం గజాస్యాయ నమః
ఓం గం గజలక్ష్మీపతయే నమః
ఓం గం గజవాజిరథప్రభాయ నమః
ఓం గం గంజానిరతశిక్షాకృతయే నమః
ఓం గం గణితజ్ఞాయ నమః 21
ఓం గం గణోత్తమాయ నమః
ఓం గం గండదానాంచితాయ నమః
ఓం గం గన్త్రే నమః
ఓం గం గండోపలసమాకృతయే నమః
ఓం గం గగనవ్యాపకాయ నమః
ఓం గం గమ్యాయ నమః
ఓం గం గమనాదివివర్జితాయ నమః
ఓం గం గండదోషహరాయ నమః
ఓం గం గండభ్రమద్భ్రమరకుండలాయ నమః
ఓం గం గతాగతజ్ఞాయ నమః
ఓం గం గతిదాయ నమః
ఓం గం గతమృత్యవే నమః
ఓం గం గతోద్భవాయ నమః
ఓం గం గంధప్రియాయ నమః
ఓం గం గంధవాహాయ నమః
ఓం గం గంధసింధురబృందగాయ నమః
ఓం గం గంధాది పూజితాయ నమః

ఓం గం గవ్యభోక్త్రే నమః
ఓం గం గర్గాదిసన్నుతాయ నమః40
ఓం గం గరిష్ఠాయ నమః
ఓం గం గరభిదే నమః
ఓం గం గర్వహరాయ నమః
ఓం గం గరళి భూషణాయ నమః
ఓం గం గవిష్ఠాయ నమః
ఓం గం గర్జితారావాయ నమః
ఓం గం గంభీరహృదయాయ నమః
ఓం గం గదినే నమః
ఓం గం గలత్కుష్ఠహరాయ నమః
ఓం గం గర్భప్రదాయ నమః 50
ఓం గం గర్భార్భరక్షకాయ నమః
ఓం గం గర్భాధారాయ నమః
ఓం గం గర్భవాసిశిశుజ్ఞాన ప్రదాయ నమః
ఓం గం గరుత్మత్తుల్యజవనాయ నమః
ఓం గం గరుడధ్వజవందితాయ నమః
ఓం గం గయేడితాయ నమః
ఓం గం గయాశ్రాద్ధఫలదాయ నమః
ఓం గం గయాకృతయే నమః
ఓం గం గదాధరావతారిణే నమః
ఓం గం గంధర్వనగరార్చితాయ నమః
ఓం గం గంధర్వగానసంతుష్టాయ నమః
ఓం గం గరుడాగ్రజవందితాయ నమః
ఓం గం గణరాత్రసమారాధ్యాయ నమః
ఓం గం గర్హణాస్తుతిసామ్యథియే నమః
ఓం గం గర్తాభనాభయే నమః
ఓం గం గవ్యూతిదీర్ఘతుండాయ నమః
ఓం గం గభస్తిమతే నమః
ఓం గం గర్హితాచారాదూరాయ నమః
ఓం గం గరుడోఫలభూషితాయ నమః
ఓం గం గజారివిక్రమాయ నమః70
ఓం గం గంధమూషవాజినే నమః
ఓం గం గతశ్రమాయ నమః
ఓం గం గవేషణీయాయ నమః
ఓం గం గహనాయ నమః
ఓం గం గహనస్థమునిస్తుతాయ నమః
ఓం గం గవయచ్ఛిదే నమః
ఓం గం గండకభిదే నమః
ఓం గం గహ్వరాపథవారణాయ నమః
ఓం గం గజదంతాయుథాయ నమః
ఓం గం గర్జద్రిపుఘ్నాయ నమః80
ఓం గం గజకర్ణికాయ నమః
ఓం గం గజచర్మామయచ్ఛేత్రే నమః
ఓం గం గణాధ్యక్షాయ నమః
ఓం గం గణార్చితాయ నమః
ఓం గం గణికావర్తనప్రీతాయ నమః
ఓం గం గచ్ఛతే నమః
ఓం గం గంధఫలీప్రియాయ నమః
ఓం గం గంధకాదిరసాధీశాయ నమః
ఓం గం గణకానందదాయకాయ నమః
ఓం గం గరభాదిజనుర్హర్త్రే నమః90
ఓం గం గండకీగాహనోత్సుకాయ నమః
ఓం గం గండూషీకృతవారాశయే నమః
ఓం గం గరిమాలఘిమాదిదాయ నమః
ఓం గం గవాక్షవత్సౌధవాసినే నమః
ఓం గం గర్భితాయ నమః
ఓం గం గర్భిణీసుతాయ నమః
ఓం గం గంధమాదనశైలాభాయ నమః
ఓం గం గండభేరుండవిక్రమాయ నమః
ఓం గం గదితాయ నమః
ఓం గం గద్గదారావ సంస్తుతాయ నమః
ఓం గం గహ్వరీపతయే నమః101
ఓం గం గద్యేడ్యాయ నమః
ఓం గం గతభియే నమః
ఓం గం గదితాగమాయ నమః
ఓం గం గర్హణీయగుణాభావాయ నమః
ఓం గం గంగాదికశుచి ప్రదాయ నమః
ఓం గం బలాయుష్యాది దాయకాయనమః
ఓం పుత్రగణపతిస్వామినే నమః

## కాల ప్రకరణం

### ఉపాసన చేసే సాధకులు తాము సాదన చేసే మంత్ర యంత్ర తంత్ర సాదనలు చేయాల్సిన శుభసందర్భాలు-మంత్రసాదనలో మెళుకవులు

సాధనచేసే సాధకులు సంవత్సరములోని 12 నెలలలో 8 నెలలు అయిన చైత్రము, వైశాఖము, శ్రావణము, ఆశ్వయుజం, కార్తీకం, మార్గశిరం, మాఘం, ఫాల్గుణం మాసాలు సాధనకు అత్యంత అనుకూల మయినవి. అదే విదంగ గురుమూఢం శుక్రమూడం కాలల్లోను, కుజస్తంభనంలోగాని సాదనపనికిరాదు. అదేవిదంగా సాధనకు శుభతిధులు ఏవనగా కృష్ణ లేక శుక్లపక్షంలోని విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, శుక్లపక్ష త్రయో దశితిధి, అలాగే ఏకాదశి తిధులు ముఖ్యమైనవి.

అలాగే సాధనకు శుభవారాలు సోమ, బుధ, గురు, శుక్రవారాలు శుభ వారాలు. సాధనకు శుభనక్షత్రాలు ఏవన (14 నక్షత్రాలు) అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరా షాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి. ఈ నక్షత్రాలు శుభ సాధన లకు బాగా పనికివస్తవి. అలాగే సాధనకు లగ్న నిర్ణయాలు ప్రధానమైనవి., వైష్ణవ మంత్రాలకు స్థిరలగ్నాలైన వృషభ, సింహ, వృశ్చిక, కుంభలగ్నాలు మంచివి. శైవ సంబంధ సాదనలకు చరలగ్నములు అనగా మేష, కటక, తులా, మకర లగ్నాలు ఉత్తమమైనవి. ఇక శక్తికి సంబంధించిన శాక్తేయ మంత్ర సాధనలకు ద్విస్వభావ లగ్నాలు అనగా మిధున, కన్యా, ధనుర్, మీన లగ్నాలు ప్రశస్తమైనవిగా చెబుతారు.

అలాగే మంత్ర యంత్ర తంత్ర ప్రయోగాలు చేసే లగ్నాలు ప్రత్యేకంగ ఉండాలి. వశ్యం, మోహనంలాంటి తంత్ర ప్రయోగాలు శుక్ర రాశులలోనే చేయాలి. (వృషభ, తులారాశులు.) ఆకర్షణ ప్రయోగించదలచివారు ధనుర్ మీనలగ్నాలలోనే చేయాలి. ఉచ్చాటనాది ప్రయోగాలు చేసేవారు శని రాశు లైన మకర కుంభరాశులలోనే చేయాలి. ఇతరములైన ప్రయోగాదులు చేసేవారు మేష, వృశ్చిక రాశులలో చేయాలి.

## సాధన చేసే వార్కి కొన్ని సూచనలు తప్పక ఆచరించదగినవి

1. యంత్రారాధనలో బీజాక్షరాలు వేరు, మూల మంత్రాలు వేరు అని సాధకులు గమనించాలి. మూల మంత్రాలకు బీజాక్షరాలు తోడైతే జప సాదనలో పరిపూర్ణత లభిస్తుంది.

2. గురువు, తండ్రి, అన్నగారు, భర్త ఈ నలుగురు తప్ప ఇతరులపూజించిన యంత్రాలను పూజించుట అంతశ్రేయస్కరం గాదని పెద్దల అభిమతము. ఇండ్లలో ఉంచే యంత్రాలకు ఈ నియమం వర్తిస్తుంది.

3. మహామంత్రాలను, బీజాక్షరమంత్రాలను గురుముఖత స్వీకరించి గురువుగారి పర్యవేక్షణలో మాత్రము సాధన చేయాలి. స్వంతంగ ప్రయత్నిస్తే వైఫల్యాలు, ప్రమాదాలు ఎదుర్కొనవల్సి రావచ్చు కాన చేయవద్దు.

4. మంత్ర స్వీకరణను పంచాంగ శుద్ధితో సంబంధం లేకుండ సూర్య గ్రహణం, చంద్రగ్రహణం సమయాల్లోను, అలాగే పంచాంగ శుద్ధితో సంబంధం లేకుండా కాశీ, ప్రయాగ, శ్రీశైలం, కురుక్షేత్రం ఈ నాలుగు స్థలాలలోను ఉపదేశం పొందవచ్చు. అలాగే ముహూర్త నిర్ణయంలేకుండానే అశోకాష్టమి, దేవీ నవరాత్రులు, శ్రీరామనవమి, విజయదశమి, కార్తీకశుద్ధ ఏకాదశి, వైకుంఠ ఏకాదశి తిథులలో ఉపదేశం పొందవచ్చు. ఇతర సమయాల్లో పంచాంగ శుద్ధితో ముహూర్తమును చూసి సాదన ప్రారంభించాలి.

5. తల్లి తండ్రినుంచి గాని, తమ్ముడినుంచిగాని, శతృపక్షంలోని వారిచే గాని ఉపదేశం పొందరాదు. భర్త భార్యకు, తండ్రి కుమారులకు కూతుళ్లకు అన్నగారు తమ్ముడికి దీక్ష నీయరాదని వేదవిదులు చెబుతారు. సన్యాసి ఇంకొక సన్యాసికి దీక్ష ఈయవచ్చు. ఇతరులకు మంత్రోపదేశమునకు పనికిరాడు. అలాగే బ్రహ్మచారి కూడ. తండ్రినుండి మంత్ర స్వీకరణ ఆధునికులు చేస్తున్నారు.

6. సంపదలకై సాధించే కర్మలను 'నమః' అనే పల్లవాన్ని, సాదన పుష్టి నిమిత్తం కొరకు 'స్వాహా' అనే పల్లవాన్ని, వశ్యకర్మలలో 'వషట్' ను, ఆకర్షణ కర్మలో 'వౌషట్'ను, విద్వేషణ కర్మయందు 'హుం'ను, ఉచ్చాటన కర్మలో 'ఫట్'నూ, మారణ కర్మలో 'ఖే ఖే' ను ఉపయోగించాలి. అవసరమును బట్టి దేవతనుబట్టి, సంకల్పమునుబట్టి ఈ పల్లవములు మారుతుంటాయి.

7. సాధకులు సాధనచేసే క్రమంలో శాంతి పౌష్టిక కర్మలలో తెలుపు రంగు వస్త్రములు, వశ్యాకర్షణములందు ఎరుపు రంగు వస్త్రములు, స్తంభన కర్మలందు ఆకుపచ్చ వర్ణ వస్త్రములు, విద్వేషణమునందు ముదురు ఎరుపును, మారణ కర్మలందు నలుపు వస్త్రమును ధరించవలెను.

8. సాధకుడు కూర్చొను ఆసనము కూడ తగినదిగ ఉండాలి. రాతిపై, చెక్కపై ఫలితము శూన్యమని చెబుతారు. కృష్ణాజినము జ్ఞానసిద్ధికి, పులి చర్మము మోక్షమునకు, కంబళి సర్వ సిద్ధులకు, దర్భాసనము జ్ఞానసిద్ధి మంత్రసిద్ధిని ఒసంగ గలదు. పీటపై మెత్తని గుడ్డను పరచి మంత్ర సిద్ధిని పొందినవారు అనేకమంది గలరు.

9. ధ్యానించే జపము 1. వాచిక జపము (పెద్దగ ఉచ్చరించుట) 2.ఉపాంశు జపము (శబ్దము వినపడకుండా పెదవులను కదుపుచు జపించుట) 3. మానసిక జపము (అంతరంగము నందే మనస్సులో స్థిరదేహుడై జపించుట) ఈ మానసిక జపము ఉత్తమోత్తమమైనది. ఉపాంశు జపము మధ్యమము. వాచిక జపము అధమమైనది.

10. చేయు జపము సాఫల్యత పొందుటకు జపమాలతో జపించాలి. వశీకరణ కర్మలందు రత్నమాలను గాని లేక స్పటిక మాలనుగాని ఉపయోగించి జపించాలి. ఏనుగుదంతాలతో చేసిన జపము ఆకర్షణ ప్రదము. పసుపు కొమ్ములచే చేయబడిన మాల స్తంభన కర్మలందు ఉపయోగించాలి. పగడములు, ముత్యములు, స్పటికములుగల మాలతో జపము కోటిరెట్లు ఫలాన్నిస్తుంది. తులసిపూసలమాల, రుద్రాక్షమాల,మణుగుగల మాలా జపము అక్షయ ఫలితాన్ని ఇస్తుంది. జపమాలసంఖ్య 108 లేక 54 లేక 27 లేక 41 లేక 21 సంఖ్యలగ ఉండి జపిస్తుంటారు.

11. మంత్రములు బీజ, పూర్ణ, మాలా మంత్రములుగ ఉంటవి. ఒకటి నుండి 10 అక్షరాల వరకున్న మంత్రమును బీజమంత్రమని, 10 అక్షరాల నుండి 24 అక్షరముల వరకుంటే పూర్ణమంత్రమని, 24 అక్షరాలకు మించి అక్షరములున్న మంత్రాలను మాలా మంత్రములు అంటారు. బాల్యంలో బీజమంత్రములు, యౌవ్వనములో పూర్ణ మంత్రములు,ప్రౌఢ వయస్సులో మూడు రకముల మంత్రములు, వృద్ధాప్యంలో మాలా మంత్రములు జపించవచ్చునని వేదవిదులు సెలవిచ్చారు.

12. మంత్రోపాసకులకు కొన్ని లక్షణాలున్నవి. ఆహారం (సాత్వికం) తినే సందర్భంలో మౌనంగా తినాలి. పండ్లు కుట్టుకోరాదు. కోపముండ రాదు. సాత్విక స్థితి కలిగి వుండాలి. మౌనంగా వుండాలి. ప్రతి ఒక్కరిని తన బిడ్డలవలె చూడాలి. దేవతార్చన యందు పదార్థాలకన్నా భక్తి శ్రద్ధలకు పెద్దపీట వెయ్యాలి. సూర్యోదయానికి ముందు లేవాలి. పిల్లలను స్త్రీలను దైవాన్ని, వృద్ధులను ఒకే విధంగ చూడాలి.

## విభాగము - 2

## శ్రీ లక్ష్మీగణపతి ఉపాసనలో గమనించి ఆచరించాల్సిన ముఖ్య విషయాలు

### గణపతి - కన్యారాశి

1. శ్రీలక్ష్మీ గణపతి స్వామి కన్యాలగ్నానికి అధిపతి. గణపతిని అర్చించిన తర్వాత బుధుని కూడ అర్చించాలి. గణపతి పూజ, అర్చనలు, హోమాలు ఉదయం గం. 11-30 ని॥లలోపు చేస్తే దోష రహితంగ ఉంటుంది.

### గణపతి ఆరాధనలో బుధ మంగళవారాలు, చవితిలు

2. గణపతికి గరిక, కుడుములు, బుధవారము, మంగళవారము, చవితి తిధి, ఆవునెయ్యి, కొబ్బరినూనె దీపం, ఉమ్మెత్తకాయలు, 21 రకాల పూలు, తెల్లజిల్లేడు పత్రాలు, పూలు (మామూలు జిల్లేడుకూడ) ఉదయ కాలం, పెసల గుగ్గిళ్లు ఇష్టమైనవిగాన పూజ, హోమ, నివేదనలందు వాడవల్సిన ముఖ్యవస్తువులు కాలాలు ఇవి.

### జిల్లేడు, గరికతో హోమము - కుష్టువ్యాధి నిర్మూలన

3. గణపతిని గరిక చేతబట్టి ధ్యానంచేస్తే ఫలితాలు అధికం. గరిక మరియు అష్టద్రవ్యాలతో హోమం చేసిన మంచి ఫలితాలు కల్గుతాయి.

4. కుష్టువ్యాధిని నిర్మూలించడంలో గణపతికి గణపతే సాటి., రోగనాశక మంత్రాలతో నిత్యము జిల్లేడు ఆకులు, పూలతో పూజ ధ్యానాదులు చేస్తే కుష్టురోగంతో సహా అన్ని రోగాలు తగ్గిపోతాయి. (వీటితోబాటు గరిక ఉమ్మెత్త, ఉత్తరేణి, కుడుములు వాడాలి.)

## అష్ట ద్రవ్యాలతో గణపతి అర్చన

5. గణపతిని తూర్పుదిక్కున కూర్చొని విద్యామంత్రంతో ధ్యానిస్తే సమస్త విద్యలు వస్తాయి. ఉత్తరదిక్కున కూర్చొని వ్యాపార ఐశ్వర్య గణపతి మంత్రంతో ధ్యానిస్తే వ్యాపార లాభాలు కల్గుతాయి. గణపతిపూజ హోమాదుల్లో గరిక, తెల్లజిల్లేడు, మోదకాలు వినియోగిస్తే సత్వర ఫలసిద్ధి లభిస్తుంది. అలాగే గణపతి హోమం అష్టద్రవ్యాలైన కుడుములు, అటుకులు, చెరకు ముక్కలు,పేలాలు, కొబ్బరిముక్కలు, శ్రీగంధ సమిధలు, తెల్లగరిక (పచ్చగరికైనా), ఆవునెయ్యిను వినియోగిస్తే ఫలితాలు అమోఘంగ ఉంటాయి. గణపతిని ప్రత్యేకంగ ప్రత్యేక దినాలలో అర్చన చేయాలి. ఫాల్గుణ శుద్ధ చవితిన పుత్రగణపతి వ్రతాన్ని ఆచరించాలి.

## గణపతి-అంగారక చతుర్థశి

6. గణపతి పూజ, ప్రదక్షిణలు, హోమాదులు అంగారక చతుర్థి (మంగళవారంతో కూడిన చవితి) మరియు రవి చతుర్థి (ఆదివారంతో కూడినచతుర్థి) దినాలలో గణపతిని ధ్యానించాలి. పూజించాలి. హోమాదులు నిర్వహించాలి. ఏ పూజ, ఏ హోమము, ఏ ధ్యానమైనా అంగారక చతుర్థి రోజునగాని లేక శుభతిధితో శుభ నక్షత్రంతో కల్సిన బుధవారం రోజునైనా మొదలుపెట్టి చేయాలి.

## సంకష్టహర చతుర్థశిలు-గణపతి ఆరాధన

7. పౌర్ణమి తర్వాత వచ్చే 21 సంకష్టహర చతుర్థశిలలో గణపతిని గరికతోను, ఎర్రగన్నేరు పూలతోను, తెల్లజిల్లేడు పూలతో మూల మంత్రాల తోను, అష్టోత్తర, సహస్రనామాలతోను పూజిస్తే, ధ్యానిస్తే కోరిన కోర్కెలు, తీరుతాయి.

## సంకటహర గణపతి

8. సంకటహర గణపతి మంత్రంతో చేసే హోమాన్ని నేరేడు కాయలు (పండ్లు) 1008 ని తేనెలో ముంచి హోమం చెయ్యాలి. అలాగే 1008 కబ్జాకాయలతో (కొబ్బరితురుముతో ఉన్నవి) హోమం చెయ్యాలి. నేరేడు కట్టెలు, జిల్లేడు కట్టెలుతోను గరిక ఇతర ద్రవ్యాలతో హోమంచేస్తే (ఉదయం 11-30 లోపు చెయ్యాలి) దిష్టిదోషాలు, సర్వకష్టాలు బాధలు పోతాయి. ఆరోజే 10 సంవత్సరాల పిల్లలు 8 మందికి భోజనం, బట్టలుపెట్టి వారిని

సంతోషపెట్టితే గణపతి అనుగ్రహము కల్గుతుంది. రాత్రికి చతుర్ధి ఉంటేనే ఆ రోజు సంకటహర చతుర్థి పూజ చేయాలి.

## సమస్త బాధల నివారణకు గణపతి ఆరాధన

9. అనేక విద్యా, అనారోగ్య, వ్యాపార, గృహచిద్ర చిక్కులతో కుటుంబంలో అందరు లేక ఒకవక్తైనా బాధపడుతున్న సందర్భంలో బుధవారంగాని చవితి రోజుగాని లేక బుధవారంతో కూడిన చవితిరోజున సంకష్టహర గణపతి మహామంత్రంగాని లేక కార్యసాధనకర మాలా మంత్రాన్ని అనుష్టించుట మొదలుపెట్టి (గృహంలో అయితే ధ్యాన పూజాదికాలు, గుడిలో నైన 108 ప్రదక్షిణలు) 11 బుధవారాలు 11 చవితిలు పూర్తిగవచ్చే కాలంలో (సుమారు 77 రోజులు అంతకన్న ఎక్కువ కావచ్చు) మొదటి మంత్రం అయితే రోజుకు 1008 సార్లు ధ్యానించాలి. రెండవ మాలామంత్రాన్ని 81 సార్లు ప్రతినిత్యం చేయాలి. చివరిరోజున శివునకు ఏకాదశ రుద్రాభి షేకము, గణపతికి గరికతోపూజ, కుడుములు నివేదన 1008 సార్లు మొదటి మంత్రంతోను, రెండవ మాలా మంత్రము 108 సార్లు హోమద్రవ్యాలైన జిల్లేడు, మేడి, రావి, కబ్జాకాయలు (కొబ్బరితురు ముతో ఉన్నవి), నేరేడు కాయలు 1008ని తేనెలో ముంచి హోమం చెయ్యాలి. నవధాన్యాలు, తెల్లనువ్వులుతో హోమం చెయ్యాలి. పూజలో ముగ్గురు గణపతులకు పూజ చేయరాదు.

## 1108 మోదకాలతో హోమము సర్వాభీష్ట సిద్ధికి

10. సర్వరోగ, సర్వకష్టాలు నివారణకు, వ్యాపారాబివృద్ధికి లక్ష్మీ గణపతి మంత్రంతో హోమం ఉదయం 11.30 లోపే నిర్వహించాలి. ఈ హోమం చేసేటపుడు 1108 మోదకాలు తయారుచేసి (1008 మోదకాలు హోమమునందు హవనము చెయ్యాలి. 100 మోదకాలు గణపతి పూజ యందు నివేదన ఇచ్చి బీదలకుగాని, నిర్మలహృదయంలోని అనాధలకుగాని పంచాలి. ఈ హోమ హవనమునందు 1008 జిల్లేడు ఆకులు, 1008 జిల్లేడుపూలు, తగినన్ని జిల్లేడు కాయలు, జిల్లేడు కాండములు కనీసం 10 కిలోలు తెల్లనువ్వులు, నవధాన్యాలు, రావి, మర్రి, మేడిలాంటి సమిధలు వాడాలి.

## గణపతి మూల మంత్రం విశిష్టత

11. సర్వాభీష్టాలు నెరవేరుటకు గణపతిని "ఓం గం గణపతయే నమః" మంత్రాన్ని బెల్లంపై ఆవునేతి దీపారాధన కుందిపెట్టి, గరిక చేతబట్టి మంగళవారం చవితి వచ్చే అంగారక చతుర్థి రోజున మొదలుపెట్టి రోజూ 1008 తక్కువ కాకుండ ఉదయం మరియు సాయంత్రం 1008 వంతున, ఉదయం 11–30 లోపు చేస్తూ 21 వారాలు అనగా 147 రోజులు ధ్యానించి, తర్వాత వచ్చే బుధవారం హోమం నిర్వహిస్తే సర్వాభీష్టాలు నెరవేరును. తూర్పు ముఖంగ చెయ్యాలి.

## గణపతి అథర్వశీర్ష మహిమ

12. సర్వాభీష్టాలు నెరవేరుటకు, సర్వకష్టాలు తొలగుటకు గణపతి అథర్వశీర్ష మంత్రమును నిత్యము 27 లేక 54 లేక 81 లేక 108 సార్లు ధ్యానిస్తూ 48 రోజులు పూర్తి అయిన తరువాత వచ్చు బుధవారం రోజున (ఈ రోజువరకు జపం చెయ్యాలి) హోమం చేసిన కోరిన కోర్కెలు నెరవేరును. ఆవునెయ్యి లేక కొబ్బరినూనె దీపం, తూర్పుముఖంగ చెయ్యాలి. వీలుంటే గణపతి స్వయంభు ఆలయాన్ని దర్శించి నిద్రచెయ్యాలి. ఈ మహామాలా మంత్రము ఉపాసకుల పాలిట కల్పవృక్షము వంటిది. ఈ మంత్రము ధ్యానించిన తర్వాత "ఓం గం గణపతయే నమః" మంత్రాన్ని 1008 సార్లు గాని 508 సార్లుగాని ధ్యానించి తర్పణము ఇవ్వవలెను.

## గణపతి తొండము

13. లక్ష్మీ గణపతి విగ్రహంలో తొండము ఎడమవైపు తిరిగియున్న కోర్కెలు నెరవేరుస్తాడు. కుడివైపుకు తిరిగి ఉంటే మోక్షము ప్రసాదిస్తాడు. ఋషిపంచమి రోజు వికటగణపతిని పూజించాలి.

## గణపతి–కన్యారాశి

14. కన్యారాశివాళ్లు గణపతిని ఆరాధించాలి. మెడలో తులసిమాలని ధరించాలి. బుధవారం రోజున ధ్యానం మొదలుపెట్టాలి. "ఓం హ్రీం పీతాంబరాయ నమః" మంత్రాన్ని ధ్యానించాలి. పసుపు కొమ్ములతో ధ్యానించాలి. బుధవారాలలో గరికతో గణపతిని పూజించి లడ్డూలను నివేదించాలి. పుణ్యక్షేత్రాల్లో పెసలు దానం ఇవ్వాలి. బుధవారం ఆవులకు పచ్చగడ్డిని దాణావేయాలి.

## దూర్వాగణపతి అర్చన

15. శ్రావణమాస శుక్ల తదియతో కూడిన చవితిరోజున (చవితి మధ్యాహ్నం ఉండాలి) దూర్వాగణపతి పూజ నాచరించాలి. అలాగే కార్తీక శుక్లతదియతో కూడిన చవితి రోజున దూర్వాగణపతిని పూజించాలి.

## కేతుగ్రహ దోషనివారణ

16. కేతుగ్రహ దోష నివారణకు కేతగ్రహ జప, తర్పణ, హోమాదులతోబాటు గణపతి పూజ జపాలు, నల్లని తెల్లని కుక్కలకు బెల్లంతోను శనగపిండితో చేసిన రొట్టెలకు నూనె లేక నెయ్యి వ్రాసి వేయాలి. కేతుగ్రహ దోష నివారణ అవుతుంది.

## గణపతి-సంకష్టహర చతుర్థి

17. అధిక ఆషాఢమాసంలో సంకష్టహర చతుర్థి రోజున విశేషంగ హేరంబగణపతి లేక సంకష్టహర గణపతిని గాని పూజించాలి. పచ్చినువ్వులను బెల్లాన్ని దంచి చేసిన 10 ఉండలను గణపతికి నివేదించి, 5 ఉండలు కర్తతిని, 5 ఉండలను ఇతరులకు పంచాలి. సాయంత్రం సూర్యాస్తమయం తర్వాత అర్ఘ్యం ఇవ్వాలి (ఆవుపాలతో).

## తెల్లజిల్లేడుతో సర్వదోషాలు నివారణ

18. తెల్లజిల్లేడు వేరుతో బొటనవ్రేలంత విగ్రహాన్ని తయారుచేసి నిత్యం గరికతోను, తెల్లజిల్లేడుపూలతో పూజించిన గృహంలో సర్వదోషాలు నశిస్తవి. సర్వరోగాలు నయమవుతాయి. తెల్లజిల్లేడు చెట్టు ఇంటిబయట మాత్రం వుండాలి. ఇంటిలోపల ఉండరాదు. గణపతి ఆలయానికి ఎదురు గృహం ఉండరాదు. ఉన్నా 200 అడుగుల దూరంలో వుండాలి.

## హేరంబగణపతి-వ్యాపారాభివృద్ధి

19. వ్యాపారాభివృద్ధికి హేరంబగణపతి ఆరాధన విశేష ఫలితాన్ని ఇస్తుంది. హేరంబగణపతిని వ్యాపారాభివృద్ధికి అర్చించాలి.

## కలౌ చండీ వినాయక

20. "కలౌచండీ, వినాయక శీఘ్రఫలదాయకః" అను వాక్యాన్ని బట్టి చండీపారాయణ, జపం, తర్పణ, హోమాదులు, అలాగే విఘ్నేశ్వర మంత్రజపం, తర్పణ హోమాదులు,పారాయణలు, శీఘ్రఫలాన్నిస్తాయి.

శ్రావణ, కార్తీక మాసాల శుక్లచవితినాడు చేసే పూజలు మంచిఫలాన్నిస్తాయి. శ్రావణ,కార్తీక మాసాల శుక్లచవితినాడు దూర్వాగణపతి వ్రతాలు, ధ్యానాలు, హోమాదులు, తర్పణాలు ఆచరించిన విశేష పుణ్యం కల్గుతుంది.

## గణపతి ఏకవింశతి నామాలతో పూజ

21. లక్ష్మీగణపతిని వినాయక చవితి రోజునగాని ఇతర సర్వదినాలలో ఏకవింశతి (21) నామాలతో గరికతోను, 108 నామాలతో పత్రి, ఉమ్మెత్తలాంటి వాటితో పూజించాలి. అవకాశం ఉంటే లక్ష్మీగణపతి మూల మంత్రాలతోనైనా పూజించిన విశేష ఫలితాలు కల్గుతాయి. వాస్తుదోషాలు నివారణకు తొండము ఎడమవైపుకున్న గణపతిని దోష నివారణకు ఉంచాలి.

## గణపతి – కరక్కాయలు – తెలగపిండి

22. వినాయక చవితి రోజు పైన ఉదహరించిన పూజాదికాలు ఆచరిస్తూ కరక్కాయలు కొన్నింటిని వినాయక చవితిరోజు ఉదయం నుండి మరుసటిరోజు ఉదయం వరకు దగ్గరుంచుకోవాలి. అరిష్టాలు తొలగుతాయి. అలాగే వినాయక చవితిరోజు తెలగపిండిని గోవులకు తినిపించి ప్రదక్షిణలు చేస్తే శుభాలు కల్గుతాయి. ఏకదంత గణపతికి బెల్లం నివేదన శ్రేష్టము.

## గణపతి–వినాయక చవితి

23. భాద్రపదమాసంలో మొదటి చవితి రోజును వినాయక చవితిగా వ్యవహరిస్తాము. ఈ రోజు చంద్రుని చూడరాదని ధర్మసింధువు, అష్టాదశ పురాణాలు సెలవిస్తున్నాయి. కాని ఒక విషయం అందరు మర్చిపోతున్నారు. ఒకవేళ చవితి వినాయకచవితికి ముందు రోజు సాయంత్రం 6 గంటల నుండి చవితి రోజు సాయంత్రం 6 గంటల వరకు చవితి ఉంటే, చవితి ఉన్న 24 గంటలకాలం 6 గంటల వరకు చవితి ఉంటే, చవితి ఉన్న 24 గంటల కాలం అనగా ముందురోజు మరియు చవితి రోజున కూడ చంద్రుని చూడరాదని ధర్మసింధువులో చెప్పబడిందిగాన చవితిని రెండురోజులు చూడరాదు. అలాగే చవితి తర్వాత రోజు కూడ చూడరాదని చెప్పబడింది. (తర్వాత రోజు చవితి ఉన్న).

## గణపతి స్వయంభూ క్షేత్రాలు

24. ఆంధ్రప్రదేశ్‌లోని గణపతి స్వయంభూక్షేత్రాలు ఇవి.వీటిని దర్శించి తరించాలి. ఐనవోలులో స్వయంభూగణపతి వెలిసాడు. (అమలా

పురందగ్గర) బిక్కవోలులో స్వయంభూ గణపతి (నిత్యము విగ్రహము పెరుగు తున్నది.) తణుకుదగ్గర ముక్కామలలో గణపతి, శ్రీశైలంలో సాక్షిగణపతి, కాళహస్తిలోని పాతాళ విఘ్నేశ్వరుడు, కాణిపాకంలోని వరసిద్ధి వినాయకుడు స్వయంభూ గణపతి క్షేత్రాలుగ ప్రసిద్ధి చెందాయి. పంచాయతనంలోని దేవతలు పంచభూతాలకు ప్రతీకలని ఇందు గణపతి భూమి తత్వానికి సంబంధించిన దేవతయని పురాణ ఉవాచ.

## గణపతి-గణేశ పురాణం

25. గణపతి శ్వేతవరాహకల్ప కాలానికి ముందే ఉన్నాడని, బ్రహ్మ విష్ణు శివ శక్తి సూర్యనారాయణులేగాక సమస్త దేవతలు ప్రధమ పూజలు గణపతికి చేశారని, పార్వతికి హిమవంతుడు గణపతి మహా మంత్రాన్ని ఉపదేశింపగ, ఆమె ఉపాసనచేసి గణపతి అనుగ్రహంతో పరమశివుని పొందిందని గణేశ పురాణం స్పష్టంగ చెబుతున్నది.

## గణపతి-శివపురాణం-గరికతో రోగనివారణ

26. శివపురాణంలో గరికతో గణపతిని ఎలా పూజించాలో స్పష్టంగ శివుడు చెప్పడం జరిగింది. ఏ గరిక అంటే ఆ గరికతో గణపతిని పూజించ రాదని శివపురాణం చెబుతున్నది. గరిక 12 అంగుళాలు నిటారుగా ఉండి, లేతగా ఉండి 3గాని, 5గాని, 7గాని 9 గడ్డిపరకలుండాలి, శుభ్రత కలిగి ఉండాలని శివపురాణం చెబుతున్నది. ఈ గరిక (దుర్వాంకురం) పూజ ద్వారా సర్వాభీష్టాలు సిద్ధిస్తవి. ఆయుర్వేదంలో గరికను ఆహారంగ తీసుకొనుట ద్వారా సర్వ రోగాలు నాశనమవుతాయని, మూలాధారంలో వచ్చే సమస్త రోగాలు గరికతో గణపతిని పూజించుట ద్వారా పోతాయని చెబుతున్నది. ఓషదీ గుణాలు కల్గిన గరిక ద్వారా మూత్రకోశ వ్యాధులు నశిస్తాయని ఆయుర్వేదం చెబుతున్నది. లక్ష దూర్వాలతో పూజిస్తే (ఒకరోజు లేక కొన్ని రోజుల్లో) సర్వ అరిష్టాలు నివారింపబడతాయి.

## గణపతి-తెల్లజిల్లేడు-క్షిప్ర గణపతి

27. తెల్లజిల్లేడు చెట్టు పాలసముద్రమును చిలికినపుడు ఉద్భవించిన నురుగునుండి పుట్టినది. 100 సంవత్సరాలు జీవించి ఉన్న తెల్లజిల్లేడు చెట్టు వేరుకు గణపతి ఆకారము ఏర్పడుతుంది. ఈ నూరు సంవత్సరాల మధ్యలో ఎప్పుడైనా ఆంజనేయస్వామి రూపము వేరుకు ఏర్పడుతుంది.

పసుపుముద్ద రూపములోనున్న గణపతి లేక మట్టిరూపంలో ఉన్న గణపతిని క్షిప్రగణపతి అని అంటారు. నీటిలో ఈ రెండు కలుపబడతాయి. పసుపు క్షిప్రగణపతిని శరీరానికి స్త్రీలు పూసుకోవచ్చు.

## గణపతి-వేపవృక్షం

28. “కలౌ కపివినాయక ఫలదాయకః” అను వాక్యమునుబట్టి కలి యుగంలో వినాయకుడు, ఆంజనేయుడు శీఘ్రఫలాన్నందిస్తారని పురాణ వాక్యం. గణేశపురాణాన్ని అనుసరించి వేపవృక్ష కాండమునుండి గాని, మందారవృక్ష కాండమునుండి గాని, తయారుచేసిన గణపతిని పూజించి ధ్యానించిన శీఘ్రఫలాన్ని ఇస్తాడని చెప్పబడినది. కొన్ని వందల సంవత్సరాలు గడచిన వేపచెట్టు సుగంధం వాసన వెదజల్లుతుందట. దీనినుండి గణపతి విగ్రహం చేయుట, పూజించుట ద్వారా శుభాలు కల్గుతాయి. ఈ విగ్రహాన్ని చవితి లేక శుభదినాన పూజగదిలో ఉంచి పూజించిన ఋణబాధలు, రోగ బాధలు నశిస్తాయి. అలాగే గణపతిని జమ్మిపత్రాలతో పూజించినను, ఎర్ర చందనంతోను, ఎర్రటి పూలతో పూజించిన శ్రేయస్కరమని గణేశపురాణం చెబుతున్నది. గరికను తలగడ క్రింద వుంచి నిద్రించిన దుస్వప్నములురావు.

## పంచగణపతులారాధన

29. గణపతి నవరాత్రుల్లోగాని, పర్వదినాల్లోగాని పంచ గణపతులను ఏకకాలంలో ఆరాధిస్తే సకల కామ్యాలు సిద్ధిస్తవని గణేశపురాణం తెలియ చేస్తున్నది. 5 మట్టి విగ్రహాలను స్థాపించి 21 రోజులు గణపతి మంత్రజపం, తర్పణం హోమం విధిన ఆచరిస్తే కారాగార బంధనం నుండి (అన్యాయంగ) విముక్తి కల్గుతుందని గణేశ పురాణం తెలియజేస్తున్నది. (ఓం గం గణపతయే నమః మంత్రంతో చివరిరోజున ఈ5 మట్టివిగ్రహాలను నిమజ్జనంచేయాలి.)

## గణపతి స్వరూపము

30. గణపతి మహా సింహాసనముపై కూర్చొని ఉండగ ఎడమ తొడపై సిద్ధిదేవత, కుడితొడపై బుద్ధి దేవత కూర్చొని ఉంటారు. సిద్ధి బుద్ధి దేవతామూర్తులు ఇద్దరుకూడ గణపతి దేవుని శక్తులు మాత్రమే. బుద్ధి దేవత జ్ఞానమును, సిద్ధిదేవత సిద్ధి తత్వంతో కూడిన పరబ్రహ్మ జ్ఞానాన్ని కలుగచేస్తుంది. గణపతిని అర్చిస్తే ఆసనంలో స్థిరంగా కూర్చొనే సిద్ధిని ఇస్తాడు.

## గణపతి శనిదోష నివారణ

31. శనిదోష నివారణకు గణేశ ఆలయానికివెళ్లి గణేశ మంత్రము లేక శ్లోకముతో 27 ప్రదక్షిణలు చేసి గణపతికి 8 గరికలు మరియు ఒక రావి ఆకును సమర్పించాలి. ఇలా గణేశ నవరాత్రుల్లో సమర్పించిన శనిబాధ ఉపశమిస్తుంది. ఇదే సమయాల్లో శనికికూడ 11 ప్రదక్షిణలు ఆచరించాలి.

## వెన్నతో గణపతి అభిషేకం

32. గణపతిని వెన్నతో అభిషేకం చేసినా, వెన్నతో హోమం చేసినా ఫలితాలు అద్భుతంగ ఉంటాయి. భాద్రపద మాసంలో గణపతి నవరాత్రుల్లో అభిషేకాలు, హోమాలు చేసిన విశేషఫలితాన్నిస్తుంది.

## గణపతి-అథర్వశీర్ష మంత్రం-గరికతో అర్చన

33. నిత్యము గణపతిని దవనముతో అర్చనచేసిన కోరిన సంకల్పములు నెరవేరుతాయి. సువాసనగల ఈ దవనముతోను పుష్పములతో పూజించిన కోరిన కోర్కెలు నెరవేరతాయి. అలాగే 12 లేక 16 లేక 32 బుధవారాలు గణపతికి గరికతో చేసిన మాలను సమర్పించి, ఈరోజులలో గణపతి మూలమంత్రంతో 108 ప్రదక్షిణలు చేస్తే విద్యార్థులకు విద్య, స్త్రీలకు వివాహం, సంతానం, వ్యాపారాభివృద్ధి కల్గుతుంది. ఈ ఆరాధన మొత్తం ఉదయం 11 గంటలలోపే జరగాలి. చివరి బుధవారం రోజున గణపతిహోమం గరికతోను, తెల్లజిల్లేడుతోను, (మామూలు రాజు లేక ఎర్ర జిల్లేడైనా) తెల్లనువ్వులతోను, మోదకాలతోను, అటుకులు, పేలాలతో హోమము, ఆవుపాలతో తర్పణం ఇస్తే సర్వకామ్యాలు నెరవేరుతాయి. వీలున్న గణపతి అథర్వశీర్ష్య మంత్రంతో హోమం చేయాలి. గరికమాల సమర్పించే బుధవారాలన్ని రోజుల్లో కొబ్బరినూనెతో దీపం వెలిగించి ఇంట్లో "ఓం గం గణపతయే నమః" మంత్రంతో కనీసం 1008 సార్లు ధ్యానించాలి. నిత్యం ధ్యానిస్తే సిద్ధిని బుద్ధిని, తుష్టిని, పుష్టిని, నాల్గింటిని ప్రసాదిస్తాడని ముద్గలపురాణం తెలుపుతుంది. గణపతికి ఏ జపమైనా సరే 4 లక్షల జపం చేస్తే సిద్ధిపొందుతారట.

## గణపతి-చతుర్థశితో సంబంధం

34. ప్రతిమాసంలో అమావాస్య తర్వాత వచ్చే శుక్లపక్ష సంకటహర చతుర్థినాడు పగలు గణపతిని ఆరాధన చేయాలి. అలాగే పౌర్ణమి తర్వాత

వచ్చే చతుర్థి రోజున రాత్రిపూట గణపతికి పూజచేయాలి. గణపతికి నువ్వులు బెల్లం కల్పిన ఉండలు, మోదుగలు నివేదించాలి. జిల్లేడు పూలతోను, ఎర్రటి పూలతోను పూజచేయాలి. ఉపవాసమున్నవారు రాత్రి నక్షత్ర దర్శనానంత రం భోంచెయ్యాలి. ఆ రోజుంత పవిత్రంగ ఉండాలి.

## గణపతికి వ్యవసాయానికున్న సంబంధం

35. గృహ సమస్యల నివారణకు, వ్యవసాయంలో వచ్చే ప్రతికూల ఫలితాల నివారణకు ఒక మండలముపాటు తెల్ల ఆవాలను "ఓం గం గణపతయే నమః" మంత్రంతోగాని "ఓం హ్రీం గం గణపతయే మమ సకలకార్యసిద్ధి కురు కురు స్వాహా" మంత్రంతో జపించి, జపించిన అనంతరము ఆ తెల్ల ఆవాలను పై మంత్రాన్ని జపిస్తూ వ్యవసాయ భూముల్లోను, గృహంలోను చల్లిన మంచి ఫలితాలు ఇవ్వగలవు. ఒక మండలం చల్లలేనివారు అర్థమండలం అయినా చల్లాలి. గణపతి దేవుని గూర్చి ముద్గల పురాణము, గణేశపురాణం విపులంగ తెలియజేయబడినది.

## గణపతి మూలాధార శక్తి

36. గణపతి మంత్రంలోని 'గం' బీజం మూలాధార తత్వానికి సంబంధించినది. గణపతిని ఆరాధిస్తే కూర్చేనేశక్తి స్థిరశక్తి, విఘ్నాల నివారణ, బుద్ధివికాశము, సిద్ధి కల్గుతుంది. బుద్ధిని, వాక్‌సిద్ధిని స్వామి కలుగచేస్తాడు. ఈ మూలాధార శక్తిని మేలుకొలిపే శక్తి గణపతికి వుంది. స్నానానంతరము గణపతిని ధ్యానించాలి. ముఖ్యంగా గరికతో స్వామిని పూజిస్తే సర్వపాపాలు నశించడమేగాక సంతానము కల్గుతుంది. గరికను ముట్టుకుంటే చాలు సర్వపాపాలు నశిస్తాయని వేదాల చెబుతున్నాయి. "ఓం సహస్ర పరమాదేవి .....దూర్వా దుస్వప్ననాశినీ" అను శ్లోకమే ఈ గరిక గొప్పతనాన్ని తెలియచేస్తున్నది. భూమిపై గరిక పాకినంత దూరము ప్రతి గెనుపునుండి వ్రేళ్లను భూమిలోకి పంపుతుంది. పై శ్లోకంతో గరికను శిరస్సుపై పెట్టుకొంటే దుస్వప్నములు రావు.

## గణపతిని లక్ష్మీదేవిని పూజించే సమయాలు

37. పై పేరాలలో గణపతిని బుధవారం పూజిస్తే శుభాలు కల్గుతవని చెప్పడం జరిగింది. ఉదయం 11 గంటలలోపు గణపతిని పూజించాలని శాస్త్రాలు వచిస్తున్నాయి. గణపతి కూర్చొనే శక్తి, బుద్ధిని, స్థిరత్వాన్ని భక్తునికి

స్తాడు. గణపతిని బుధవారం పూజిస్తే మంచిది. గణపతిని, బుధుని, లక్ష్మీ దేవిని ముగ్గురిని ధ్యానిస్తే శుభాలు కల్గుతాయి. విజ్ఞుల ప్రకారం ఉదయము 9-36 నిమిషాల నుండి (బుధవారం) 10 గంటల వరకు అలాగే మధ్యా హ్నాం 2 గంటల నుండి 3 గంటల వరకు బుధుని, గణపతిని, లక్ష్మిని అర్చిస్తే వ్యాపారస్తులకు శుభఫలితాలు కల్గుతాయి. అట్లాగే ఉదయం 6 నుండి 7 గంటల వరకు బుధహోరాలో కూడ అర్చించాలి. అనగా ఉదయం 6 గంటలనుండి 10 గంటల వరకు గణపతిని, బుధుని, లక్ష్మిని, నారాయ ణుని అర్చించాలి. ఈ సమయాలు అమృతత్వం గలవన్నమాట. పై సమయాల్లో ఏదేని కోర్కెకోరి ఆ కోర్కె నెరవేరాలని పసుపుపూసిన తెల్లగుడ్డలో 21 రూపాయలు, 5 పసుపు కొమ్ములతో మూటకట్టి దేవునిమూలలో, ఉంచి కోర్కె సఫలీకృతం అయితే సమర్పిస్తానని మెక్కుకుంటే కచ్చితంగ నెరవేరు తుంది.

## వినాయకచివితి గోవులకు ఆహారము

38. వినాయకచవితి రోజున తెలగపిండిని గోవులకు తినిపిస్తే సమస్త దోషాలు, రోగాలు ఉపశమిస్తాయట. గోవుపాదాల మధ్య ఈ రోజున అడ్డంగ గోసూక్తం లేక లక్ష్మీ మంత్రము లేక కామధేను మంత్ర శ్లోకమును ధ్యానిస్తూ క్రిందదూరాలి. లక్ష్మినారాయణుల అనుగ్రహము కల్గుతుంది. వినాయక స్వామి భాద్రపద చతుర్ధశినాడు మధ్యాహ్నకాలంలో పార్వతీపరమేశ్వరులకు పుత్రుడుగా జన్మించాడు. గణపతికి ఇష్టమైన సమయము ఉదయము మాత్రము గాన మధ్యాహ్న సమయానగాని, ఉదయకాలానగాని గోవులకు తెలగపిండిని తినిపించి నీటిని అందించిన తర్వాత గోపూజ చేసిన యెడల విఘ్నేశ్వరుని అనుగ్రహము, గోమాత సురభిమాత అనుగ్రహము కల్గును. ఉదయంపూట మాత్రమే గణపతి నారాధించాలని గణేశపురాణం చెబు తున్నది. గోవును ఆరాధించే సమయంలో గోవును గణపతిగా భావించి గణపతి ఏకవింశతి నామాలతో గోమాతను పూజించాలి. ఇదే రోజున కపిల గోవును దూడతోసహా పూజించినా, దానం ఇచ్చినా, 100 సంవత్సర రాల్లో చేసిన సమస్త పాపాలు దహించి వేస్తాయని పురాణాలు తెలియ జేస్తున్నవి.

గణపతి నవరాత్రులను చేయుటలో మహారాష్ట్ర వాసులు ముందుం టారు. మనదేశంలో గణేశ్ ఉత్సవాలు,పూజలు చేయడంలోను, గణేశ్

ఆలయాలున్న ప్రముఖ ప్రాంతాలేవన మహారాష్ట్ర, కేరళ, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలు ముందున్నాయి. ఒక్క కాశీలోనే 56రకాల గణపతులు న్నారు. బ్రహ్మవైవర్తవపురాణం, ముద్గల పురాణం, గణేశపురాణం గణపతి ఖండం, వేదాలు, పురాణాలు గణేశుని గూర్చి విశేషంగ తెలియచేస్తున్నాయి.

## గణేశుని గూర్చి వివరించే గ్రంథాలు

39. గణపతిని గూర్చి గణేశపురాణం, బ్రహ్మపురాణం, వామన పురాణం బ్రహ్మవైవర్తవ పురాణం, అగ్నిపురాణం, స్కందపురాణం, ముద్గల పురాణం శివపురాణం మొదలగు పురాణాలు ఇతర ఉపపురాణాలలో గణేశుని గూర్చి తెలియచేయబడింది. గణేశునిగూర్చి సమస్త విషయాలుపై గ్రంథాలలో సవివరంగా చర్చించబడినవి.

## మంగళవారమున తప్పనిసరిగ కార్యము ప్రారంభించాలని తలచిన తప్పక గణపతిని ఆరాధించాలి

40. సంవత్సరములో ఏ అత్యవసర సమయము మంగళవారాన తప్పనిసరిగా ప్రారంభించాలని అనుకున్నపుడు కుజుణ్ణి ప్రార్థించి, గణపతిని ద్వాత్రింశిక నామాలతో పుష్పాలతో పూజించి (32 నామాలు) సర్వ విఘ్నము లను నివారించి సర్వకార్య జయములు కలుగచేయమని ప్రార్థించి ప్రయా ణాన్ని ప్రారంభించిన కార్యజయము కల్గును.

## విఘ్నాల నివారణకు గణేశుని పూజ

41. తరచుగ విఘ్నాలు ఆటంకాలు ఎదురవుతున్నపుడు శతభిషా నక్షత్ర దినాల్లో విఘ్నేశ్వరుని గరికతో విధి విధానంగా పూజించిన ఆటం కాలు తొలగి అనుకున్న పనులు నెరవేరతాయి. ఈవిధంగ 7 సార్లు చేసేది (7 శతభిషా నక్షత్రదినాలు.)

## మాఘశుద్ధ చతుర్థి అవిఘ్న చతుర్థి

42. మాఘశుద్ధ చతుర్థినాడు ఉపవాసంతో గణేశుని పూజించాలి. అలాగే ఫాల్గుణమాస చతుర్థిని 'అవిఘ్న చతుర్థి' అని అంటారు. ఉపవాసం ఉండి రాత్రికి భోంచేయాలి. సర్వ విఘ్నాలు నశించి తలపెట్టిన కార్యాలు విజయవంతమవుతాయి. అలాగే చైత్రశుద్ధ చతుర్థినాడు దమనక పుష్పము లతో గణపతిని పూజించిన వారికి సుఖము, భోగము కల్గును.

## గణపతివ్రత దినాలు

43. గణపతి వ్రతాలు ఈ క్రింద చెప్పిన సందర్భాలలో మాత్రము ఆచరించాలి. శ్రావణశుద్ధ చవితి శ్రావణ బహుళ చవితి దినాలలో సంకష్ట హర గణపతి వ్రతముచేయాలి. భాద్రపద శుద్ధ చవితినాడు సిద్ధవినాయక వ్రతాన్ని ఆచరించాలి. కార్తీక శుద్ధ చవితినాడు దుర్వాగణపతి వ్రతము చేయాలి. ఫాల్గుణ శుద్ధ చవితినాడు పుత్రగణపతి వ్రతం చేయాలి. మాఘ శుద్ధ చవితినాడు వటగణపతి వ్రతం ఆచరించాలి.

## గణపతికి నైవేద్యాలు

44. గణపతికి 1 చెరుకు గడముక్కలు 2. అరటిపండ్లు 3 ఉండ్రాళ్ల 4 జిల్లేడుకాయలు 5 పేలాలు 6 ఉలవ గుగ్గిళ్లు 7 ఉలవచారు మొదలగు నైవేద్యాలు నివేదన ఇవ్వాలి.

## నవగ్రహాల దోషాన్ని నివారించే గణపతి

45. పసుపు లేక చందనపు చెక్క గణపతిని పూజించిన గురుగ్రహ దోషము, స్పటిక గణపతిని శుక్రవారం పూజించిన శుక్రగ్రహ దోషము, నల్లరాయితో చేసిన గణపతి నర్చించిన శనిగ్రహ దోషము, సాండ్‌స్టోన్ గణపతి విగ్రహాన్ని అర్చించిన రాహుగ్రహ దోషము, శ్వేతార్క గణపతి (తెల్లజిల్లేడు) నర్చించిన కేతుగ్రహ దోషము, గందపుచెక్కతో చేసిన గణపతి నర్చించిన (మంగళవారం) కుజగ్రహదోషము నివారింపబడి, సర్వ విఘ్న ములు తొలగి తాను తలచిన పనులన్నియు నిర్విఘ్నముగా నెరవేరును. ఈ పూజాదినములలో ఏ గ్రహ దోషనివారణకు గణపతి అర్చన చేస్తారో, ఆ గ్రహ ప్రదక్షిణలు చేసిన ఫలితం అమోఘంగ ఉంటుంది.

## వ్రత,నోము దీక్షలో స్త్రీలు / పురుషులు పాటించాల్సిన నియమాలు

1. సూర్యోదయం కాకుండానే లేద్రలేవాలి.

2. సూర్యాస్తమయం కానిదే నడుం వాల్చరాదు.

3. గడపమీద కూర్చోవడం, నిలబడడం, తలపట్టుకొని ఉండడం చేయరాదు.

4. గడపకు ఇవతల నిలబడి అవతలవాళ్లకు ఏమీ ఇవ్వరాదు. తీసుకోరాదు.

5. ఇంటిముందు ముగ్గు లేకుండా ఉండరాదు. (పిత్రుతిథినాడుతప్ప)

6. గోళ్లు కొరుక్కో కూడదు.

7. కూర్చొన్నపుడు పాదాలుముట్టుకోరాదు.

8. తూర్పువైపుకు నిలబడి తలదువ్వుకోరాదు.

9. తలకునూనె రాయరాదు. తలదువ్వుకోకూడదు.

10. జుట్టువిరబోసుకొని తిరగరాదు.పువ్వులేని తలతో ఉండరాదు.

11. పూజ,వ్రతము,నోము అయ్యేదాకా ఎంగిలి పడరాదు.

12. రాత్రిపూట పెరుగు తినరాదు. మజ్జిగమాత్రం త్రాగాలి.

13. ఇతరులచేతిమీదుగా ఇనుము,ఉప్పు,నూనె అందుకోరాదు.

14. స్నానానంతరం పొయ్యి వెలిగించాలి. శుక్రవారం ఇల్లుదాటి పోరాదు.

15. ఇంటికి వచ్చిన కన్యలకుగాని, ముత్తైదువులకుగాని బొట్టు పెట్టాలి.

16. మంగళవారం మౌనంగా ఉండడం మంచిది.

17. శని,ఆది,మంగళవారాలు నూతన వస్తువులుపయోగించరాదు.

18. నేలపడక తప్పనిసరి.

19. చెడుమాటలు వినవద్దు, మాటలాడవద్దు.

20. పరాయి ఇంటి భోజనం పనికిరాదు.

21. భగవన్నామంతో మేలుకున్నంతవరకు ధ్యానిస్తుండాలి.

22. ఈ సమయాలలో దక్షిణ తాంబూలాదులు, దానాలు చేయాలి.

23. వ్రత దీక్షకాలంలో తల్లిదండ్రుల, గురువులకు, సూర్యచంద్రులకు, పితరులకు రోజు నమస్కరించాలి.

## విష్ణువే పుత్రుడుగ జన్మించే అదృష్టము కలుగచేసే గణపతి అర్చన

## (బ్రహ్మవైవర్తవ పురాణము)

సంతానవంతులు కావల్సిన దంపతులు సత్ సంకల్పంతో 120 రోజులపాటు లక్ష్మీగణపతిని విధి విధానంతో అర్చిస్తే తప్పక సంతానం కల్గుతుందని బ్రహ్మవైవర్తవపురాణం చెప్పినది. విష్ణువంశ పుత్రుడు కావాలని దంపతులు సంకల్పముచేసి లక్ష్మీగణపతి మంత్రమైన "అగజానన

పద్మార్కం....ఏకదంతముపాస్మహే ! (మంత్రశ్లోకము) శ్లోకాన్ని నియమ నిష్టలతో భక్తిశ్రద్ధలతో 120 రోజులపాటు ఏకభుక్తంతో నేలపడక మైలభోజనము, పరాయివారి భోజనాలు పనికిరావు. రెండుపూటలా స్నానమాచరించి ప్రతిపూట 1008 సార్లు జపించాలి. (రాత్రి సంధ్యకు సంఖ్యనియమంలేదు) ఈ 120 రోజులకాలములో వచ్చు చతుర్ధశలలోను, బుధవారాలలోను, హస్తా నక్షత్రంనాడు విశేషంగ గణపతిని అర్చించాలి. (ఈ పర్వదినాలలో కుడుములు నివేదించాలి.) ఈ 120 రోజులలోను గణపతిని గరికతో అర్చించాలి. 120 రోజుల అనంతరము స్వయంభూ గణపతి దేవాలయ దర్శనము, నిద్రచేయాలి. సత్ సంతానము, విష్ణుభక్తుడైన బిడ్డ కల్గుతాడు. సంతానముతోటి ఆయుః ఆరోగ్యం ఐశ్వర్యము, సిద్ధి, బుద్ధి, పాడిపంటలు, పశువృద్ధి కల్గుటేగాక శరీరములోని మూలాదారశక్తిని మేల్కొలుపుతాడు గణపతి. 120 రోజులలో జపం చేసిన సంఖ్యకు పదవవంతు తర్పణము, ఇందు 10వ వంతు హోమము (తులసి తప్ప అన్ని దేవతా వృక్ష సమిధలు వాడవలె.) ఇందు పదవవంతు బ్రాహ్మణ భోజనము పెట్టవలె. మంత్రసిద్ధితో బాటు, సంతానము, సర్వ సౌఖ్యాలు కల్గును.

## సంతాన గణపతి స్తోత్రం (కుమారుడి కొరకు)

నమోస్తు గణనాథాయ సిద్ధిబుద్ధియుతాయ చ ।
సర్వప్రదాయ దేవాయ పుత్రవృద్ధి ప్రదాయ చ ॥ 1

గురూదరాయ గురవే గోప్త్రే గుహ్యాసితాయ తే ।
గోప్యాయ గోపితాశేషభువనాయ చిదాత్మనే ॥ 2

విశ్వమూలాయ భవ్యాయ విశ్వసృష్టికరాయ తే ।
నమో నమస్తే సత్యాయ సత్యపూర్ణాయ శుండినే ॥ 3

ఏకదంతాయ శుద్ధాయ సుముఖాయ నమో నమః।
ప్రసన్న జనపాలాయ ప్రణతార్తివినాశినే ॥ 4

శరణం భవ దేవేశ సంతతిం సుదృఢాం కురు ।
భవిష్యంతి చ యే పుత్రా మత్కులే గణనాయక ॥ 5

తే సర్వే తవ పూజార్థం నిరతాః స్యుర్వరో మతః ।
పుత్ర ప్రదమిదం స్తోత్రం సర్వసిద్ధి ప్రదాయకమ్ ॥ 6

విధానము : ఈ సంతాన గణపతి స్తోత్రమును భక్తితో ప్రతిరోజు చదువు వారికి గణపతి కృపవలన పుత్ర సంతతి కలుగును. అంతేగాక

సమస్త సిద్ధులు లభించును. నిత్యము 54 సార్లు ధ్యానించాలి.

## లక్ష్మీప్రాప్తికి గణేశ స్తోత్రం

శ్లో॥ ఓం నమో విఘ్నరాజాయ సర్వసౌఖ్య ప్రదాయినే ।
దుష్టారిష్ట వినాశాయ పరాయ పరమాత్మనే ॥
లంబోదరం మహావీర్యం నాగయజ్ఞోపవీతినం ।
అర్ధచంద్రధరం దేవం విఘ్న వ్యూహ వినాశనం ।
ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హేరంబాయ నమోనమః
సర్వసిద్ధి ప్రదోసి త్వం సిద్ధి ప్రదోభవ ॥
చింతితార్థ ప్రదస్త్వంహి సతతం మోదక ప్రియః ।
సిందూరారారుణ వస్త్రైశ్చ పూజితో వరదాయకః॥

విధానము : ఈ గణపతి స్తోత్రమును భక్తిభావముతో చదివెడి వ్యక్తి యింట లక్ష్మీదేవి నివసించును. అతని దేహమును, యింటిని లక్ష్మీదేవి విడచిపెట్టదు.

## గణేశాష్టకమ్

ఈ గణపతి అష్టకమును చదువువారు సమస్త విఘ్నములు తొలగి పోయినవారై కార్యసిద్ధిని పొందుదురు. సమస్త పాపములు తొలగిపోయి అనంతరము రుద్రలోకమునకేగుదురు.

**ఏకదంతం మహాకాయం తప్తకాంచన సన్నిభమ్**
**లంబోదరం విశాలాక్షం వందేహం గణనాయకమ్ 1**
**మౌంజీకృష్ణాజినధరం నాగయజ్ఞోపవీతినమ్**
**బాలేందు శకలం మౌళౌ వందేహం గణనాయకమ్ 2**
**చిత్రరత్న విచిత్రాంగం చిత్రమాలా విభూషితమ్**
**కామరూపధరం దేవం వందేహం గణనాయకమ్ 3**
**గజవక్త్రం సురశ్రేష్ఠం కర్ణచామర భూషితమ్**
**పాశాంకుశధరం దేవం వందేఽహం గణనాయకమ్ 4**
**మూషికోత్తమ మారూహ్య దేవాసుర మహాహవే**
**యోద్ధుకామం మహావీర్యం వందేహం గణనాయకమ్ 5**
**యక్షకిన్నర గంధర్వ సిద్ధ విద్యాధరై స్సదా**
**స్తూయమానం మహాబాహుం వందేహం గణనాయకమ్ 6**

**అంబికా హృదయానందం మాతృభిః పరివేష్టితమ్**
**భక్తప్రియం మదోన్మత్తం వందేహం గణనాయకమ్ 7**
**సర్వవిఘ్నహరం దేవం సర్వవిఘ్న వివర్జితమ్**
**సర్వసిద్ధి ప్రదాతారం వందేఽహం గణనాయకమ్ 8**
**గణాష్టకమిదం పుణ్యం యఃపఠేత్ సతతం నరః**
**సిద్ధ్యంతి సర్వకార్యాణి విద్యావాన్ ధనవాన్ భవేత్ ॥ 9**

## ఐశ్వర్యప్రద గణాధిప పంచరత్న స్తోత్రం

శ్లో॥ సరాగి లోకదుర్లభం విరాగిలోకపూజితం
సురాసురైర్న మస్కృతం జ్వరాది మృత్యునాశనం।
గిరాగురుం శ్రియాహరిం జయంతి యత్పదార్చకా
నమామి తం గణాధిపం కృపానమః పయోనిధిం ॥ 1

శ్లో॥ గిరీంద్రజాముఖాంభుజ ప్రమోద దానభాస్కరం
కరీంద్ర వక్త్ర మానతాఘ సంఘవారణోద్యతం ।
సరీసృపేశ బద్ధకుక్షి మాశ్రయామి సంతతం
శరీరకాంతి నిర్జితాబ్జ బంధుబాల సంతతిం ॥ 2

శ్లో॥ శుకాది మౌని వందితం గకార వాచ్య మక్షరం
ప్రకామి మిష్టదాయినం సకామ నమ్ర పంక్తయే ।
చకాసినం చతుర్భుజైర్వి కాసి పద్మపూజితం
ప్రకాశతాత్మ తత్త్వకం నమామ్యహం గణాధిపం ॥ 3

శ్లో॥ వరాధిత్య దాయకం స్వరాదిలోక దాయకం
జ్వరాది రోగవారకం నిరాకృతాసుర వ్రజం।
కరాంబుజైర్ధరన్ వికారశూన్య మానస్హైర్హృదా
సదా విభావితం ముదానభూమి విఘ్నపం భజే ॥ 4

శ్లో॥ శ్రమాపనోదనక్షమం సమాహితాంతరాత్మనం
సమాధిభిస్సదార్చితం క్షమానిధిం గణాధిపం
రమాధవాది పూజితం యమాంతకాత్మ సంభవం
శమాదిషడ్గుణ ప్రదం నమామి తం విభూతయే ॥ 5

విధానము : ఈ గణాధిప పంచక స్తోత్రము మానవులకు అభీష్ట వస్తువును యిచ్చునట్టిదియై యున్నది. నమస్కారపూర్వకముగ ప్రసన్నతతో

దీనిని చదివెడి వ్యక్తి దీర్ఘాయువును, అధికమైన సిరిసంపదలను పొందుదురు. ఇందులో సంశయము లేదు.

### విఘ్నములు రాకుండుటకు, జగద్వశీకరణకు గణపతి ద్వాదశ నామావళి

శ్లో॥ గణపతి విఘ్నరాజోలంబతుండో గజాననః।
ద్వైమాతురశ్చ హేరంబో ఏకదంతో గణాధిపః ।
వినాయక శూర్పకర్ణః విశుపాలో భవాత్మజః॥

విధానం : గణపతియొక్క పై పన్నెండు నామములను ప్రతిరోజూ ఉదయము చదువుచుండు వానికి సమస్త జగత్తువశమై యుండును. ఎన్నడూ ఏ విఘ్న బాధయురాదు.

## గణేశ కవచ స్తోత్రం

**వినాయకః శిఖాం పాతు పరమాత్మా పరాత్పరః**
**అతిసుందర కాయస్తు మస్తకం సుమహోత్కటః 1**

**లలాటం కాశ్యపః పాతు భ్రూయుగ్మంతు మహోదరః**
**నయనే ఫాలచంద్రస్తు గజాస్యస్త్వోష్ఠపల్లవౌ॥ 2**
**జిహ్వాం పాతు గజక్రీడ, చుబుకం గిరిజాసుతః**
**వాచం వినాయకః పాతు దంతాన్ రక్షతు విఘ్నహా॥ 3**

**శ్రవణౌ పాశపాణిస్తు, నాసికాం చింతితార్థదః**
**గణేశస్తు ముఖం కంఠం పాతుదేవో గణాధిపః॥ 4**

**స్కంధౌపాతు గజస్కంధస్తనే విఘ్ననాశనః।**
**హృదయం గణనాథస్తు హేరమ్బో జఠరంమహాన్॥ 5**

**ధరాధరః పాతు పార్శ్వౌ, పృష్ఠం విఘ్నహరః శుభః**
**లింగం గుహ్యం సదాపాతువక్రతుండోమహాబలః॥ 6**

**గజక్రీడోజానుజంఘే, ఊరూ మంగళకీర్తిమాన్**
**ఏకదంతో మహాబుద్ధిః పాదౌ గుల్ఫౌసదావతు॥ 7**

**క్షిప్రప్రసాదనో బాహూపాణీహ్యా శాస్త్రపూరకః ।**
**అంగులీశ్చనఖాన్పాతు పద్మహస్తోఽరినాశనః॥ 8**

సర్వాంగాణి మయూరేశో విశ్వవ్యాపీ సదావతు
అనుక్తమపి యత్స్థానం ధూమకేతుః సదావతు॥ **9**

ఆమోదస్త్వగ్రతుః పాతు ప్రమోదః పృష్ఠతోఽవతు
ప్రాచ్యాం రక్షతు బుద్ధీశః ఆగ్నేయాం సిద్ధిదాయకః॥ **10**
దక్షిణస్యాముమాపుత్రో నైఋత్యాంతు గణేశ్వరః।
ప్రతీచ్యాం విఘ్నహర్తాఽవ్యాద్వాయవ్యాం గజకర్ణకః **11**

కౌబేర్యాం నిధిపః పాతురీశాన్యాం ఈశనందనః
దివాఽత్యాదేకదంతస్తురాత్రౌ సంధ్యాసు విఘ్నహృత్ **12**

రాక్షసాసురభేతాళ గ్రహభూత పిశాచతః
పాశాంకుశధరః పాతురజస్సత్త్వ తమః స్మృతీః **13**

జ్ఞానం ధర్మంచ లక్ష్మీంచ లజ్జాం కీర్తిం తథాకులమ్
వపుర్ధనంచ ధాన్యం చ గృహం దారాన్ సుతాన్సఖీన్ **14**

సర్వాయుధ దరఃపౌత్రాన్ మయూరేశోఽవతాత్సదా
కపిలోఽజావికంపాతు గజాశ్వాన్వికటోఽవతు **15**

## శ్రీ వరసిద్ధి వినాయక సుప్రభాతమ్

శ్రీగౌరిసుప్రజాదేవ ! పూర్వాసంధ్యాప్రవర్తతే ఉత్తిష్ఠగజవక్త్రాథ్య! కర్తవ్యం భక్తరక్షణమ్॥
ఉత్తిష్ఠోత్తిష్ఠలోకేశ ఉత్తిష్ఠగణనాయక! ఉత్తిష్ఠజగదాధార! త్రైలోక్యం మంగళంకురు॥
శ్రీబాహుదా వరతటీసువిశాల తీరే శ్రీ నారికేళ వనదీప్త విమానమధ్యే।
దేవాదిదేవ పరిపూజిత దివ్యమూర్తే శ్రీకాణిపాక గణనాయక! సుప్రభాతమ్॥
ప్రాచీదిశి ద్యుమణి భానుప్రపుల్ల పద్మాః పద్మాకర మదుపమంజుల రావతూర్యైః।
తేమంగళాహమభితః సమపూర్ణయంవీతి శ్రీకాణిపాక గణనాయక! సుప్రభాతమ్॥
కూపోద్భవత్వ విమల ప్రభవాభిరూప దివ్యప్రభావ సముపేత ప్రసన్నమూర్తే।
భక్తార్తినాశ ! పరిలిప్త విభూ గాత్ర శ్రీకాణిపాక గణనాయక! సుప్రభాతమ్ ॥
దేవేంద్ర ముఖ్యదిగధీశది పూజితాంఘ్రే శ్రీనారదాది మునిసేవిత భవ్యపాద।
శ్రీపార్వతీశ ముఖపద్మ దివాకరాభ శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
నిత్యాభిషేక పరివర్ధిత దివ్యగాత్ర నానావిధార్చన విభూతి విశోభితాంఘ్రే ।
భక్తానురక్త పరిపాలన పారిజాత శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥

దేవాధిదేవ గణనాయక! పుణ్యమూర్తే మూకాంధ బాధిర జనార్తి హరప్రస్న
నిత్యార్చితాఖిల నివేదన పూర్ణతృప్త శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
శ్రీస్వామిపుష్కరిణి కామల వారి మధ్యే ఆస్నానమాత్ర విదళీకృత భక్తవైర।
దివ్యప్రమాణ నిలయేశ! దిగంత వాసిన్ । శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
మహాత్మ్య మాత్ర వివశీకృత భక్తసంగ ధ్యానాత్ హఠాత్ హృతసమస్త జనాఘసంఘ।
నిత్యప్రవృద్ధ వర పుణ్యతల ప్రసంగ శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
శ్రీనారికేళ కదళీక్షుక స్థితచూత జంబూబిసామలక శ్రీబదరీ ప్రియాస్య।
నాగేంద్ర వక్త్ర సమలంకృత నాగబంధ శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
ప్రత్యబ్ధవర్తిత మహోత్సవ భోగభాగ్య నానావిధాభరణ భూషిత దివ్యగాత్ర।
చిత్రాతి దివ్యతర వాహనవైభవేథ్య శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
లోకాతిభీకర తర త్రిపురాసురాఖ్యాన్ హంతుంమహోత్సుకతరోప్యభవో భవంతమ్।
సంపూజ్య నిర్జిత రిపుస్సమభూత్సురారిఃశ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
ఆదౌసురాసురగణై రభిమధ్యమానే క్షీరార్ణవే గరళ మభ్యుదితే తిఘోరే ।
'స్వామిన్ క్షమస్వ' కృపయోత్యభిపూజితోసి శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
ఘోరాట వీవరతలే తరుపర్ణకుట్యామ్ సీతాం వినాక్షుభిత చిత్తరఘూద్వహేణ।
శ్రీరామచంద్ర విభువా పరిపూజితో సి శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
విద్యాదిభిన్నతర సార్ధక దివ్యనామ విభ్రాజిరూప! గజవక్త్ర! ప్రసన్నమూర్తే।
పాపాఘభంజక! తుషార సువర్ణదేహ శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
సోమావలోకఫలితేన చతుర్థికాలే లోకాపవాద భయభీత నార్దనేన !
ఆదౌత్వ మర్చితవతో సి కథం నునౌమి శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
శ్రీబాదరాయణ హృదంతర సన్నివిష్ట వేదాంతవేద్య! సుపురాణ గణాభిలేఖిన్।
విద్యాస్వరూప! నిగమాంత మహాప్రభావ! శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
మచీశమీ బదరికా తులసీసుసింధువారార్క దూర్వకరవీరక దేవదారు।
చూతాది పత్రవర పుష్పచయాభిపూజ్య! శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
శ్రీశూర్పకర్ణ! సుమనోహర! కుబ్జరూప! లంబోదరాఢ్య! గజవక్త్ర! అరాళతుంథ
పాశాంకుశాత్త వరదా భయహస్తముద్ర! శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
శ్రీబాలభక్తతరుణ ద్విజశక్తి వీర ఉచ్ఛిష్ట నృత్య వరసిద్ధి మహాఖ్యలక్ష్మి!
హేరంబ! క్షిప్ర! విజయోర్ధ్వ! దివ్యరూప శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥

ఓంకార మంగళకర!ప్రణవస్వరూప! హేమోదకప్రియ!మనోహర వక్రతుండ!
షాణ్మాతురాగ్రజ! శివప్రియ! మూషికేశ శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
ఆధారమూల నిలయాఖిల మంత్రతంత్రశాస్త్రస్వరూప! నిగమాంత నితాంతకీర్తే!
శ్వేతార్కవాస! వటురూపక! సత్యధర్మ! శ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
గంగాది దివ్యతటినీ వరతీర్థ కుంభాః సౌరభ్య నిర్భర మహత్తర గంధమాల్యాః
ద్వారే తవార్చన రతాశ్చ వసంతి విప్రాఃశ్రీకాణిపాక వినాయక ! సుప్రభాతమ్ ॥
శ్రీకాణిపాగ్గణ పతేరిహ సుప్రభాతమ్ యేమానవాః ప్రతిదినం పఠితుంప్రవృత్తాః।
తేషామభీష్టవరదో జయభోగ భాగ్యమాయుర్విశోకపరబుద్ధిగణాన్ ప్రసూతే॥

ఆ విధంగా రాబోయే కాలానికి అనుగుణంగా ఊహించి 'వరసిద్ధి వినాయక సుప్రభాతం'తో మేలుకొలిపారు దేవేంద్రాదులు.

అంతట భక్తసులభుడైన వరసిద్ధి వినాయకుడు ఆ నూతిలోని జలం మధ్యన దివ్య శిలా విగ్రహరూపాన దేవతలకి దర్శనమిచ్చాడు. ఆనాటినుండి దేవతలు తరచుగా విహారపురికి వచ్చి వరసిద్ధి వినాయకుడిని దర్శించి పూజించి వెళుతుండే వారు. ఇలా చాలాకాలం జరిగాక, ఇలా దేవతలు ఆ ప్రాంతానికి వచ్చి స్వామిని దర్శించి, పూజించి వెళ్తున్న విషయం, శంఖుడు, లిఖితుడు అనే అన్నదమ్ములకు తెలిసింది.

## సమస్తమైన బాధలను పోగొట్టి అన్నివిధములైన సుఖములను ప్రసాదించి వైకుంఠప్రాప్తిని కల్గించే మహామహిమాన్వితమైన గణేశ కవచము

శ్లో॥ సంసార మోహనస్యాస్య కవచస్య ప్రజాపతిః।
ఋషిశ్ఛందశ్చ బృహతీదేవో లంబోదరం స్వయం ॥
ధర్మార్థ కామ మోక్షేషు వినియోగః ప్రకీర్తితః।
సర్వేషాం కవచానాంచ సారభూత మిదంమునే
ఓం గం హుం శ్రీగణేశాయ స్వాహా మే పాతు మస్తకం
ద్వాంత్రింశదక్షరో మంత్రో లలాటో మే సదావతు
ఓం హ్రీం క్లీం శ్రీగమతి వై సతతం పాతులోచనం ॥
తాలుకం పాతు విఘ్నేశః సతతం ధరణీతలే ।
ఓం హ్రీం శ్రీం క్లీమితి పరం సతతం పాతు నాసికాం ।
ఓం గ్లౌం గం శూర్పకర్ణాయ స్వాహా పాత్వధరం మమ ॥

దంతాశ్చ తాలుకాం జిహ్వాం పాతుఃమే షోడశాక్షరః
ఓం లం శ్రీం లంబోదరాయేతి స్వాహా గండం సదావతు ।
ఓం క్లీం హ్రీం విఘ్ననాశాయ స్వాహా కర్ణం సదావతు ॥
ఓం శ్రీం గం గజాననాయేతి స్వాహా స్కంధం సదావతు ॥
ఓం హ్రీం వినాయకాయేతి స్వాహా పృష్టం సదావతు ।
ఓం క్లీం హ్రీమితి కంకాలం పాతు వక్షస్థలంచ గం ॥
ఓం హ్రీం వినాయకాయేతి స్వాహా పృష్టం సదావతు ।
ఓం క్లీం హ్రీమితి కంకాలం పాతు వక్షస్థలంచ గం ।
కరౌపదౌ సదాపాతు సర్వాంగం విఘ్న నిఘ్నకృత్ ।
ప్రాచ్యాం లంబోదరః పాతు చాగ్నేయాం విఘ్ననాయకః
దక్షిణే పాతు విఘ్నేశో నైరుత్యాంతు గజాననః॥
పశ్చిమే పార్వతీపుత్రో వాయువ్యాం శంకరాత్మజః॥
కృష్ణస్యాంశ్చోత్తరే చ పరిపూర్ణత మశ్యచ ॥
ఈశాన్య మేకదంతశ్చ హేరంబః పాతుచోర్ధ్వతః
అథోగణాధిపః పాతు సర్వపూజ్యశ్చ సర్వతః॥
స్వప్నే జాగరణేచైవ పాహిమాం యోగినాం గురుః॥
ఇతితే కథితంవత్స సర్వ మంత్రౌఘ విగ్రహం ।
సంసార మోహనం నామ కవచం పరమాద్భుతం ।
శ్రీకృష్ణేన పురాదత్తం గోలోకే రాసముండలే ।
బృందావనే వినీతాయ మహ్యాం దినకరాత్మజ ॥
మయాదత్తంచ తుల్యంచ యస్మై కస్మైన దాస్యసి ।
పరం పరం సర్వపూజ్యం సర్వసంకట దారణం
గురుమభ్యర్చ్య విధివత్ కవచం ధారయేత్తుయః॥
కంఠేవా దక్షిణేబాహౌ సోపి విఘ్నర్న సంశయః॥
అశ్వమేధ సహస్రాణి వాజపేయి శతానిచ
గ్రహేంద్ర వేవచాంసాస్య కలాం నార్హంతిషోడశీం
ఇదం కవచమజ్ఞాత్వా యో భజేచ్ఛంకరాత్మజం
శతలక్ష ప్రజాప్తేపి న మంత్రః సిద్ధిదాయకః

విధానము : విష్ణు భగవానునిచే చెప్పబడిన ఈ గణేశ కవచము 10లక్షలసార్లు పారాయణ చేసినచో సిద్ధి లభించును. సిద్ధిపొందిన సాధకుడు

మృత్యుంజయుడు, వాగ్మి, చిరంజీవి విజయుడు పూజనీయుడగును. భూత ప్రేత పిశాచాలు దరిచేరవు. శారీరక, మానసిక వ్యాధులు, శోకాలు స్పర్శింప జాలవు. జీవిత చివరికాలాన వైకుంఠప్రాప్తి కల్గును.

## శంకర భగవత్పాదులు రచించిన గణపతి ప్రార్థన

ముదాకరాత్తమోదకం సదా విముక్తి సాధకం।
కళాధరావతంసకం విలాస లోకరక్షకం।
అనాయకైకనాయకం వినాశి తేభ దైత్యకం
నతాశుభాశు నాయకం నమామి తం వినాయకమ్॥ 1
నతేతరాతి భీకరం నవోది తార్క భాస్వరం ।
సమత్సురారి నిర్ఘరం నతాధి కాప దుద్ధరం ।
సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం ।
మహేశ్వరం త మాశ్రయే పరాత్పరం నిరంతరమ్॥ 2
సమస్తలోక శంకరం నిరస్తదైత్య కుంజరం।
దరేత రోదరం వరం వరేభ వక్త్రం మక్షరం।
కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం ।
మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్॥ 3
అకించ నార్తి మార్జనం చిరంత నోక్తిభాజనం ।
పురారి పూర్వనందనం సురారి గర్వ చర్వణం।
ప్రపంచనాశ భీషణం ధనంజయాది భూషణం
కపోల దాన వారణం భజే పురాణవారణమ్ 4
నితాంత కాంత దంత కాంతిమంత కాంతకాత్మజం
అచింత్య రూపమంత హీనమంతరాయ కృంతనమ్
హృదంతరే నిరంతర వసంత మేవ యోగినాం
తమేకదంత మేవతం విచింతయామి సంతతమ్ 5
మహాగణేశ పంచరత్న మాదరేణయోన్వహం
ప్రజల్పతి ప్రభాతకే హృదిస్మరన్ గణేశ్వరమ్
అరోగతా మదోపతాం సుసాహితీం సుపుత్ర తాం
సమాహితాయ రష్టభూతి మభ్యుపైతి సోచిరాత్ 6

## గణేశ ప్రాతః స్మరణం

ప్రాతఃస్మరామి గణనాథ మనాథ బంధుం ।
సింధూరపూర పరిశోభిత గండయుగ్మం।
ఉద్దండ విఘ్నపరిఖండన చండదండం।
అఖండలాది సురనాయక బృందవంద్యమ్॥ 1
ప్రాతర్నమామి చతురానన వంద్యమాన।
ఇచ్ఛానుకూల మఖిలం చ వరం దదానం।
తం తుందిలం ద్విరస నాధిప యజ్ఞ సూత్రం ।
పుత్రం విలాస చతురం శివయోః శివాయ॥ 2
ప్రాతర్భజామ్య భయదం ఖలు భక్తశోక।
దావానలం గణవిభుం వర కుంజరాస్యం ।
అజ్ఞాన కానన వినాశన హవ్యవాహం।
ఉత్సాహ వర్ధన మహం సుత మీశ్వరస్య॥ 3
శ్లోకత్రయ మిదం పుణ్యం సదా సామ్రాజ్యదాయకం।
ప్రాత రుత్థాయ సతతం యః పఠేత్ప్రయతః పుమాన్॥ 4

## గణేశ ప్రార్థన

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే ॥
అగజానన పద్మార్కం గజానన మహర్నిశం।
అనేక దంతం భక్తానాం ఏకదంత ముపాస్మహే ॥
మౌంజీకృష్ణాజినధరం నాగయజ్ఞోపవీతినమ్।
బాలేందు శకలం మౌళీం వందేహం గణనాయకమ్ ॥
చిత్రరత్న విచిత్రాంగం చిత్రమాలా విభూషితమ్।
కామరూపధరం దేవం వందేహం గణనాయకమ్॥
ఏకదంతం మహాకాయం తప్తకాంచన సన్నిభమ్ ।
లంబోదరం విశాలాక్షం వందేహం గణనాయకమ్॥

## గణేశ నామాని

సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః
ధూమ కేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః
వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబ స్కంద పూర్వజః
షోడశైతాని నామాని యఃపఠే చ్ఛృణుయాదపి
విద్యారంభే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే ॥

## శ్రీ గణేశాష్టకమ్

గణపతి పరివారం చారు కేయూరహారం
గిరిదరవరసారం యోగినీ చక్రచారమ్ ।
భవభయ పరిహారం దుఃఖదారిద్ర్య దూరం
గణపతి మభివందే వక్రతుండావతారమ్ ॥
అఖిలమల వినాశం పాణినా హస్తపాశం
కనకగిరి నికాశం సూర్యకోటి ప్రకాశమ్ ।
భజ భవగిరినాశం మాలతీ తీరవాసం
గణపతి మభివందే మానసే రాజహంసమ్ ॥
వివిధ మణిమయూఖైః శోభమానం విదూరైః
కనకరచిత చిత్రం కంఠదేశే విచిత్రమ్ ।
దధతి విమలహారం సర్వదా యత్నసారం
గణపతి మభివందే వక్రతుండావతరామ్ ॥
దురితగజ మమందం వారుణీం చైవ వేదం
విదిత మఖిలనాదం నృత్య మానందకందమ్ ।
దధతి శశి సువక్త్రం చాంకుశం యో విశేషం
గణపతి మభివందే సర్వదానంద కందమ్ ॥
త్రినయనయుత ఫాలే శోభమానే విశాలే
మకుట మణి సుధాలే మౌక్తికానాం చ జాలే ।
ధవల కుసుమ మాలే యస్యశీర్ష్ణః సతాలే
గణపతి మభివందే సర్వదా చక్రపాణిమ్ ॥

వపుషి మహతి రూపం పీఠమాదౌ సుదీపం
త దుపరిరసకోణం యస్య చోర్ధ్వం త్రికోణమ్ ।
గజమితదల పద్మ సంస్థితం చారు ఛద్మం
గణపతి మభివందే కల్పవృక్షస్యవృందే ॥
వరదవిశద శస్తం దక్షిణం యస్య హస్తం
సదయ మభయదం తం చింతయే చిత్త సంస్థమ్ ।
శబల కుటిల శుణ్డం చైకతుణ్డం ద్వితుణ్డం
గణపతి మభివందే సర్వదా వక్రతుండమ్ ॥
కల్పద్రుమాధః స్థిత కామధేనుం
చింతామణిం దక్షిణపాణి శుణ్డం ।
బిభ్రాణ మత్యద్భుత చిత్రరూపం
యః పూజయే త్తస్య సమస్త సిద్ధిః॥

## ఋణ హర్తృ గణేశ స్తోత్రం

కైలాసే పర్వతే రమ్యే శంభుం చంద్రార్ధ శేఖరం ।
షడామ్నాయ సమాయుక్తం పప్రచ్ఛ నగ కన్యకా ॥
దేవేశ పరమేశాన సర్వశాస్త్రార్థ పారగ ।
ఉపాయమృణనాశస్య కృపయా వద సాంప్రతమ్ ॥
సమ్యక్పృష్టం త్వయా భద్రేలోకానాం హితకామ్యయా।
తత్సర్వం సంప్రవక్షామి సావధానా వధారయ॥

అస్యశ్రీ ఋణహర్తృ గణపతి స్తోత్ర మంత్రస్య । సదాశివ ఋషిః। అనుష్టుప్ఛందః। శ్రీ ఋణహర్తృ గణపతి ర్దేవతా । గౌం బీజం। గం శక్తిః। గోం కీలకం।సకల ఋణనాశనే వినియోగః। శ్రీ గణేశ । ఋణం ఛింది। వరేణ్యం। హుం నమః। ఫట్ ఇతి కరహృదయాదిన్యాసః॥

సృష్ట్యాదౌ బ్రహ్మణా సమ్యక్ పూజితః ఫలసిద్ధయేః
సదైవ పార్వతీ పుత్రః ఋణనాశం కరోతు మే ॥
త్రిపురస్య వధాత్పూర్వం శంభునా సమ్యగర్చితః
సదైవ పార్వతీపుత్రః ఋణ నాశం కరోతు మే॥
హిరణ్యకశ్యప స్వాధీనాం వధార్థే విష్ణునార్చితః
సదైవ పార్వతీపుత్రః ఋణ నాశం కరోతు మే॥

మహిషస్య వధే దేవ్యా గణనాథః ప్రపూజితః ।
సదైవ పార్వతీపుత్రః ఋణ నాశం కరోతు మే॥
తారకస్య వధాత్పూర్వ్యం కుమారేణ ప్రపూజితః ।
సదైవ పార్వతీపుత్రః ఋణ నాశం కరోతు మే॥
భాస్కరేణు గణేశోహి పూజితశ్చ విశుద్ధ యేః
సదైవ పార్వతీపుత్రః ఋణ నాశం కరోతు మే॥
శశినా కాంతి వృద్ధ్యర్థం పూజితో గణనాయకః।
సదైవ పార్వతీపుత్రః ఋణ నాశం కరోతు మే॥
పాలనాయచ తపసాం విశ్వామిత్రేణ పూజితః
సదైవ పార్వతీపుత్రః ఋణ నాశం కరోతు మే॥
ఇదం త్వృణహరం స్తోత్రం తీవ్రదారిద్ర్యనాశనం।
ఏకవారం పఠేన్నిత్యం వర్షమేకం సమాహితః॥
దారిద్ర్యం దారుణం త్యక్త్వా కుబేర సమతాం వ్రజేత్ ।
పదంతోయం మహామంత్రః సార్ధ పంచదశాక్షరః ॥
శ్రీగణేశ ఋణం ఛింది వరేణ్యం హుం నమః ఫట్ ।
ఇమం మంత్రం పఠేదంతే తతశ్చ శుచి భావనః ।
ఏకవింశతి సంఖ్యాభిః పురశ్చరణ మీరితమ్ ।
సహస్రావర్తనా త్సమ్యక్షణ్మాసం ప్రియతాం వ్రజేత్ ॥
బృహస్పతి నమో జ్ఞానే ధనే ధనపతిర్భవేత్ ॥
అస్యైవాయుత సంఖ్యాభిః పురశ్చరణ మీరితమ్ ।
లక్షమావర్తనా త్సమ్య గ్వాంఛితం ఫలమాప్నుయాత్ ।
భూత ప్రేత పిశాచానాం నావనం స్మృతి మాత్రతః॥

విధానము : ఈ గణేశ స్తోత్రమును నిత్యము 11 సార్లునుండి 27 సార్లు స్తోత్రం చేయాలి. తదుపరి ఋణహర్తృ గణపతి మంత్రాన్ని 1008 లేక 504 సార్లు ధ్యానించిన సకల ఋణాల నుండి విముక్తికాగలరు. 48 రోజులు చేసిన తర్వాత నువ్వులు, గరికతో, తాటిబెల్లం, చెరకుముక్కలతో హోమం చేయాలి. ఫలాలు మీ చెంతకు వచ్చి వాలుతాయి.

## గణేశ కవచమ్

ఏషోఽతిచపలో దైత్యాన్ బాల్యేపి నాశయత్యహో ।
అగ్రే కిం కర్మ కర్తేతి నజానే మునిసత్తమ॥ 1

దైత్యా నానావిధా దుష్టా సాధుదేవ ద్రుమః ఖలాః
అతోఽస్యకంఠే కించిత్త్వం రక్షాంసం బద్ధుమర్హసి॥ 2

ధ్యాయే త్సింహగతం వినాయక మముందిగ్బాహుమాద్యేయుగే
త్రేతాయాంతు మయూరవాహనమముంషడ్బాహుకంసిద్ధిదమ్॥
ద్వాపరేతు గజాననం యుగభుజం రక్తాంగరాగం విభుమ్
తుర్యేతు ద్విభుజం సితాంగ రుచిరం సర్వార్థదం సర్వదా॥ 3

వినాయకః శిఖాంపాతు పరమాత్మా పరాత్పరః।
అతిసుందరకాయస్తు మస్తకం సుమహోత్కటః॥ 4

లలాటం కాశ్యపః పాతు భ్రూయుగంతు మహోదరః
నయనే ఫాలచంద్రస్తు గజాస్యస్త్వోష్ఠపల్లవౌ॥ 5
జిహ్వాం పాతు గజక్రీడ, శ్చుబుకం గిరిజాసుతః
వాచం వినాయకః పాతు దంతాన్ రక్షతు విఘ్నహా॥ 6

శ్రవణౌ పాశపాణిస్తు, నాసికాం చింతితార్థదః
గణేశస్తు ముఖం కంఠం పాతుదేవో గణాధిపః॥ 7

స్కంధౌపాతు గజస్కంధస్తనే విఘ్ననాశనః।
హృదయం గణనాథస్తు హేరమ్బో జఠరంమహాన్॥ 8

ధరాధరః పాతు పార్శ్వౌ, పృష్ఠం విఘ్నహరః శుభః
లింగం గుహ్యం సదాపాతువక్రతుండోమహాబలః॥ 9

గజక్రీడోజానుజంఘే, ఊరూ మంగళకీర్తిమాన్
ఏకదంతో మహాబుద్ధిః పాదౌ గుల్ఫౌసదావతు॥ 10

క్షిప్రప్రసాదనో బాహూపాణీ ఆశాప్రపూరకః।
అంగులీశ్చనఖాన్పాతు పద్మహస్తోఽరినాశనః॥ 11

సర్వాంగాని మయూరేశో విశ్వవ్యాపీ సదావతు
అనుక్తమపి యత్స్థానం ధూమకేతుః సదావతు॥ 12

ఆమోదస్త్వగ్రతః పాతు ప్రమోదః పృష్ఠతోఽవతు
ప్రాచ్యాం రక్షతు బుద్ధీశః ఆగ్నేయాం సిద్ధిదాయకః॥ 13
దక్షిణస్యాముమాపుత్రో నైఋత్యాంతు గణేశ్వరః।
ప్రతీచ్యాం విఘ్నహర్తాఽవ్యాద్వాయవ్యాం గజకర్ణకః 14

కౌబేర్యాం నిధిపః పాతురీశాన్యాం ఈశనందనః
దివాఽవ్యాదేకదంతస్తురాత్రౌ సంధ్యాను విఘ్నహృత్ 15

రాక్షసాసురభేతాళ గ్రహభూత పిశాచతః
పాశాంకుశధరః పాతురజస్సత్త్వ తమః స్మృతీః 16

జ్ఞానం ధర్మంచ లక్ష్మీంచ లజ్జాం కీర్తిం తథాకులమ్
వపుర్ధనంచ ధాన్యం చ గృహం దారాన్ సుతాన్సఖీన్17

సర్వాయుధ దరఃపౌత్రాన్ మయూరేశోఽవతాత్సదా
కపిలోఽజావికంపాతు గజాశ్వాన్వికటోఽవతు 18

భూర్జపత్రే లిఖిత్వేదం యః కంఠే ధారయేత్సుధీః
న భయం జాయతే తస్య యక్షరక్షః పిశాచతః 19

త్రిసంధ్యం జపతే యస్తు వజ్రసార తనుర్భవేత్
యాత్రాకాలే పఠేద్యస్తు నిర్విఘ్నేన ఫలం లభేత్ ॥ 20

యుద్ధకాలే పఠేద్యస్తు విజయం చాప్నుయా ద్ధ్రువమ్
మారణోచ్చాటనాకర్షస్తంభమోహన కర్మణి॥ 21
సప్తవారం జపేదేతద్దినానా మేకవింశతిమ్
తత్తత్ఫల మవాప్నోతి సాధకో నాత్ర సంశయః॥ 22

ఏకవింశతి వారం చ పఠేత్తావద్దినాని యః
కారాగృహగతం సద్యోరాజ్ఞా వధ్యంచ మోచయేత్॥ 23

రాజదర్శన వేళాయాం పఠేదేత త్త్రివారతః
సరాజానం వశం నీత్వా ప్రకృతీశ్చ సభాంజయేత్॥ 24

ఇదం గణేశ కవచం కశ్యపేవ సమీరితమ్
ముద్గలాయ చ తేనాథ మాండవ్యాయ మహర్షయే॥ 25

**మహ్యాం సప్రాహ కృపయా కవచం సర్వసిద్ధిదమ్**
**న దేయం భక్తిహీనాయ దేయం శ్రద్ధావతే శుభమ్॥ 26**

**అనేనాస్య కృతా రక్షాన చాధాస్య భవేత్క్వచిత్**
**రాక్షసాసుర భేతాళ దైత్యదానవ సంభవా॥ 27**

**ఇతి శ్రీగణేశ పురాణే ఉత్తరఖండే శ్రీ గణేశ కవచమ్ సంపూర్ణం**

విధానము : మహర్షులచే ప్రవచింపబడిన ఈ పారాయణ చేస్తున్న సర్వకామదాలు నెరవేరుతాయి. శరీరము నాశ్రయించియున్న కామక్రోధ మోహ మధ మాశ్చర్యములు నశిస్తవి. శరీర రుగ్మతులన్నీ నాశనమవుతాయి. విద్యా ఉద్యోగ ఐశ్వర్యములు వాటంతటవే అవి ఉపాసన చేసే వ్యక్తిని ఆశ్రయిస్తారు. సర్వారిష్టాలు నశిస్తవి.సర్వాభీష్టాలు నెరవేరతవి.

## కుటుంబములోని వారు ఒకరిపట్ల మరొకరు ప్రేమతో వుండుటకు గణపతి స్తోత్రం

శ్లో॥ సువర్ణవర్ణ సుందరం సితైకదంత బంధురం
గృహీత పాశకాంకుశం వరప్రదా భయప్రదం ।
చతుర్భుజం త్రిలోచన భుజంగ మోపవీతనం
ప్రఫుల్లవారి జాసనం భజామి । సింధురాననమ్ ॥

శ్లో॥ కిరీట హారకుండలం ప్రదీప్తబాహు భూషణం
ప్రచండరత్న కంకణం ప్రశోభితాంఘ్రి యష్టికం ।
ప్రభాత సూర్య సుందరాంబరద్వయ ప్రధారిణం
సరత్న హేమ నూపుర ప్రశోభితాంఘ్రి పంకజం ॥

శ్లో॥ సువర్ణ దండమండిత ప్రచండ చారు చామరం
గృహ ప్రదేందు సుందరం యుగక్షణ ప్రమోదితం ।
కవీంద్ర చిత్తరంజకం మహావిపత్తి భంజకం
షడక్షర స్వరూపిణం భజే గజేంద్ర రూపిణమ్ ॥

శ్లో॥ విరించి విష్ణువందితం విరూప లోచనం శుభం
గిరీశ దర్శనేచ్ఛయా సమర్పితం పరాంబయా ।

నిరంతరం సురాసురైః సపుత్ర వామలోచనైః
మహామఖేష్ట కర్మసు స్మృతం భజామితుందిలమ్ ॥

శ్లో॥ మదౌఘలుబ్ధ చంచలాలి మంజు గంజితారవం
ప్రలుబ్ధ చిత్తరంజకం ప్రమోదకర్ణ చాలకం ।
అనన్య భక్తిమానవం ప్రచండ ముక్తిదాయకం
నమామి నిత్యమాదరేణ వక్రతుండ నాయకమ్ ॥

విధానము : భార్యా భర్తలు, బిడ్డలుగాని, తల్లిదండ్రులుగాని నిత్యము 27 సార్లు గణపతిని స్తోత్రంతో ప్రార్థించిన ఒకరిపట్ల ఒకరు ప్రేమాభిమానాలతో ఉందురు. ఆయుః ఆరోగ్య ఐశ్వర్యాలతోటి ఉండడమేగాక మోక్షప్రాప్తి నొందగలరు.

## వివిధ గణపతులు-అర్చనా ఫలితములు
## నవగ్రహ దోషనివారణ అర్చించవలసిన దినములు

| గణపతిపేరు | ఫలితములు | నవగ్రహంపేరు | వారములు |
|---|---|---|---|
| 1. స్టన్‌స్టోన్‌గణపతి | అనారోగ్యమునకు | సూర్యగ్రహము | ఆదివారము |
| 2. ముత్యపుగణపతి | మానసికప్రశాంతతకు | చంద్ర గ్రహము | సోమవారము |
| 3. పగడపు గణపతి | ఋణబాధలు తొలగును | కుజ గ్రహము | మంగళవారము |
| 4. మరకతగణపతి (గ్రీన్ ఎమరాల్డ్‌గణపతి) | వ్యాపారాభివృద్ధి | బుధ గ్రహము | బుధవారము |
| 5. గంధపుచెక్క గణపతి బంగారపుపూత గణపతి | మంచి ఉద్యోగము గౌరవ ప్రతిష్టలు | గురు గ్రహము | గురు వారము |
| 6. స్పటిక గణపతి | భార్యాపిల్లలతోసుఖజీవనం | శుక్రగ్రహము | శుక్రవారము |
| 7. నల్లరాతితోచేసినగణపతి | అధికముగా కష్టపడకుండుట | శనిగ్రహము | శనివారము |
| 8. సాండ్ స్టోన్ | పీడించబడకుండుటకు | రాహుగ్రహహు | ఆదివారము రాహుకాలంలో |
| 9. శ్వేతార్కగణపతి (తెల్లజిల్లేడుగణపతి) | విఘ్నములు తొలగిపోవుటకు | కేతు గ్రహము | మంగళవారము |

## దూర్వాయుగ్మ పూజ

గరిక పోచలతో చేయవలెను. శ్రీవరసిద్ధి వినాయకాయ నమః
ఓం గణాధిపాయ నమః – దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం ఉమాపుత్రాయ నమః – దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం ఆఖువాహనాయ నమః– దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం వినాయకాయ నమః– దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం ఈశపుత్రాయనమః– దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం సర్వసిద్ధిప్రదాయకాయ నమః– దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం ఏకదంతాయ నమః– దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం ఇభవక్త్రాయ నమః – దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం మూసికవాహనాయ నమః– దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం కుమారగురవే నమః– దూర్వాయుగ్మం సమర్పయామి
ఓం వరసిద్ధి వినాయకాయనమః– దూర్వాయుగ్మం సమర్పయామి
దశాంగం గుగ్గులోపేతం సుగంధం సమర్పయామి.

## విభాగము - 4

## శ్రీలక్ష్మీగణపతి సృష్టి, మరియు చరిత్ర గూర్చిన వివరాలు

### వివిధ గణపతులు వారి భార్యలు

శివపురాణం : శివపురాణం ప్రకారం గణపతుల పేర్లు వారి భార్యల పేర్లు 21 అని తెలియుచున్నది. అవి 1 ఏకదంత గణపతి–సిద్ధి 2 వికట గణపతి–జ్ఞానదేవి 3 శుక్లగణపతి–బుద్ధిలక్ష్మి 4 విష్ణుగణపతి–ప్రజాదేవి 5 లక్ష్మీప్రదగణపతి–వరలక్ష్మి 6 లంబోదర గణపతి–సిద్ధివిద్య 7 లక్ష్మీగణపతి–చంద్రముఖి 10 ధూమ్రగణపతి–సిద్ధిలక్ష్మి 11 చింతామణి గణపతి–విజయలక్ష్మి 12 భద్రగణపతి–లోకమాత 13 సువర్ణగణపతి–రజతాదేవి 14 సిద్ధిగణపతి–సిద్ధిబుద్ధి 15 కృష్ణగణపతి–సువర్ణదేవి 16 గణాధిపతి–శాంతాదేవి 17 నింబగణపతి–బుద్ధిలక్ష్మి 18 వక్రతుండ గణపతి–నవరత్నలక్ష్మి 19 రక్తవర్ణగణపతి–పద్మాదేవి 20 ఋణ విమోచన గణపతి–సౌభాగ్యలక్ష్మి 21 సర్వాంబర గణపతి–సంమారదేవి.

శివపురాణం ప్రకారం వినాయకుని భార్యలైన సిద్ధి–బుద్ధిలకు క్షేమము, లాభము అనే సంతానము కలిగినట్లుగా తెలియుచున్నది.

## శిల్పశాస్త్రం

శిల్పశాస్త్రం ప్రకారం గణపతుల సంఖ్య 32 అని తెలియుచున్నది. అవి 1 బాలగణపతి 2 తరుణగణపతి 3 భక్తగణపతి 4 వీరగణపతి 5 శక్తిగణపతి 6 ద్విజగణపతి 7 సిద్ధగణపతి 8 ఉచ్ఛిష్ఠ గణపతి 9 విఘ్న గణపతి 10 క్షిప్రగణపతి 11 హేరంబగణపతి 12 లక్ష్మీగణపతి 13 మహాగణపతి 14 విజయగణపతి 15 నృత్యగణపతి 16 ఊర్ధ్వగణపతి 17 ఏకాక్షర గణపతి 18 వరగణపతి 19 త్రక్షర గణపతి 20 క్షిప్రదాయక గణపతి 21 హరిద్రాగణపతి 22 ఏకదంత గణపతి 23 సృష్టి గణపతి 24 ఉద్దండ గణపతి 25 రుణవిమోచక గణపతి 26 దుండిగణపతి 27 ద్విముఖ గణపతి 28 త్రిముఖ గణపతి 29 సింహగణపతి 30 యోగ గణపతి 31 దుర్గాగణపతి 32 సంకటహర గణపతి

## స్త్రీ రూపం

దేవీ సహస్రనామంలో ఉన్న వెయ్యిపేర్లలో వైనాయకి, లంబోదరి, గణేశ్వరి ఉండగా స్కందపురాణంలో గణేశుని గురించి చెప్పబడింది. ఇవి అన్నియునూ గణపతియొక్క స్త్రీరూపం పేర్లు అని తెలియుచున్నది.

## విశిష్ట లేఖకుడు

కౌరవ-పాండవుల నిర్యాణము జరిగిన తర్వాత వేదవ్యాసుడు ధ్యానంలోకి వెళ్ళాడు. అతని మనోఫలకంమీద మహాభారతం ప్రతిబింబించింది. ఆయన శ్లోకాలను చెబుతుంటే వాటిని వెంట వెంటనే తప్పులు లేకుండా వ్రాయడానికి ఒక లేఖకుడు కావలసి వచ్చింది. ఈ విషయం గురించి ఆయన బ్రహ్మదేవుడితో ప్రస్తావిస్తే బ్రహ్మ, గణేశుని పేరును సూచించాడు. కావ్యరచన సాగేటప్పుడు ఒక్కసారి కూడా వ్రాయడం ఆపకుండా ఉండాలనే షరతుమీద గణేశుడు వ్రాయడానికి ఒప్పుకున్నాడు. అయితే చెప్పే శ్లోకాలను ముందు అర్థం చేసుకున్న తరువాతే వ్రాయలని వేదవ్యాసుడు కూడా ఆంక్షవిధించాడు. గణేశుడు అందుకు అంగీకరించాడు. ఈ అంగీకారం వేదవ్యాసుడికి ఎంతో ఉపయోగపడింది. అతిక్లిష్టమైన శ్లోకాలను సైతం నిర్ణీత వ్యవధిలోపే వేదవ్యాసుని మనోగత భావాలు ఏమాత్రం మారకుండా గణేశుడు వ్రాయగలిగాడు. వినాయకుని పండుగ చిన్నా, పెద్దా అందరికీ పండుగే.

## దేవతలకు గణపతికి శ్రావణమాసంలో పవిత్రారోపణం

పవిత్రం అంటే దర్భ అని అర్థము. ఈ దర్భ నవగ్రహాలలో కేతువుకు సంబందించినది. సమస్త పర, అపర కర్మలందు ఈ దర్భలను ఉపయోగిస్తారు. శ్రాద్ధకర్మలందు, తర్పణ క్రియలందు అలాగే పవిత్ర కర్మలందు ఈ దర్భలను వాడతారు. గ్రహణ కాలములందు నీటిని ఆహార పదార్థాల శుద్ధికొరకు వాడతారు. శ్రావణమాసంలో దేవతలకు ఈ దర్భలతో పవిత్రారోపణము చేస్తారు. శ్రావణ మాసములో చతుర్ధశి, త్రయోదశి, ఏకాదశి, ద్వాదశి దినాలలో దర్భలకు 11 లేక 8 ముడులు దర్భలకు వేసి దేవతలకర్పిస్తారు. ఈ ముడులు వేసిన దర్భ పవిత్రారోపణలను దేవతల మెడలో వేస్తారు. గణపతికి చవితి, చతుర్ధశి, బుధవారము, హస్త నక్షత్ర దినాలలో 21 దర్భలతో 21 ముడులువేసి స్వామికి లంబోదరం క్రిందకు వచ్చేటట్లు వేసి పూజ చేస్తారు. ఇదేవిదంగ సూర్యభగవానునికి 12 ముడులు, సుబ్రహ్మణ్యునికి 11 ముడులు, ఆంజనేయునికి 14 ముడులు, కేతుగ్రహానికి 7 ముడులు, మహావిష్ణువుకు 8 ముడులు లేక అంతకన్నా ఎక్కువ ముడులు అలాగే నృసింహస్వామికి శ్రీరామునకు, శ్రీకృష్ణపరమాత్మ పరమ శివునకు (11 ముడులు) దత్తాత్రేయునక, ఇతర దేవతలకు శ్రావణ మాసంలో పవిత్రారోపణం గావించి పూజలు చేయాలి. స్మృతులు, పురాణాలు, వేదాలు, శాస్త్రములు దర్భల పవిత్రతను గూర్చి వేనోళ్ల కొనియాడాయి. సర్వదోషాలను సర్వక్రిములను, తొలగించి జలాన్ని, పదార్థాలను శుద్ధిచేస్తాయి ఈ దర్భలు. అందుకే దర్భలు పరమ పవిత్రం అంటారు.

## సృష్టి క్రమము – గణపతి

యుగయుగాలుగా సృష్టి స్థితి లయములు జరుగుతున్నాయి. ప్రతి కల్పాంతరములోనూ ప్రళయం సంభవించి ప్రపంచం యావత్తూ నామ రూపాలు లేకుండా నశిస్తున్నది. ఇలా నశించిపోవడాన్ని 'లయం' అంటారు.

'లయం' అంటే.....

జీవి ఎక్కడనించి సృష్టించబడిందో దానిలో కల్సిపోవడం, అంటే 'అణువు' 'పరమాణువు'లో కల్సి 'పరమాణువు' అయిపోవడం, విశదంగా చెప్పాలంటే 'జీవి'కి మృత్యువు సంభవించినప్పుడు జీవిలోని ప్రాణం వాయువులో కల్సిపోయి వాయువుగా మారిపోతుంది. జీవుని ఉష్ణోగ్రత అనే వేడి

బయల్వెడలి అగ్నిరూపకమైన సూర్యునిలో కల్సిపోతుంది. ఇలా పంచభూతాత్మకమైన జీవి దేహంలోనించి వాయువు, అగ్ని, ఆకాశం వెడలిపోగా మిగిలిన దేహంలో వున్న జలం ప్రతిరూపమైన మజ్జ మూత్రములు ఆవిరిగా మారి జలమందు కల్సి జలరూపం పొందగా చివరిదైన దేహం మట్టిలో కల్సి మట్టిగా మారిపోతుంది.

ఇలా పంచభూతాత్మకమైన జగత్తులో పంచభూత సమ్మిళితమైన జీవులు పుట్టి, పెరిగి చివరికి ఆ పంచభూతాల్లో కల్సిపోయి వాటిరూపం పొందు తున్నాయి.

ఇది సృష్టిక్రమము...మట్టి, నీరు, నిప్పు, వాయువు, ఆకాశం యీ పంచభూతములు కలయికయే జగత్తు. ఈ జగత్తుల జన్మించే చరాచర జీవులన్నీ యీ పంచభూతాల కలయిక వల్ల దేహరూపాలు పొంది జగత్తులో చరించి మరణానంతరం ఎక్కడ్నించి వచ్చాయో అక్కడికి చేరిపోయి మూల స్థితిని పొందుతాయి. ఇది నిరంతర చక్ర భ్రమణం.

పుట్టుక...వృద్ధి...లయము ఒకదాని వెనుక మరొకటి జరిగే ఈ భ్రమణంలో కోట్లాదియుగాలు జరిగిపోయాయి. అయితే యీ సృష్టిస్థితి లయములకు ఆధారమెవరు ? సమస్త సృష్టి ఎక్కడనించి ఉత్పత్తి అవుతున్నది ? ఎలా వృద్ధి చెందుతున్నది ? ఎవరిలో లయం అవుతున్నది ?

ఆ మూలాధారం గురించి తెల్సుకోవాలంటే సృష్టికి పూర్వం వున్నదెవరో తెలియాలి. ఏదైనా ఒక వస్తువు లేదా పదార్థం ఉన్నప్పుడే దాని ఉనికి తెలుస్తుంది. ఉదాహరణకి 'ఆకాశం' అనేది ఉండి కన్పిస్తోంది. కాబట్టి దాని ఉనికిని బట్టి దానికి 'ఆకాశం' అనే పదార్థంగా గుర్తించాము. ఒకవేళ అక్కడ ఆకాశం అనేది లేకపోతే అక్కడ ఏం వుంటుంది ? ఏమీవుండదు 'శూన్యం.'

కనుక ఈ జగత్తు సృష్టించబడకముంద, యీ భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం సృష్టించబడకముందు వాటి స్థానాల్లో ఏం ఉన్నది ? ఏమీ లేదు. శూన్యం. ఎలాంటి రూపములేని శూన్యమే నిరాకార, నిర్వికార, సచ్చిదానంద పరబ్రహ్మము.

శూన్యమునకు, రూపము లేనిదానికి, ఉనికి లేనిదానికి, 'పరబ్రహ్మము' అని గుర్తింపు నివ్వడం హాస్యాస్పదం అనిపిస్తోంది కదూ...! నిజమే కానీ ఒక సత్యం యిప్పుడు తెల్సుకోవాలి.

'వాయువు' కంటికి కనిపించదు. కానీ మరణం సంభవించగానే ప్రాణం పోయింది' అంటారు. మనస్సు కంటికి కనిపించదు. కానీ మనస్సు బాగా లేదు. అని బాధ పడతారు.

ఇలాగే ప్రేమ, వాత్సల్యం, ద్వేషం, క్రోధం అనేవి కూడా కంటికి కనిపించవు. జీవుడిలో వున్న 'ఆత్మ–అంతరాత్మ' కూడా కంటికి కనిపించవు. వీటికి రూపం లేదు. ఆకారం లేదు. ఇట్లే, వీటిని సృష్టించిన భగవంతుడికి కూడా రూపం లేదు. ఆకారం లేదు. కనుక శూన్యాన్ని పరబ్రహ్మము అని గుర్తించడం సహజమే.

రూపంలేని మనస్సు జీవిని ఎలా చలింపజేస్తుందో అలాగే రూపంలేని బ్రహ్మం శూన్యంలో పదార్థాన్ని సృష్టించగలడు. కంటికి కనిపించని మనస్సు ఎలా భావావేశాలని కలిగిస్తుందో అలాగే కనిపించని భగవంతుడు కూడా భావావేశాలు సృష్టించ గలడు. ఆలోచించగలడు. అస్థిత్వాన్ని నిరూపించ గలడు. ఆ సత్యాన్ని చాటడానికి, ఋజువు చెయ్యడానికి నిరాకారమైన శూన్యం తప్ప మరో ప్రాణి ఏదీ లేదు.

నిరాకారుడైన తాను విలాసంగా ఆడుకోడానికి పదార్థాన్ని సృష్టించాలని తలపోశాడు భగవంతుడు. అలాంటి ఆలోచన రాగానే ముందుగా 'వాయువు'ని సృష్టించాలని సంకల్పించాడు. సంకల్పించడమే తడవుగా శూన్యంలో వాయువు వీచసాగింది. అంటే ఆకారంలేని శూన్య బ్రహ్మము నుండి వాయువు పుట్టింది. అది మామూలుగా ఉద్భవించలేదు. భయంకరమైన శబ్దం చేస్తూ జంఝామారుతంలా ఉద్భవించింది వాయువు. శూన్యముగా నున్న బ్రహ్మము నుండి పుట్టింది కనుక వాయువు కూడా బ్రహ్మమే.

వాయువు పెద్ద శబ్దం చేస్తూ పుట్టింది. ఆ శబ్దం....

'ఓం ...ఓం...' అంటూ ధ్వనితరంగాలను ప్రసరింపసాగింది. ఆ ధ్వని గాలి ఊదితే మృదువుగా మధురంగా పలికే వేణునాదంలా వుంది. 'ఓం...ఓం...' అని రమ్యంగా వినవస్తున్న ఆ 'ఓంకారాన్ని' విజ్ఞులు నాదబ్రహ్మ అని శబ్దబ్రహ్మ అని పేర్కొన్నారు.

అలా పుట్టిన ఓంకార నాదం వేదగానంలా రమ్యంగా శబ్దతరంగాలను వ్యాపింపజేస్తుండగా, ఆ శబ్దాన్ని మోసుకువెళ్తున్న వాయువు క్రమక్రమంగా శూన్యాన్నంతటినీ వాయువుతో నింపసాగింది. శూన్యం యావత్తూ వాయువు మయమై పోతే సృష్టికి చోటుండదు.

అందుకే పరబ్రహ్మము అనే శూన్యము నుండి ఆకాశము పుట్టింది. పుట్టుకతోటే వాయువుకి పయనించే స్వభావం, ఆకాశానికి ప్రతిఘటించే స్వభావం స్వతఃసిద్ధంగా వచ్చాయి. అందుచేత పయనిస్తున్న వాయువు తనని దాటి పైకి పోకుండా ఆకాశము ప్రతిఘటించసాగింది. వీటి సహజ ప్రవృత్తుల వల్లనే ఆకాశాన్ని దాటి అంతరిక్షంలో ప్రవేశించే ప్రాణికి ప్రాణ వాయువు లభించదు. (నాటినుంచీ నేటివరకూ యిదే పరిస్థితి కొనసాగు తోంది. అందుకే నేడు ఇతర గ్రహాల్లో ప్రాణవాయువు లభించడంలేదు.)

ఇలా వాయువూ, ఆకాశమూ వేల సంవత్సరాలపాటు ఘర్షణ పడ్డాయి. రెండు శక్తుల మధ్య జరిగిన సుదీర్ఘ రాపిడిలోంచి మెరుపు పుట్టింది. అదే 'అగ్ని.'

'అగ్ని'కి పుట్టుకతోటే ప్రకాశించే స్వభావం వుంది. అందుచేత అగ్ని పుట్టుకతో దాని ప్రకాశం వల్ల శూన్యమంతా తేజోవంతమైంది.

ఇలా అగ్ని, వాయువు, ఆకాశము ఉత్పత్తి అయి తమ ఉనికి కోసం, తమ తమ ఆధిక్యతల కోసం నిరంతరం ఒకదానితో ఒకటి ఘర్షణ పడగా.. పడగా...మేఘము ఏర్పడి అది జలముగా మారింది. ఆ జలం ప్రళయంలా ఉధృతం చెంది అంతవరకూ శూన్యంగా వున్నదంతా జలంతో నిండిపో సాగింది. ప్రవహించే స్వభావం గల జలాన్ని నిరోధించగల శక్తి వాయువు, అగ్ని, ఆకాశములకు లేకపోయింది.

అయితే – వీస్తున్న వాయువులోంచి, మెరుపులు మెరిపిస్తున్న అగ్నిలోంచి, ప్రతిఘటిస్తున్న ఆకాశం లోంచి, ఇప్పుడు ప్రవహిస్తున్న జల తరంగాల్లోంచి ఒకే నాదం విన్పిస్తోంది. అదే 'ఓం ....ఓం' ఓంకార నాదం.

అలా కొన్ని వేల సంవత్సరాల పాటు ఆ శబ్దనాదం ప్రతిధ్వనించింది. అంతట జగత్తును, జీవజలాన్ని సృష్టించాలని సంకల్పించాడు భగవంతుడు. అప్పటివరకూ నిరాకారుడైన భగవంతుడినించి వాయువు, ఆకాశం, అగ్ని, జలము సృష్టించబడ్డాయి. ఇక జగత్ సృష్టికోసం 'తనని తానే' సృజించు కోదల్చుకున్నాడు భగవంతుడు. మరుక్షణమే 'అణువు అంత సూక్ష్మరూపం' ధరించి ఆకాశాన్నించి జారి నీటిలో పడ్డాడు.

అణువంత సూక్ష్మరూపం ధరించి ఆకాశాన్నించి జారి నీటిలో పడ్డాడు. 'ప్రాణం' కలిగినది కాబట్టి అది ప్రాణి. స్వయంభువై, అయోనిజుడై అవత

రించిన ఆ ప్రాణి నీటిలోపడి, నీటిపై తేలుతూ, నీటి ప్రవాహ ఉధృతికి మునిగిపోయే పరిస్థితి నించి తనని తాను కాపాడుకోవడానికి, తన సంకల్పం చేత ఒక వటపత్రం సృష్టించింది. నీటిపై తేలుతూ వచ్చిన ఆ వటపత్రం మీదకి చేరింది ప్రాకి. పైన ఆకాశము క్రింద జలము, ఆకాశంలో మెరుపు వెలుగుల్లో అగ్ని ప్రకాశం, నీటి ప్రవాహానికి తోడైన వాయువు ఆ నాలుగు శక్తుల మధ్య వటపత్రం పైన 'శయనించిన' ఆ ప్రాణిని వటపత్రశాయి అన్నారు.

ఆ నాలుగు శక్తులు ఓంకార ధ్వనులతో జోలపాట ఆలపిస్తూంటే వటపత్రం అని అభివర్ణించారు విజ్ఞులు.

యోగనిద్రలో వటపత్రం మీద శయనించిన ఆ 'ప్రాణి' చాలా సూక్ష్మంగా పాలనురుగు వంటి తెల్లని మేనిఛాయతో వుంది. ఆ వటపత్రం మీద చిన్న నలుసులా వున్న ఆ జీవిని పరీక్షగా దివ్యదృష్టితో చూస్తే తొండము లాగా వుంది. మెలికలు తిరిగిపడుతున్న వానపాములా వుంది.

అది, సృష్టికోసం ఆకృతి దాల్చిన తొలిప్రాణి.

తల్లిదండ్రుల సంపర్కం లేకుండా తనకు తానుగా, 'అయోనిజ' గా ఆకృతి దాల్చిన భగవంతుడైన పరబ్రహ్మము యొక్క ఆత్మ.

ఆ ఆత్మ నుంచి పరమాత్మ, ఆ పరమాత్మనించి జగత్సృష్టి జరగ నున్నది. ఆ జగత్తుకి స్వాగతం పలకడానికా అన్నట్లు వాయువు, ఆకాశం, అగ్ని, జలములు తమ తమ శక్తుల ధ్వనులతో 'ఓంకార' నాదాన్ని మరింత ఉధృతంగా ఆలపించసాగాయి.

ఆ గానామృతం వేలసంవత్సరాలపాటు అలా సాగగా...సాగగా... ఎట్టకేలకి పరబ్రహ్మము యోగనిద్ర చాలించాడు. తాను వటపత్రముపై పవళించి వున్నట్లు, ఆ వటపత్రము 'మహాజలము'పై తేలుతున్నట్లు గ్రహించాడు. అంతేకాదు, తాను సంకల్పమాత్రం చేత సృజించిన ఆకాశము, జలము, అగ్ని, వాయువులు వాటి సహజ లక్షణాలని ప్రదర్శిస్తూ ఒకదానిపై మరొకటి ఆధిపత్యము కోసం ప్రయత్నిస్తున్నట్లు గ్రహించాడు. వాటికి అలాంటి ఆధిపత్య యోచన ఎలా కలిగింది ?

పరబ్రహ్మమునకు విషయం అర్థమైంది.

తాను యోగనిద్రలో వుండగా...'ప్రాణి'గా తననించి విసర్జించిన వాయువునించి మూడు అదృశ్యగుణాలు ఉద్భవించాయి. అవే సత్త్వము, రజము, తమము. ఈ త్రిగుణముల యొక్క మూలతత్వముల ప్రేరణ చేతనే ఆకాశము, అగ్ని, వాయు, జలములు ఆధిపత్యంకోసం పోరాడుకుం టున్నాయి, అంటే.. తాను సృజించబోయే జగత్తులోని చరాచర జీవులన్నీ ఆధిపత్యపోరుకు సిద్ధపడే లక్షణాలు. గుణాలతోనే సృష్టించబడాలి. అప్పుడే తనకి వినోదం.

అలాంటి వినోదాన్ని పొందడం కోసమే 'నిరాకారుడైన తాను' సాకార రూపం ధరించి జగత్తు సృజించబోతున్నాడు. సరి ఇప్పుడు జగత్తుని ఎక్కడ, ఎలా సృజించాలి. ఒకప్పుడు శూన్యంగా వున్నదంతా ఇప్పుడు నాలుగు శక్తులతో నిండిపోయింది. వాటిని అదుపలో పెట్టి వాటిని భరించగల శక్తి కావాలి. భరించగల శక్తి...భూమి.'

'భూమికి' చోటు కల్పించాలి. అలా నిశ్చయించగానే పరబ్రహ్మము సూక్ష్మరూపములో వున్న తొండమును ప్రోత్సహించాడు. మరుక్షణం ఆ తొండము తనచుట్టూ వున్న మహాజలమును 'పీల్చడం' మొదలుపెట్టింది. తొండము జలమును తనలోకి లాక్కుంటే ఖాళీ అవుతున్న ఆ ప్రదేశములో ఆ ప్రాణి ఆకృతి పెరగసాగింది. తొండము జలముతో ఉబ్బి ఉబ్బి...తన ఆకృతిని విపరీతముగా పెంచుకుంటూ అగ్ని,వాయువు, ఆకాశములను దాటి అనంతకోటి బ్రహ్మాండమంత ఆకారమై సాకారమై ఓంకారమే తనచే సృజించబడిన ఆకాశముకంటే పది అడుగుల ఆధిక్యతను కలిగి మహాతేజ స్సుతో ప్రకాశించసాగింది.

ఆ మహాపురుష, విశ్వవిరాట్ స్వరూప ఆకృతిని గాంచగానే వాయువు, అగ్ని, ఆకాశము భయంతో భీతిల్లి తమ ఉధృతిని, ఆధిపత్యపోరుని తగ్గించు కొని వినయ విధేయతలను ప్రదర్శించాయి.

అలా అగ్ని, వాయువు, ఆకాశములు తమ ప్రతాపాలను ఉపసంహ రించుకోగా 'మహాజలము' పూర్తిగా ఆ విరాట్ స్వరూపుని దేహంలోకి పీల్చి వెయ్యబడింది.

ఆ 'మహాజలము' నిండిపోయిన ప్రాంత ఉదరముగా ఆ ప్రాణి మధ్య భాగమందు లంబోదరముగా అవతరించింది. మహా ఉదరము కలిగినవాడు గనక అతనిని లంబోదరుడు అన్నారు.

అంతట ఆ లంబోదరుడు నుండి మాలిన్యము అనగా మట్టి బయటికి వచ్చి క్రిందికి జారిపోసాగింది. ఆ మట్టి ఉండ నిలబడడానికి ఆధారము ఏదీ లేదని గ్రహించిన లంబోదరుడు అంతకుముందు తాను త్రాగిన మహా జలమును బైటికి విడిచిపెట్టాడు. అంతవరకూ విశ్వవిరాట్ పురుషుని దేహంలో ఇనువైపుల నించీ...మహోధృత ప్రవాహంలా వెలువడుతుంటే... ఆ లంబోదరుడికి దేహానికి ఇరువైపులా మహాద్వారాలు ఏర్పడ్డాయి. అవే కర్ణములు. మహా పెద్దవిగా అవతరించిన కర్ణములవి. వాటిని చేటల్లాంటి చెవులు అని అన్నారు. అంతటి మహాకర్ణములు ధరించిన వాడు కాబట్టి లంబోదరుడిని విజ్ఞులు లంబకర్ణుడు అన్నారు. ఇక లంబకర్ణుడు నించి బయటపడ్డ మహాజలం మహాసముద్రంగా మారి నాలుగువైపులా నాలుగు సముద్రాలుగా అవతరించగా లంబోదరుడినించి విడుదలైన మాలిన్యం నాలుగు మహా సముద్రాల మధ్యన మహాజలం మీదపడి ఆధారపడి నిలిచింది. అదే బ్రహ్మాండము అదే శక్తి.

అట్టి బ్రహ్మాండము పైన రక్షణగా, రక్షకుడైన లంబోదరుడి పాదములు ఆకృతి ధరించగా లంబకర్ణముల మధ్యన తొండమునకు ఇరువైపులా మహాదంతములు ఒకొక్కటి ఉద్భవించాయి. మహాదంతములు కలవాడు గనుక అతడిని అనేక దంతుడు లేదా మహాదంతుడు అని పండితులు కీర్తించారు.

అటుపైన ఆ విశ్వరూపుడికి వదనం ఏర్పడింది. అంతకుముందే తొండము వున్నందున, దానికిరువైపులా రెండు దంతములు ఉద్భవించి నందున, వాటిని కలుపుకొని విచిత్రమైన వదనం ఏర్పడింది. చిన్న చిన్న నేత్రాలు రెండు వాటిపైన భ్రూమధ్యస్థానంలో అడ్డంగా త్రినేత్రం కూడిన ప్రసన్నవదనం ఏర్పడింది. ఆ రెండు నేత్రాలనూ సూర్యచంద్రులు అని మహర్షులు అభివర్ణించగా, ఆ మూడవ నేత్రాన్ని జ్ఞాననేత్రంగా మునులు వివరించారు. ఇకశిరోభాగం అంతరిక్షాన్ని దాటి కన్పించనంత పైన వున్నది. ఆ అంతరిక్షం అతడికి శిరోధారణమై శిరస్సుపైన కిరీటమై అలరారింది.

అంతట అతడి లలాటము నుండి ఓం ధ్వనిస్తూ వేదము ఉద్భవించింది. ఆ విశ్వవిరాట్ మూర్తిని, ఆ పరబ్రహ్మ స్వరూపుడిని కీర్తిస్తూ వేదం...శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్..ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే అని వేదగానం చేస్తుంటే విశ్వవ్యాపితుడైన ఆ లంబోదరు

డికి నాలుగు హస్తలు ఆయుధాలతో సహా ఉద్భవించాయి. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, మృత్తిక అనే ఈ పంచ భూతముల కలయికే యీ బ్రహ్మాండము. ఈ పంచశక్తులకి ఈ పంచగణములకి అధిపతి గనకనే ఆ మహాపురుషుడు గణపతి అయ్యాడు.

మహాశక్తులన్నింటినీ తనలో యిముడ్చుకొని విష్ణుతత్త్వము అనగా అంతటా తానై వ్యాపించే నైజం కలిగి, మహావిరాట్ స్వరూపము కలిగి వున్నాడు. గనుకనే మహాగణపతి అయ్యాడు.

వ్యాసా..వేదవ్యాసా...నా అనుగ్రహంచేత దైవాంశా సంభూతుడిగా జన్మించిన కారణజన్ముడా విను. ఈ మహాగణపతి నుండే..ఈ మూలవిరాట్ నుండే మొదట తనంత తానుగా స్వయంభువుగా పరబ్రహ్మము ఉద్భవించాడు. అతడే మహాగణపతి. ఈ మహాగణపతి నుండి మూల ప్రకృతి అయిన శక్తి ఉద్భవించింది. ఈవిడే ఆదిశక్తి. ఈ పరబ్రహ్మము ఆదిశక్తిల సంగమం నుండి మహేశ్వరుడు ఉద్భవించాడు. అనంతరం మహావిష్ణువు ఉద్భవించాడు. ఆ మహావిష్ణువు నాభి కమలము నుండి సృష్టికర్తయైన చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవించాడు. అనంతరం నలుగురు మనువులు, పంచ భూతములకు అధిదేవతలైన వరుణుడు, వాయుదేవుడు, అగ్నిదేవుడు, యమ ధర్మరాజు, ఇంద్రుడు జన్మించారు.

ఆ తదుపరి, ఆరుగురు కృత్తికామాతలు, సప్త మరుద్గణాలు, తదనంతరం సప్తలోకములు వాటికి అధిపతులైన సప్తమహర్షులు, సప్తవారములు, సప్తస్వరములు గాయత్రిలోని సప్త వ్యాహృతులు అటుపైన అష్టవసువులు, అష్టదిశలు, నవదుర్గలు,పదిమంది ప్రజాపతులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు వీరి తదుపరి మూడుకోట్ల దేవతలు పిదప సృష్టి వృద్ధిచెంది వివిధ రూపాలతో నామాలతో సర్వదేవతా స్వరూపమై 33కోట్ల 33 లక్షల 33వేల 33 వందల 33గా విరాజిల్లిన యావత్తు దేవతామూర్తులకు మానవ, దానవ, దేవ, కిన్నెర, కింపురుష, వృక్ష, పర్వత, నదీనద, సాగర, క్రిమి, కీటక సమస్త చరాచర సృష్టి అంతటికీ మూలాధారుడను నేనే. ఇదిగో నా విరాట్ స్వరూపాన్ని దర్శించు, ప్రకృతిని నేనే...పురుషుడిని నేనే విద్యను నేనే అవిద్యను నేనే వేదము నేనే నాదమును నేనే తర్కమును నేనే అజ్ఞానమును నేనే కాలమునేనే మృత్యువును నేనే ఈ సృష్టి సమస్తమూ నేనే. అంతటా నేనే అన్నీ నేనే...నేను కానిదేదీ లేదు. నేను శాశ్వితుడను నిత్యుడను నిర్వి

కారుడను నాశములేనివాడను విషయవాంఛా రహితుడను...నేను తప్ప కన్పించేదంతా అశాశ్వితము. ఇది నశించిపోయే జగత్తు దీనిని నేనే సృజించి, నేనే వృద్ధి చెందించి, చివరికి నాలో లయం చేసుకుంటాను. సృష్టి స్థితిలయ కారకులని పిలవబడే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులూ, సరస్వతి, లక్ష్మి, పార్వతులు, ఇంద్రాది దేవతలూ అందరూ నిమిత్తమాత్రులు.

నాయనా వ్యాసా మహాద్భుతమైన అనితరసాధ్యమైన పంచభూతాత్మ ప్రతిరూపకమైన నా పంచముఖ మహాగణపతి విశ్వవిరాట్ స్వరూప దర్శ నాన్ని నీకు అనుగ్రహిస్తున్నాను. నా పంచముఖ విరాట్ స్వరూపాన్ని దర్శించ డానికి నీకు జ్ఞానచక్షువులు ప్రసాదిస్తున్నాను. నీ పూర్వజన్మ సుకృతం చేత నీకీ అదృష్టం లభించింది. త్రిమూర్తులకి సైతం సాధ్యంకాని నా విరాట్ స్వరూపాన్ని దర్శించి తరించు అని పలికాడు మహాగణపతి వాత్సల్యంతో.

వేదవ్యాసునికి మరుక్షణం దివ్యదృష్టి లభించింది. అతడు దివ్యతేజో విరాజితుడైన పంచముఖాత్మక, పంచభూతాత్మక, పంచగుణాత్మక మహా గణపతి దివ్యస్వరూపాన్ని దర్శిస్తూ భావోద్వేగంతో ఆనందబాష్పాలు వర్షిస్తూ "ప్రభూ దేవాదిదేవా ఆదిపురుషా మనోహరమైన నీ దర్శనభాగ్యంతో నాలోని సందేహాలూ, సంశయాలన్నీ పతాపంచలయి పోయాయి. నీవు దర్శింపజేసిన లోకసృష్టి రహస్యంతో నా జీవితం ధన్యమైంది పరబ్రహ్మ త్రిమూర్తి స్వరూపా సమస్త దేవతా గణములచేత సేవింపబడుతూ, సమస్త జీవుల కామితార్థము లను ఈడేరుస్తున్న అనాధినాధా గణేశా మహాగణపతిదేవా నిన్ను ఏ విధంగా నేను స్తుతించను.

## ఫలం

వ్యాసాష్టక మిదం పుణ్యం గణేశ స్తవనం నృణామ్ ।
పఠతాం దుఃఖనాశాయ విద్యాం సశ్రియ మశ్నుతే ॥

"ప్రభో విఘ్నేశ్వరా నీ సుందరరూపాన్ని దర్శించిన ఆనందాన్ని నాకు శాశ్వితం చెయ్యి ఇంతకు మించిన బ్రహ్మానందం, మోక్షపదం నాకు అవసరం లేదు. ఇక ఈ క్షణమే నన్ను నీలో ఐక్యం చేసుకో నన్ను చరితార్థుడిని గావించు పాహిమాం గణపతిదేవా పాహిమాం పాహిమాం.. అని ప్రార్థిం

చాడు వేదవ్యాసుడు బ్రహ్మానందపూరిత గద్గద స్వరంతో.

నాయనా వ్యాసా..నీతో అష్టాదశ పురాణాలు చెప్పించిన వాడిని నీతో మహాభారతమును పలికించిన వాడిని నా వైష్ణవాంశారూపంగా నీకీ జన్మని యిచ్చినవాడిని నీకు ఎప్పుడు ఏది అనుగ్రహించాలో నాకు తెలియదా? ఈ కలియుగాంతము వరకూ నువ్వు చిరంజీవివై అదృశ్యస్వరూపుడివై సంచరించే వరాన్ని నీకు అనుగ్రహిస్తున్నాను. కవులకు సద్గురువువై గురు పూర్ణిమ నాడు పూజలందు కొంటూ ఉత్తమకవులు, రచయితల హృదయా లలో నివశిస్తూ వారిలో ఉత్తమోత్తమమైన, సంస్కారయుతమైన లోక క్షేమకర మైన ఊహలు ఆలోచనలకి ప్రేరణ కలిగిస్తూ సభ్యతాయుతమైన రచనలు వారి నుండి వెలువడునట్లు వారి సన్మార్గంలో నడిపించి చరితార్థుడివి, చరిత్రకారుడిగా భాసిల్లు...కలియుగాంతమందు నీకు మోక్షాన్ని ప్రసాదించి నాలో విలీనం చేసుకుంటా ప్రస్తుత నీ కర్తవ్యం గణేశ పురాణము రచించి నన్ను సంతోషపెట్టు నీకు సర్వదా నేను తోడుంటా శుభం శుభమస్తు అని ఆశీర్వదించి అంతర్హితుడయ్యాడు మహాగణపతి.

ధన్యోస్మి దేవా, ధన్యోస్మి అంటూ అంజలి ఘటించిన వ్యాసుడు సందే హాలన్ని వదిలేసి గణేశపురాణమును పూర్తిగావించాడు.

## కాశీలోని 56 వినాయక క్షేత్రములు

1 అర్క 2 దుర్గ 3 భీమచండ 4 దేహలి 5 ఉద్దండ 6 పాశపాణి 7 సర్వ 8 సిద్ధి 9 లంబోదర 10 కూటదంత 11 శ్యాలకటంగ 12 కూష్మాండ 13 ముండ 14 వికటదంత 15 రాజపుత్ర 16 ప్రణవ 17 వక్రతుండ 18 ఏకదంత 19 త్రిముఖ 20 పంచాశ్వ 21 హేరంబ 22 వింధ్యరాజ 23 వరద 24 మోదక 25 అభయ 26 సింహతుండ 27 కూనితాక్ష 28 క్షిప్రప్రసాద 29 చింతామణి 30 దంతహస్త 31 పిఛిండల 32 ఉద్దండ ముండ 33 స్థూలదంత 34 కలిప్రియ 35 చతుర్థంశ 36 ద్వితుండ 37 జ్యేష్ఠ 38 గజ 39 కాళ 40 నాగేష్ 41 మణికర్ణ 42 ఆశ 43 సృష్టి 44 యజ్ఞ 45 గజకర్ణ 46 చిత్రగంట 47 స్థూలజంఘ 48 మంగళ 49 మోద 50 ప్రమోద 51 సుముఖ 52 దుర్ముఖ 53 గణనాథ 54 జ్ఞాన 55 ద్వార 56 అవిముక్త

# భగవంతునికి నైవేద్యం

భగవంతుని అనుగ్రహాన్ని పొందేందుకు మనం ఆయనను అర్చిస్తాం. ఈ అర్చనలో ఆయా ఉపచారాలతో మనం భగవంతుడిని ఆరాధిస్తాం. ఉపచారం అనే దానికి ఉపాసన, కైంకర్యము, సేవ, గౌరవము మొదలైన అర్థాలున్నాయి. కాబట్టి సర్వ వ్యాపకుడు, సర్వాంతర్యామి అయిన భగవంతుణ్ణి ప్రభువుగా భావించి, ఆయన కటాక్షం కోసం, ఆయనకు ఆయా ఉపచారాలను చేయడమే అర్చనలోని అంతరార్థం.

మన ఆగమశాస్త్రాలు ఈ ఉపచారాలను ఎన్నో విధాలుగా పేర్కొన్నాయి. ఏకోపచారం (ఒక ఉపచారం) నుండి అష్టోత్తరశతం (108 ఉపచారాలు) వరకు కూడా ఈ ఉపచారాల వివరణలు వున్నాయి. వీటిలో షోడశ ఉపచారాలకు అంటే పదహారు ఉపచారాలకు ఎంతో ప్రసిద్ధివుంది. ఈ పదహారు ఉపచారాలతో చేసే పూజకే 'షోడశోపచారపూజ' అని పేరు. కాగా, ఈ ఉపచారాలలో నైవేద్యం ఒకటి.

**నైవేద్యం – ప్రసాదం :** భగవంతునికి సమర్పించిన నివేదనను మనం ప్రసాదంగా స్వీకరిస్తాం. ప్రసాదం అంటే...'అనుగ్రహం' అని అర్థం. అంటే భగవంతునికి అర్పించిన నివేదనను మనం భుజించడం వలన మనకు భగవదనుగ్రహం కలుగుతుందన్నమాట.

నిజానికి భగవంతునికి అర్పించని ఏ పదార్థాన్ని కూడా మనం భుజించ కూడదని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. అందుకే మనం భుజించే ఆహా రాన్ని పండ్లను భగవంతునికి నివేదించి, దాన్ని ప్రసాదంగా భుజించడం శ్రేయస్కరం.

ఆరు రకాల నివేదనలు...

పాయసం కృసరం గౌల్యం ముద్గాన్నం చ యవోదనమ్।

శుద్ధాన్నం చైవ షోఢాన్నం కారయేదుక్తమార్గతః॥

అంటూ ఆరు రకాలైన నివేదనలను ఆగమాలు చెబుతున్నాయి. వీటిలో పాయసం (పాయసాన్నం) అంటే పాలతో వండినది, కృసరం అంటే నువ్వు లతో కూడిన అన్నము, గౌల్యం అంటే బెల్లంతో కూడిన అన్నము, ముద్గాన్నం అంటే పెసలతో కూడిన అన్నము, యవోదనమ్ అంటే గోధుమలతో వండి నది, బియ్యముతో మాత్రమే వండినది శుద్ధాన్నంగా చెప్పబడ్డాయి.

వీటితోపాటు, వడలు, కుడుములు, లడ్లు మొదలైన పిండివంటలను కూడా భగవంతునికి నివేదించాలని పేర్కొనబడింది. ఇంకా ఆయా కాలాలలో లభించే పలురకాల పండ్లను కూడా భగవంతునికి నివేదించాలని శాస్త్రం అంటోంది.

**నైవేద్యాన్ని ఎలావండాలి ?** మన పూర్వీకులు నైవేద్యాన్ని వండేందుకు ఎన్నో నియమాలను ఏర్పరచినారు. భగవంతునికి నివేదించే వంటకాలను తలంటుస్నానం చేసి, శుభ్రమైన వస్త్రాలను (వీలైనంతవరకు మడి వస్త్రాలను) ధరించి పవిత్రంగా వండాలి. శూన్యలలాటంతో అంటే నుదుటబొట్టును ధరించకుండా నివేదలను వండకూడదు. తెల్లటి రంగుగల మంచి బియ్యాన్ని బాగుచేసిన పదార్థాలను మంచి రుచిని కూడిన కూరలు, కూరగాయలను నివేదనకు వినియోగించాలి. నివేదన తయారీకి శుద్ధమైన నీటినే ఉపయోగించాలి. మొత్తంమీద శుచి, శుభ్రతలతో నివేదనను తయారు చేయడం ముఖ్యం. అవకాశం వున్నంతవరకు ఆవుపాలనే నివేదనలకు వినియోగించడం శ్రేయస్కరం.

**ఏవేవి నివేదించాలి :** భగవంతునికి సాత్త్వికమైన ఆహారాలను మాత్రమే నివేదించాలి. వండిన తరువాత జాము సమయానికి పైబడినవి (3 గంటలు గడిచాక) సరిగా పక్వముగాని, రుచిలేని (రుచిపోయిన) చాలాకాలం నిల్వవున్న, అపవిత్రమైన ఎంగిలి అయిన ఆహారాన్ని భగవదర్పణచేయరాదు. నివేదనకు నిర్దేశించిన వాటిని ముందుగా వాసనచూడటం, భుజించటం లాంటివి చేయకూడదు. అదేవిధంగా బాగా మాగిన, చెడిపోని పండ్లను మాత్రమే భగవంతునికి నివేదించాలి. అంటే, కసిగా వున్న కాయలను, దోరగా వున్నవాటిని నివేదించకూడదు.

**ప్రసాద స్వీకరణ :** ప్రసాదాన్ని ఎంతో భక్తితో స్వీకరించాలి. ఆలయాలలో స్వామివార్లకు అభిముఖంగా అంటే ఎదురుగ కూర్చొని ప్రసాదాన్ని తినకూడదు. అదేవిధంగా ప్రసాదం రుచిగా లేదని విమర్శించడం, పారవేయడం లాంటివి చేయకూడదు. జననం లేదా మరణాల వలన ఏర్పడిన అశౌచం వున్నవారు (మైలవున్నవారు) ప్రసాదాన్ని భుజించకూడదు. స్త్రీలు ఆలయానికి వెళ్ళకూడదని సమయాలలో అంటే నెలసరి వచ్చిన అశుచి సమయములో ప్రసాదాన్ని స్వీకరించరాదు.

**ఏరోజు.... ఏ నైవేద్యం :** ఆయా దేవతలకు ఆయా రోజులలో చేయ వలసిన నివేదనలను గురించి కూడా మన సంప్రదాయాలు చెబుతున్నాయి. ముఖ్యంగా పరమేశుని పూజలోను, దేవీపూజలోనూ, విష్ణుమూర్తికి అర్పించ వలసిన నివేదనలను మన శాస్త్రాల ద్వారా తెలుసుకోవచ్చు.

**పరమేశునికి :** కారణాగమము ఆయా రోజులలో శివునికి అర్పించా ల్సిన నివేదనలను పేర్కొన్నది. ఆదివారం రోజున పాయసాన్నం, సోమవారం రోజున ముద్గాన్నం (పెసరపప్పుతో కూడిన అన్నం) మంగళవారం తిలాన్నం (నువ్వులతో కూడిన అన్నం) బుధవారం చక్కెరపొంగలి, గురువారం పెరుగన్నం, శుక్రవారం రోజున శుద్ధాన్నం, శనివారం రోజున మాషాన్నము (మినుములతో కూడిన అన్నం) శివునికి నివేదించాలి.

**దేవీపూజలలో :** అమ్మవారి అర్చనలో ఆదివారం రోజున పాయసాన్ని సోమవారం రోజున పాలను, మంగళవారమునాడు అరటిపళ్ళను, బుధవారము నాడు వెన్నను, గురువారం నాడు కండచక్కెరను, శుక్రవారం నాడు చక్కెరను, శనివారమునాడు ఆవుపాలను అమ్మవారికి నివేదించడం మంచిది. ఇక నవరాత్రులలో అమ్మవారికి పాడ్యమిరోజున కట్టుపొంగలిని, విదియరోజున పులిహోరను, తదియ రోజున కొబ్బరి అన్నాన్ని, చవితి రోజున అల్లంగారెలను (రంధ్రాలు లేకుండా), పంచమిరోజున పెరుగన్నాన్ని షష్ఠిరోజున కేసరిని, సప్తమిరోజున శాకాన్నాన్ని, అష్టమిరోజున చక్కెర పొంగలిని, నవమిరోజున పాయసాన్ని, దశమిరోజున చిత్రాన్నాన్ని నివేదించాలి.

కాగా వినాయకుడికి కుడుములు, విష్ణుమూర్తికి చక్కెర పొంగలి, బెల్లం పొంగలి, పులిహోర, పెరుగు మొదలైనవి. హయగ్రీవస్వామికి శనగబేడల పాయసం, సరస్వతికి పరమాన్నం, ఆంజనేయస్వామికి వడలు ప్రీతికరమని చెబుతారు. ఏది ఏమైనప్పటికీ భక్తిపూర్వకంగా, శక్త్యానుసారంగా భగవంతు నికి నివేదనలను అర్పించి, భగవదనుగ్రహాన్ని పొందవచ్చు.

## మోక్షము లభించుటకు సర్వ శ్రేష్ఠమైన మార్గములు

సృష్టిలోని జీవులన్నింటి జన్మలకన్న మానుషజన్మ విశిష్టమైనది. జ్ఞానం లోను, తెలివిలోను, బుద్ధిబలంలోను మానవునిదే పైచేయి. జీవులన్నింటిలో మోక్షము పొందు అదృష్టము ఒక్కమనిషికే ఉన్నది. ఈ భూప్రపంచములో మోక్షముపొందే దైవ స్వయంభూ క్షేత్రాలు వందలున్నప్పటికి, ప్రధానంగా ఏడు ప్రధాన క్షేత్రాలను శాస్త్రాలు సూచించినవి. అవి అయోధ్య, మధుర, హరిద్వార్, కాశీ, కాంచీపురము, అవంతికి (ఉజ్జయిని) ద్వారక. ఈ ఏడు పవిత్ర క్షేత్రములు మోక్షదాయకములు. ప్రాణము పోవు చిట్టచివరి క్షణంలో "నేను సన్యసించితిని" అని పరిపూర్ణత కలిగి మనస్సుతో ఎవరైతే చెబుతారో వారికి కూడ మోక్షము లబించునని శాస్త్రములు చెబుతున్నవి. జీవితపర్యం తము పంచాయతన దేవతలైన మహావిష్ణు, పరమశివుని, లలితాపరమేశ్వ రుని, సూర్యుని, గణపతిని, (సుబ్రహ్మణ్యునికూడ) ఎవరైతే మనసా కర్మణ, వాచ తపస్సుతో సాదన చేస్తారో వారికి మోక్షము తథ్యము. ఈ దేవతా ఉపాసనతోటి సత్య,ధర్మ, అహింసలను తప్పక పాటిస్తేనే మోక్షానికి అర్హత ఉంటుంది. ఈజీవిత చివరకాలంలో తపస్సు తోటి సత్యము ధర్మము అహింస ఎవరు అనవరతము పాటిస్తారో వారికి సత్యజ్ఞాన ప్రకాశము కల్గుతుంది. ఈ జ్ఞానము కల్గిన వెంటనే మోక్షగామి అయినట్లే. ఈ సత్య జ్ఞాన ప్రకాశముతో అరిషడ్వర్గములు సమూలంగ దేహము నుంచి పరారై పోతాయి. తామరాకుపై నీటిబొట్టువలె జీవిస్తాడు.దేనినీ అంటుకోడు. ఏదీ తనను అంటదు. అంటేది అంటించుకునేదికూడ అక్షర పరబ్రహ్మాన్నే. తానే పరబ్రహ్మ స్వరూపంగ భాసిస్తాడు. హరహర, హరిహరి, రామ రామ, కృష్ణ కృష్ణ అని ఎవరు అనవరతము స్మరిస్తుంటారో తామరపువ్వు నీళ్లను చేదించుకొని ఎట్లు పైకి వచ్చునో అట్లే నరకమునుండి వారిని ఉద్ధరిస్తానని శ్రీకృష్ణపరమాత్మ పలుమార్లు చెప్పినాడు. సర్వపాపహరమగు సాలగ్రామ శిలవుండే చోట, ద్వారకలో వుండే గోమతీ (చంద్రప్రతిమ) శిల ఉండేచోట మోక్షము లభించును. తులసిచెట్లను నాటుటవలన పెంచుట వలన కాపాడుట వలన, అలాగే మారేడు రావిచెట్లు నాటుట వల్ల నీరుపోసి పెంచుటవల్ల మానవుల యొక్క అనేక జన్మార్జితములైన పాపములను ఈ దేవతా వృక్షములు సమూలంగా పోగొట్టుతాయి. మానస తీర్థములో (మనస్సు) సత్యమనే (భగవంతుడు) జలముతో నిండియుండి, రాగద్వేషము లనే దోషములను పోగొట్ట గలిగిన జ్ఞానమనే సరస్సులో ఎవరు స్నానము చేస్తుంటారో వారికి ఏ పాపములు అంటవు.

చేపలు పట్టేవారు ప్రతి దినము గంగానదిని, నర్మదా నదిని చేపల వేట నెపముతో దర్శనము చేస్తూనే ఉన్నారు. అంతమాత్రాన వారికి మోక్షము రాదు. ఎందుకంటే వారి మనస్సు ఎప్పుడూ చేపలవేట మీద తప్ప భగవం తుడిమీద ఉండదు. ధర్మము కొరకు, సత్‌బ్రాహ్మణుల కొరకు, స్త్రీలకొరకు, పిల్లలకొరకు ప్రాణములను ఎవరైతే ఫణంగా పెడతారో వారికి మోక్షము ముంగిటే ఉంటుంది. గోసంరక్షణ కొరకు, దేశముకొరకు, దేవాలయ రక్షణకు ఎవరైతే ప్రాణాలు అర్పిస్తారో వారికి స్వర్గము ప్రాప్తిస్తుంది. కుటుం బంలో సుఖభోగములు అనుభవిస్తూ జీవుల ఎడల, వృక్షములపట్ల సేవాభావము, త్యాగభావము కలిగిఉండి, భగవంతుని నిత్యము సేవిస్తూ జీవించవలె. కురుక్షేత్రమునందును, భృగు క్షేత్రమునందును, శ్రీశైలము, ప్రభాసము, అబూపర్వతము, త్రిపుష్కరము భూతేశ్వర క్షేత్రములలో ప్రాణ ములు వదలినవారు నేరుగా స్వర్గమునకు పోవుదురు. నిర్జల ప్రదేశము లందు జలసౌకర్యవ ఏర్పరచినవారు, నిర్ధనుడైన బ్రాహ్మణునికి దానమొసం గెడివారు, సకలప్రాణులపట్ల అచంచల దయ కలిగినవారు నేరుగా స్వర్గము నకు పోదురు. ధర్మాత్ములు, సదాచారవంతులు, భగవత్ సేవాతత్పరులైన బీదవారికి దానము చేసేవారు, ఉపేక్షింపబడిన శివలింగమును పూజించుట, అనాథప్రేతలకు ప్రేత సంస్కారము నొనర్చుట మొదలగు సత్‌కర్మలు కోటి యజ్ఞములు చేసిన ఫలము లభించును.

మోక్షమును ప్రసాదించుటలో శివపంచాక్షరీ,నారాయణ అష్టాక్షరీ మహా మంత్రాలు అనుష్టించదగినవి. నారాయణ అష్టాక్షరీ మహామంత్రమే సర్వ కార్యములను సాదించును. అలాగే శివపంచాక్షరీ మహా మంత్రము కూడ. వేదములు, యజ్ఞ యాగాది క్రతువులు సమస్తమూ నారాయణ పరముగా ఉన్నవి. పృధివ్యప్తేజో వాయువ్యాకాశములనెడి పంచభూతములున్నూ శివ నారాయణాత్మకములే. మనస్సు, అహంకారము, బుద్ధి,చిత్తము, జ్ఞానము, భూత భవిష్యత్ వర్తమానములు, స్థూల, సూక్ష్మ, స్థావర జంగమ సమన్విత మైన సకల బ్రహ్మాండము శివనారాయణపరమై యున్నవి. శబ్దాది విషయ ములు, శ్రోత్రాదీంద్రియములు, ప్రకృతి పురుషులు శివనారాయణ ఆత్మక ములైయున్నవి. కావున నిరంతరము శివుని నారాయణుని వారి వారి మహా మంత్రములతో జపించిన మోక్షము వారిముంగిటే ఉంటుంది. జగత్ అంతయు శివమయమని, నారాయణమయమని, దేవీమయమని భావిస్తూ స్మరిస్తూ, దైనందిన కార్యక్రమాలు ఆచరించవలె. తద్వారా సర్వ పాపములు దగ్ధమైపోవును. మోక్షము సిద్ధించును.


కర్మ సిద్ధాంతము
పుణ్య, పాప, మిశ్ర కర్మముల వివరణము
కర్మము
పుణ్యకర్మము (దేవతా శరీర ప్రాప్తి)
పాపకర్మము (పశు, పక్షి, మృగాది శరీర ప్రాప్తి)
మిశ్రకర్మము (మనుష్య శరీరప్రాప్తి)
పుణ్యోత్కర్షము
హిరణ్యగర్భ శరీర ప్రాప్తి
పుణ్యమధ్యమము
ఇంద్రాది దేవగణ శరీర ప్రాప్తి
పుణ్యసామాన్యము
యక్ష, రక్ష, పిశాచాది శరీర ప్రాప్తి
మిశ్ర ఉత్కర్షము
నిష్కామకర్మానుష్ఠానము చేత చిత్తశుద్ధియు, దానివలన సాధన చతుష్టయ సంపత్తి, దానివలన సద్గురులాభము, దానివలన చేయంబడిన శ్రవణ మనన నిధి ధ్యానములచేత కలిగిన జ్ఞానము వలన జీవన్ముక్తి సుఖము లభించునట్టి శరీరప్రాప్తి
మిశ్రమధ్యమము
స్వాశ్రమోచిత కామ్య కర్మంబులకు తగిన శరీర ప్రాప్తి
మిశ్రసామాన్యము
చణ్డుల వ్యాధాది శరీరప్రాప్తి కలుగును
పాపఉత్కర్షము
పరులకు సంతాపకరములగు సర్ప, వృశ్చిక, యూక(పేను), వన మక్షిక, మత్కుణ, మశక, విష వృక్షాది శరీరప్రాప్తి
పాపమధ్యమము
ఆమ్ల, పనస, నారికేళ, మహిష, అశ్వ, మేష, గార్దభాది శరీరప్రాప్తి
పాపసామాన్యము
గో, గజాశ్వత్థ వృక్షాది శరీరప్రాప్తి
సూచన:– మిశ్రోత్కర్షము: కాన వివేకియైనవాడు కర్మఫల తారతమ్యము విచారించి మిశ్రోత్కర్షము లభింపయత్నింపవలయును. ఇవి మనోవాక్కాయములచేత చేయబడు త్రివిధకర్మానుగుణ్యజన తారతమ్యములు.




సూచన :- ఇట్లు త్రివిధ కరణములచేత త్రివిధ కర్మములు చేయబడుచున్నవి. వీనికి సాక్షియైన నాకు ఈ వికారములేమియు లేవని నిలిపిన వాడే ముక్తుడని శాస్త్ర సిద్ధాంతము.

# స్వర్గప్రాప్తికి మార్గములు

సత్యభాషణము, ధర్మాచరణము, పరాక్రమమును సర్వభూతముల యందు దయకలిగియుండుట, ఇతరులకు కష్టము కలుగకుండ నింపుగా మాట్లాడుచుండుట, దైవ, బ్రాహ్మణ పూజనములు అతిథి సత్కారములు జరుపు చుండుట, స్వర్గము లభించుటకు ముఖ్యమైన మార్గములని మహా పురుషులు సత్యముగా చెప్పియున్నారు.

బురదలో కూరుకుపోయిన ఆవును పైకి తీసి రక్షించుట, ఉత్తమ స్త్రీకి దాస్యము తప్పించుట, దొంగలనుండి సాధువులను రక్షించుట, వధ (మరణదండన) నుండి ఉత్తముని తప్పించుట ఇట్టి సత్కార్యములు చేయుచుండెడివారు నరకమునకు ఎప్పటికీపోరు.

శ్లో॥ అహంకాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహం ।
ఇతి బృవాణ సతతం కాశీవాస ఫలం లభేత్ ॥

తా. నేను కాశీకి పోయెదను. అచ్చటనే వుందును. అని ఎల్లప్పుడుధృఢ నిశ్చయముతో పలుకుచుండువారికి కాశీ నివాస ఫలము లభించును. కాశీ నివాసము మోక్షదము.

శ్లో॥ వారణాస్యుత్తరేభాగే సుమన్తుర్నామవైద్విజః।
తస్య స్మరణ మాత్రేణ నిర్ధనో ధనవాన్ భవేత్ ॥

తా. కాశీ క్షేత్రములో ఉత్తర దిశయందు సుమస్తుడనెడు ద్విజుడు కలడు. ఆతనిని ప్రతినిత్యము స్మరించుచుండిన యెడల దరిద్రుడు ధనవంతుడుగా మారును.

గృహస్థు ప్రతిదినము ఈ క్రింది ఆరు నిత్య పూజలు జరుపవలెను.

1. దేవతా పూజ : ప్రాతఃకాలమున విధిగా 'కరుణామూర్తియగు సర్వేశ్వరా' యను దైవ ప్రార్ధనగావించ మరియు రాత్రి నిద్రించుటకు ముందును స్మరింపవలసిన శ్లోకములతో ఈ దైవ ప్రార్థన గావింపవలెను. మనస్సును దైవమునందు లగ్నము గావించువారు ప్రశాంత చిత్తులు, ధార్మికులు, లోకపావనులు కాగలరు.

2. పితృపూజ : తల్లిదండ్రులకు అవసరమగు వానిని సమకూర్చి, వారి మనస్సునకు సదా తృప్తిని కలిగించవలెను. ప్రతిదినము కొంత సమయము వారితో గడుపుచుండిన వారు తృప్తులగుదురు.

3. మనుష్యపూజ : గృహస్థులకు ప్రధాన ధర్మమగు అతిథి అభ్యాగతులను తన శక్తి ననుసరించి ఉన్నదానితో తృప్తిపరుపవలయును.

4. భూతపూజ : మానవులకేగాక, తనకంటే ముందుగల జీవరాశులు, పశువులు, పక్షులు, పెంపుడు జంతువులగు కుక్కలు, ఆవులు, గుర్రములు మొ॥గు వానికి మేతవేయుట, నీరుపెట్టుట, స్నానాదికములను నెరవేర్చిన పిమ్మటనే తాను భోజనము చేయవలెననెడి నియమము పాటింపవలెను.

5. ఋషిపూజ : సన్యాసులను, మహనీయులను, పండితులను ఆదరించి అన్న, పాన, దన, వస్త్రాదులతో యధాశక్తి పూజించి సత్కరింపవలెను.

6. అగ్నికార్యము : ప్రతినిత్యము రెండు పూటలు వంట అయిన పిమ్మట కొద్దిగా పదార్ధములను అగ్నికి ఆహుతి నీయవలయును. ఆ విధముగనే వండని పదార్ధములు పాలు, పెరుగువంటివి కూడా అగ్నికి ఆహుతి నిచ్చుటయే గృహస్థ యజ్ఞమనబడును.

సూచన : ప్రస్తుత కాలములో అధిక సంఖ్యాకులు గ్యాస్‌స్టవ్‌లతో వంటచేసి కొనుట కలవాటుపడిన వారికిది అనుకూలించక పోవచ్చును. భోజన పదార్ధములన్నియు వండిన పిమ్మట అన్నింటిపై కాస్త నీరు చిలకరించి భగవంతున కర్పణ గావింప వలయును. పూజావిధానములోని నైవేద్య సమర్పణ ఇచ్చుట అనుసరింపవలయును.